ఖ9 271-4029

# జాతి జీవితం - కళాపరిణామం

18.5.98 GNT.



రచన : 'బుర్రకథ పితామహ' నాజర్
అమరావతి రోడ్,
గుంటూరు.

# అంకితం

**జననీ జనకులకు**

జనపద కళాకారులకు

iV

## మనవి - మాట

నేను బుర్రకథలో చెప్పుతున్న జాతి పరిణామక్రమాన్నీ, కళల, కవితల కర్తవ్యాలను, ప్రజాజీవిత విశేషాలను, కష్టనష్టాలను, కళల గణికగా మార్చుట అవి నానాటికి క్షీణదశకు చేరుట మొ॥ నా వివరణల వినీ, ఈ అంశములను గ్రంధరూపంలో వ్రాయమని, యువతరానికి అందించమని, ప్రోత్సహించిన శ్రీయుతులు **డాక్టర్ చెలికాని స్టాలిన్ బాబు** గార్కి, **పూజ్యశ్రీగన్నా బత్తుల నారాయణ మూర్తి** గారికి, **పిలాని వీరభద్రరావు** గారికి తదితర బుర్రకథ కళాకారులకు, ఈ గ్రంధరచనకు ప్రోత్సహించుటే గాక ఎన్నో అమూల్య సలహాల నందించిన **శ్రీనివాస చక్రవర్తి గార్కి**, నన్నెన్నో విధాల తీర్చిదిద్దిన **కమ్యూనిస్టు పార్టీకి** నా హృదయపూర్వక కళాభివందనములు.

ప్రమాదకరమైన నాజబ్బుకు నన్ను ఇతర డాక్టర్లు 30 వేలడగగా, ఆపరేషన్ ఉచితంగా చేసి నాకు పునర్జన్మ ప్రసాదించిన పూజ్యులుదయార్ధహృదయులు పేదల పెన్నిధి **డా॥ కాసరనేని సదాశివరావు గార్కి** పాదాభి వందనములు. నాకష్టసుఖాల పాలు పంచుకొన్న నాసతీమణి **ఆదంబికి** అభినందనలు.

ఈ గ్రంధ రచనలో ఎన్నో ఎన్నెన్నో చిత్తు నోట్సులను సరిదిద్ది, చక్కని అక్షర మాలికల్లో వ్రాసిన నా పెద్ద కుమార్తె **ఆలీనాను**. ఈ గ్రంథంలో ఉన్న విషయాన్ని చెప్పక చెప్పే రీతిలో అట్టపై, పుస్తకంలో, బొమ్మలు దిద్దిన నాచిన్న కుమారుడు **బాబూజీని**, ప్రింటుకు తోడుపడిన పెద్దకుమారుడు **సాయిబాబుని** ను, చిరంజీవి **హరిబాబుని** ఆయురారోగ్యవంతులుగా కీర్తివంతులుగా, తీర్చిదిద్దేందుకు నటరాజును ప్రార్థిస్తున్నాను.

**నా యీ గ్రంధాన్ని అచ్చువేయుటకు అర్థికంగా సహకరించిన గుంటూరు. యల్.వి.ఆర్. సన్స్ అండ్ క్లబ్. యాజమాన్యానికి ముఖ్యంగా చాగంట సాంబిరెడ్డి గార్కి కళాభివందనములు అర్పించుచున్నాను**

'బుర్రకథ పితామహ' నాజర్

## పీఠిక

పంచభూతాలు ఏర్పడినవి. భూమి పుట్టింది. వానర దశనుండి నరుడిగా పెరుగుతూ నీరును కనుగొన్నాడు. నిప్పును తెలుసుకొన్నాడు. నిప్పుతోపాటు ఉప్పును కనుగొన్నాడు. కొండలు గుట్టలూ దాటుతూ మైదానాలపైకి వచ్చాడు. ఆహారాన్ని సంపాదించుకోవడంలో ఆత్మరక్షణకై పోరాటాలు సల్పుతూ మృగాలనుండి పశు పక్ష్యాదులపై ఎనలేని పోరాటాన్ని సాగించి ఎదురు నిల్చి, తానుగా ఎదిగి పెరుగుటకై మైదానాలకు వచ్చిన మానవుడు పలుకుకై (మాట) నింగినేలనుచూచి గుర్తులు పెట్టుకొన్నాడు. రాళ్ళు రప్పలనుండి వెదురు తుప్పలనుండి, వెతకి విల్లంబులు చేసుకొన్నాడు. వేటలో అలసిసొలసివచ్చిన మూలుగుల నుండి ఏర్పడిన మూలాక్షరాలు ఏర్పడి, మిట్టలు పల్లాలు సరిచేసికొని, పొళ్ళుకొట్టి పరిసరాలు పరిశీలించాడు. పక్షుల తిండినుండి ఏర్పడిన ఫలకందమూలాదులు తిన్నాడు. ఫలాలు రుచిచూచిన మానవుడు బతుకు బాటలో పయనం సాగించాడు. క్రమాభివర్ధి చెందిన మానవుడు నివాసప్రాంతాలను ఏర్పరచుకొన్నాడు. జంబూ ప్రాంతాన్ని నివాసంగా ఏర్పరచుకొన్నాడు. జాంబుడు పాలించిన ద్వీపము జంబూద్వీపమని, కాంచనాద్రిగా కనక దుర్గమ్మ కొండగా నేటికి తెలుగుప్రాంతంలో విలసిల్లుచున్నది. ఇది శ్రీనాజర్ నినదించే నినాదం.

నేను ఎంతో గర్విస్తున్నాను. సంతోసిస్తున్నాను. సింహ గర్జనను పలికించి ప్రకటించే నాజర్! నీ కంఠధ్వానం తెలుగుజాతికి శంఖారావం! నాజరే బుర్రకథ, బుర్రకథే నాజర్. నాజర్ బుర్రకథ విడదీయరాని జంట. యక్షగాన యశస్సుకై అహోరాత్రులు కృషిచేసిన పెద్ద నాజర్....నాజర్....., వారి కృషి మహత్తరమైనది. మహోన్నతమైనది. వారి కథలో 34 యేండ్లు నుండి విన్న విషయాలే ఈ గ్రంథం. తెలుగు వాళ్ళ పుట్టుపుర్వోత్తరాలు, వారు పాలించి శాశించిన శాసనాలు, ప్రసిద్ధి చెందిన ప్రాంతాలు, హద్దులు, సరిహద్దులు తెలుసుకోవాలంటే చదవాల్సిన పుస్తకం, ఇది వానరుడిగా, నరుడిగా పుట్టిపెరిగి, పరిణీతి చెందిన విధానాన్ని తెలియజేసి ఆహార ఆత్మరక్షణకై అహర్నిశలు పోరాటాలు, సాగించినట్టి అనుభవాన్ని గడించి పలుకులశక్తిని, ములుకులశక్తిని పెంపొందింపచేసిన మహనీయుడు మానవుడు చేసే కృషే ఈ గ్రంథం. అంగాంగ విన్యాసాల ద్వారా ఆటపాట ద్వారా జాతిని మేల్కొలిపి ఉత్తేజపరచిన, ఉత్సాహపరచిదే, సాంప్రదాయాలను సృష్టించి, ఉత్సాహపరచి దేశ సాంప్రదాయాలను సృష్టించిన రచించిన మనిషి మనిషి మహర్షి ఈ మానవుడు. దీనిని ఈ స్వరూపాన్ని, మాతృదేశ గౌరవాన్ని నిలుపుటలో భారతదేశం అన్నపదానికి నిర్వచనం మహనీయుడు నాజర్.

జాతి, జీవితచిత్రణలో మానవాళి సాధించిన పోరాటాల విన్యాసాల పోకడలు జీవిని కాదని ఉద్ధరించబడలేదని, ఆటపాటలు నుండి నృత్తనృత్యగానాలు పరిణతి చెందినవని, సాహిత్యం పుట్టిపెరిగిందని తెలియచేసినవాడుగా చరిత్రలో మరపురాని వ్యక్తి నాజర్. వ్యాస, బాస కాళిదాస, నన్నయ, తిక్కన సౌరభాలకు అసలు సిసలైన గుబాళిలపులు ఎలాఏర్పడినవో వారి పేర్లతో పూర్వాపరాలను మోసాలెలా జరిగినవో అడుగు అడుగునా జాతివేసిన ప్రతి అడుగును గుర్తుకు తెచ్చిన మాన్యుడు నాజర్.

యక్షులు గంధర్వులు, కిన్నెరుడు, నాగులు అంటేఎవరో వారివారి వృత్తి ప్రవృత్తులను అందచేసినవాడు మనవాడు తెలుగువాడు దూదేకుల తెగనుండి పుట్టిపెరిగినవాడు షేక్ బిబాబి, మస్తాన్‌గార్ల ముద్దుబిడ్డడు నాజర్.

కులమతాలకుళ్లు, వర్ణాశ్రమధర్మాల విన్యాసాల వరవడిని తెలియచేసిన తెలుగునాట అత్యుత్తమ కళాకారుడు నాజరు. ఆర్య బానిసత్వం నుండి భారతదేశం తెలుగుదేశంతో సహవిముక్తి జరిగిన తీరు, ఇస్లాం ఇంగ్లీషు ధనికపాలకుల దోపిడినుండి బయటబడిన పోరాటరీతులు తెలియచెప్పుటకు ప్రయత్నించిన **ఈ జాతి జీవితం - కళ పరిణామం** గ్రంధాన్ని చదవండి, చదివించండి, చదువుల విలువ పెంపొందించండి

భవదీయ

పురాణం సుబ్బారావు

జ్ఞాన పీఠ పురస్కార గ్రహీత,
పద్మభూషన్ డా॥ సి. నారాయణరెడ్డి

హైదరాబాద్
22-3-97

# అభిప్రాయం

నాజర్ అనగానే నిలువెత్తు రూపంలో నిలిచి గర్జించే, కన్నీరునించే బుర్రకథ కనిపిస్తుంది. అది ప్రేక్షకుల కండలను కదిలిస్తుంది, కంటతడి పెట్టిస్తుంది. కేవలం జానపద పరిధిలో తిరుగాడే బుర్ర కథకు జానపదంతో పాటు జ్ఞానపథం చూపించిన అసాధారణ కళాకారుడు పద్మశ్రీ నాజర్.

శ్రీ నాజర్ తొలినాళ్ళలో ఏమీ చదువుకున్నట్టులేదు. మలినాళ్లలో ఎంతో చదువుకున్నట్టున్నాడు. ఈ పుస్తకమే అందుకు సాక్ష్యం. అట్టడుగు జనంలో అణిగిపడివున్న తేట నిజాలను చెబుతూనే ఉన్నట్టుండి నాజర్ లక్షణ గ్రంధాల్లోకి ప్రాచీనశాస్త్రాల్లోకి-- ఉవ్వెత్తుగా ఎగిసిపోతాడు. నాట్యశాస్త్రం మొదలుకుని వాత్స్యాయన కామసూత్రాలవరకు అధ్యయనం చేసిన నాజర్ ఈ పుస్తకంలో కనిపిస్తాడు. ఎవరికీ తట్టని అభిప్రాయాలు చెబుతాడు. మొచ్చుకుంటానే గొటితో గుచ్చినట్టు తన స్వంతతీర్పులను వ్యక్తం చేస్తాడు. జాతి జీవనంతో పెనవేసుకుపోయిన సంగీత, నాట్య, నాటకాది కళలను గురించి సరికొత్తగా చెప్పడానికి ప్రయత్నిస్తాడు. నన్నయ భారత రచనకుముందు జానపదుల గూడేలకు వెళ్ళి వారి పాటలను వినిమననం చేసుకున్నట్టు ఈ గ్రంథంలో ఉంది (పేజి 180) ఇది ఇంతవరకు ఏ సాహిత్య చరిత్రకారుడూ చెప్పంది. ఇలాంటి అభిప్రాయాలు, సాహసించి చేసిన నిర్ణయాలు ఈ పుస్తకమంతటా ఉన్నాయి. నాజర్ స్వతంత్ర సమాలోచన దృష్టికి వీటిని తార్కాణలుగా చూపోచ్చు.

"వ్రాతక్షరము" "కామకథలు", "కల్పితరాతలు" "ఘగనం" లాంటి వింత పదప్రయోగాలు నాజర్ తెలియకచేసినవి కావు. అవి ఉద్దేశ్యపూర్వకంగా చూసినవే అని అనిపిస్తుంది. ఏమైనా బుర్రకథాకళాకారుడు అగ్రేసర స్థానంలో నిలిచిన నాజర్ వ్యక్తిత్వానికి మరోపార్శ్వం "జాతిజీవితం-కళాపరిణామం" అనే ఈ గ్రంథం. ఆయన ప్రకటించిన ఎన్నో అభిప్రాయాలతో ఏకీభవించలేకున్నా ఏదో కొత్త విషయం చెప్పాలనే తపనను మాత్రం గుర్తించక తప్పదు. నాజర్ నిర్యాణం తరువాత - రాతప్రతిగా ఉన్న ఈ గ్రంథాన్ని ప్రచురిస్తున్న ప్రచురణకర్తలకు అభినందనలు.



# విషయసూచిక

# సంకేతాక్షర వివరణ

| | | |
|---|---|---|
| ఆం॥వా॥త్యం | : | ఆంధ్ర వాచస్పత్యం |
| తైత్తరీయ | : | తైత్తరీయోపనిషత్ |
| సం॥ఆం॥ నిఘంటువు | : | సంస్కృతాంధ్రుని ఘంటువు |
| జ॥ద | : | జగత్కధ |
| సా॥దం | : | సామవేదం |
| ఋ॥దం | : | ఋగ్వేదం |
| నా॥దం | : | నాట్యవేదం |
| య॥దం | : | యజుర్వేదం |
| నాట్య॥స్త్రం | : | నాట్య శాస్త్రం |
| అభి॥ణం | : | అభినయదర్పణం |
| హఠ॥క | : | హఠయోగ దీపిక |
| సం॥ర్పణం | : | సంగీత విద్యాదర్పణం |
| తం॥య | : | తంజావూరు యక్షగానం |

---

సూచన : పంచభూతాలు - ఘగన ప్రసాదాలు అనుపేరుగల అధ్యాయంలో "ఘగనం" అనే పధంలో మొదటి అక్షరం "ఘ" ప్రయోగింపబడినది - ఎందుకనగా 'గ' అనగా వాయువు శబ్దంలేనిదని, 'ఘ' అనగా శబ్దము గలదని (వాగతి గంథయో : దాతువు నుండి ఈవాయువు వాయువులో శబ్దం బుట్టెను) ఋగ్వేదం, అ॥ 40 సూ॥ 17 లో ఉన్నది. కావున 'ఘగనం' అనుటే సమంజసం అని నాభావన.

1

# దేవుడు - దేవి

' దేవుడే ఈ ప్రకృతిని సృష్టించెను.' 'దేవుడే జీవ రాశులను పుట్టించెను.' 'దేవుడే సమస్తము'. ఇది నేటి జనుల అవగాహన, నమ్మిక. కాని ఈ దేవుడు ఎవరు ? ఈ దేవుని **రూప - నామ - క్రియ** లేమిటి ?

శ్లో ॥ స్సత్యశ్చిత్రాహ ః శ్రవస్తమాః
దేవో దేవేభిరాగమత్ ॥

(ఋగ్వేదం - అ-సూ)

**రూపం** అనగా **సత్యం, శివం, సుందరం.**

సత్యం - అనగా ప్రకృతిలో సూర్యుడని, జీవుల్లో ఆకలని భావిస్తున్నాను.

శివం - అనగా ఇచ్ఛాశక్తి- పరిశ్రమ శక్తి - విజ్ఞాన శక్తి. ఈ శక్తిత్రయమే 'శివం' అని నిఘంటు నిర్ణయం. అంటే జీవిలో ఊరే ఆకలి (ఇచ్ఛాశక్తి), ఈ కోరికను తీర్చునట్టి పరిశ్రమ (పరిశ్రమ శ క్తి), ఈ పరిశ్రమకు మార్గదర్శి అయిన విజ్ఞానం( విజ్ఞాన శక్తి).

సుందరం- అనగా ఇచ్ఛా (కోరిక), పరిశ్రమ, విజ్ఞాన త్రిశక్తులకు ఉపయుక్తమైనట్టి, యోగ్యమైనట్టి , జ్ఞాన కర్మేంద్రియాలమరినట్టి జీవి యని, ఋగ్వేద వాక్యానికి నిఘంటు నిర్వచనం. నేనీ జీవిని విజ్ఞాన, ప్రజ్ఞాన, బ్రహ్మజ్ఞానాది సంపూర్ణ మానవుడని భావిస్తున్నాను. కనుక **సత్యం, శివం, సుందరం** గుణాల కలయిక కల్గినట్టి మనిషే దేవుని రూపం అని నిర్ణయం చేయవచ్చు.

**నామం** - అనగా మూర్తి త్రయం. అంటే విజ్ఞాన మూర్తి, న్యాయ మూర్తి, పరోపకార మూర్తి. అనగా న్యాయం లక్షణంగా కలవానిని న్యాయమూర్తి యని, తనుచేసే ప్రతిపని యొక్క ఫలితమును ఇతరులకు చెందునట్లు కోరుకునే వ్యక్తిని పరోపకార మూర్తి యని, ఆడి తప్పని వానిని సత్యమూర్తి యని 'నామం' నిర్ణయం చేయవచ్చు.

**క్రియ** (పని) - అనగా 'భూతతత్వ విచారణ, మానవోపయోగ మార్గాన్వేషణ, ప్రకృతి సూత్రాల్లో మొట్ట మొదటి దైనట్టి ఆత్మరక్షణ, ఆహార సంపాదనల ఎరుక వగైరా కార్యక్రమ నిర్వహణ ' అని నిఘంటు నిర్ణయాల నమ్ముతున్నాను. అంటే

వైద్య విధ్య, పోరాట విధ్య, న్యాయవిధ్య, అర్థవిధ్య వగైరా అరువదినాలుగు విద్యలు కల్గియుండుటనే 'క్రియ' (పని) అని నిర్ణయం చేయవచ్చును.

కావుననే యీ రూప, నామ, క్రియ లమరినట్టి మానవుడే దేవ పదానికి అర్హుడు అన్నారు అనుభవజ్ఞులు. అంతే గాక 'దేవః' అనగా 'బ్రహ్మజ్ఞాని' అనియు, 'పంచభూత పరిజ్ఞాని' అనియు అర్థములున్నవి. ఈ నిర్వచనం (సం॥అం॥) నిఘంటు ప్రకారం చూస్తే

శ్లో ॥ గణికా గర్భ సంభూతో వశిష్ఠశ్చ మహాముని
తప సా బ్రహ్మణో జాత సంస్కారస్తత్ర కారణ
(పూర్వ గాధాలహరి)

తా॥ ''మాదిగింటాడ పడుచు మాతంగి బిడ్డడైనట్టి, మాది గింటికే అల్లుడైనట్టి వశిష్ఠుడు బ్రహ్మజ్ఞాని''

కాబట్టి కౌసల్య, దేవకి మరియు మరియమ్మలు గన్న శ్రీరాముని, శ్రీకృష్ణుని, ఏసుని దేవుళ్ళనుటకు, వశిష్ఠుని బ్రహ్మజ్ఞాని (దేవ) అనుటకు, వీరు పై లక్షణాలు (రూప, నామ, క్రియ) నిండిన మానవులే కదా !. కావున **దేవుడు, దేవి** అనుపదాలు పై లక్షణాలు (రూప, నామ, క్రియలు) నిండిన మానవులను కొనియాడే గౌరవ బిరుదులని నేననుకుంటున్నాను.

## ౨. పంచభూతాలు - ఘగన ప్రసాదాలు

ఈ విశాల జగత్తుకు మూలమైన పంచభూతాల జన్మవృత్తాంత మెట్టిది? పంచభూతాలనే శబ్దం, గాలి, నిప్పు, నీరు, భూవములను దేవుళ్ళో, దేవతలో, బ్రహ్మజ్ఞానులో పుట్టించారా ? లేదు. అది నిజం గాదు. మరి పంచభూతాలావిర్భావ పరిణామం ఏమిటి ?

పెద్దలు కొందరు 'ఆకాశం ఘగనం శూన్యం' అంటున్నారు. అదే నిజ నిర్వచనమైతే ప్రకృతే లేదని, జీవలోకమే వుండేది కాదేమోనని అనుకుంటున్నాను.

**ఘ** - అనగా శబ్దమ్ అంటే చైతన్య సూచిక. శబ్దమును 'ధ్వని' మరియు 'నాదం' అని వాటి వాటి ప్రత్యేక లక్షణాలను బట్టి పిలుచుకొనవచ్చును. 'ధ్వని' అనగా ముందుగ చెవికి వినుపించునది. (ఉదా ॥ చప్పుడు, ఉరుము)

నాదం - అనగా ఆ వినుపించినది చిలుక పలుకో, కోయిల గానమొ, గాడిద ఓం(డొ తెలుసుకొన వీలైనది. అట్టి ఈ శబ్దం గుణం గా కల్గినది ఆకాశ మని అంటే ఎల్లప్పుడూ అహర్నిశలు శబ్ధం చేయుటే పనిగా, గుణంగా కల్గినది ఆకాశమన్నారు అనుభవ కాలజ్ఞానులు. (దీనినే '' మొత్తం గుణంగా మార్చి వేయునని మొత్తం లేనట్టి గుణం దురూహ్యమని '' అన్నారు కారల్ మార్క్స్).

**గస్** - అనగా వాయువు లేక గాలి, ఆకాశం యొక్క బిడ్డ అని నిఘంటువు ల నిర్వచనం. అంటే గాలి, శబ్దం ఆకాశానికి పుట్టిన కవలలు లేక ఆకాశానికి రెండు నే(త్రాలు అనవచ్చు ననుకుంటున్నాను. వీటి రెంటికీ కదిలే జీవలక్షణం, విస్తరించు స్వభావములున్నవి. కనుకనే వీటిని **జీవశబ్దం , (ప్రాణ వాయువు** అన్నారు.

**అమ్** - అనగా కనుపించనట్టి, కనుపించుచున్నట్టి వన్నీ పుట్టుటకు హేతువు, వాయువు మరియు శబ్దం తం(డియైనట్టిది ఆకాశమని నిఘంటు నిర్వచనాల నమ్ముతున్నాను. జీవ (ప్రపంచ అనుభవకాల జ్ఞానుల్లో ఒకరైన 'భగవత్' బిరుదాంకితుడనదగిన సుశ్రుతుడు, పృధి వ్యాది పంచభూత (ప్రకృతి అవతారాలు ఎలాగేర్పడినవో (క్రింది విధముగా రచించెను.

శ్లో ॥ తధ్యధా శబ్దతన్మా(త్రం స్పర్శత న్మా(త్రం రూప
తన్మా(త్రం రసతన్మా(త్రం రసతన్మా(త్రం గంధతన్మా(త మితి''

(సుశ్రుత శరీరశా(స్త్రం పేజీ 3 శ్లోకం 7'')

అంటే జీవాకాశం యొక్క జీవ శబ్దం, గాలి లేక (ప్రాణ వాయువుల అన్యోన్య (ప్రయాణ ఒరిపిడి ఘర్షణలో అగ్నితత్వమైన వేడి పుట్టెను. ఈ వేడిలో కదిలే జీవలక్షణం విస్తరించు స్వభావం వున్నందున దీనిని 'జీవాగ్ని' అన్నారు. జీవాగ్ని, జీవశబ్దం, (ప్రాణ వాయువుల న్యోన్య (ప్రయాణ ఒరిపిడి ఘర్షణలొ ''నీరు'' పుట్టింది, ఐతే నీళ్ళలోను జీవలక్షణం విస్తరించు స్వభావ మున్నందునే ''జీవజలం'' అన్నారు విద్యావంతులు అనే దేవుళ్ళు. (ప్రాణవాయువు, **జీవశబ్దం** జీవాగ్ని, జీవజలం, ఉమ్మడి (ప్రయాణ ఒరిపిడి ఘర్షణలొ ''భూమి'' పుట్టింది.ఎలాగంటే మంచు ధూళిలో రేణువులు, అగ్ని గోళం నుండి జారిన లావాలు, అగ్ని కణాలు, జల (ప్రళయ చిట్టాలు ఇత్యాదులు కలిసి పారి, పేరి, ఆరి నీళ్ళలో దిబ్బలేర్పడినవి. ఈ దిబ్బలనే ''భూమి'' (ధరి(త్రి) అన్నారు. దీనిలోను

జీవలక్షణం విస్తరించు స్వభావం ఉన్నందునే 'జీవధాత్రి' అన్నారు. ప్రముఖముగా ఇట్లేర్పడిన ''ప్రాణవాయువు'' ''జీవశబ్దం'' ''జీవఅగ్ని'' 'జీవజలం'' ''జీవధాత్రి'' వీటన్నిటి ఏకత్వమునే ( భిన్నత్వాల ఏకత్వము) '' ప్రకృతి'' అనగా గొప్పది, పెద్దదిగా రూపొందినది అన్నారు అనుభవకాలజ్ఞానులు. విస్తరించుస్వభావం జీవలక్షణములున్నట్లే, ఎన్నో స్వభావములున్న ప్రకృతి యొక్క ప్రయాణ ఒరిపిడిలోనే పగలు, రాత్రి ఏర్పడెను. చీకటి వెలుగులు ఏర్పడెను. ఈ చీకటి వెలుగుల, పంచభూతాల ప్రయాణ ఒరిపిడి ఘర్షణలో వసంత ఋతువు, గ్రీష్మ ఋతువు, శరదృతువు, హేమంత ఋతువు, శిశిర ఋతువు, వర్ష ఋతువులనే ఆరు తరుణము లేర్పడెను. వీటన్నింటి ప్రయాణ ఒరిపిడి ఘర్షణలో చలికాలం, ఎండాకాలం, వర్షాకాలాలు ఏర్పడెను. ఈ కాలాలనే 12 నెలలుగా విభజించారు. ''పన్నెండింట్లో నాలుగు పోతే సున్నా'' అంటే ''పన్నెండు నెలల్లో నాలుగు నెలలు వర్షాలు కురవకున్న అంతా సున్న'' అనే సామెత పుట్టింది.

ఈ ప్రకృతి ఆవిర్భవించిన పరిణామ క్రమాన్ని నేనీవిధంగా పోల్చుతున్నాను. బుర్రకథగానం చేస్తున్నాడు కథకుడు. నాభిస్థానం నుండి నాదాన్ని వాయువు పైకి పైపైకి మంద్ర, మధ్యమ, తారాస్థాయిలలో, ఊపిరితిత్తుల రొమ్ము బలంతో కుత్తిక, కంఠం, కొండనాలుక సహకార పట్టుతో కపాలరంధ్రం ద్వారా బైటికి తోయుటలో కథకుని శరీరంలో అగ్నితత్వమైన వేడి పుట్టినది. ఆ వేడెక్కిన శరీరం నుండి చెమట నీరు శరీరంలోని లవణాలు, గాలిలో ధూళి కలిసి ఆరిపేరి దురదేర్పడును. అరిచేతితో రుద్దితే తాలికలు తాలికలు మట్టిరాలును. మట్టికి మారుపేరు భూమి. యిలా పుట్టినవే పంచభూతాలు కాని మరో విధంగా కానే కాదు.

## 3. జీవభాండం - బ్రహ్మాండం

పృధివ్యాది పంచభూతములతో అంతర్ లీనమైయున్న జీవాణువులతో నిండియున్న తిండి మొక్కల కుండలాంటిదే ప్రకృతి .దీనినే 'బ్రహ్మాండం' అన్నారు అనుభవజ్ఞులు. 'బ్రహ్మ' అనగా జీవులను వృద్ధి పొందించునదని, 'అండము' అనగా గ్రుడ్డు అని నిఘంటు నిర్వచనము.

జోరున విడవకుండా పదిరోజులు కుండపోతగ వర్షం కురిస్తే భూమి పచ్చగా రంగుమారుతుంది. ఈ ఆకుపచ్చ భూమిపైన ఏవేవో పీచులు నాచులు పొడుచు

కొస్తుంటాయి, ఈ పీచూ నాచులనే గడ్డి మొక్కలంటున్నాము. ఈ గడ్డి మొక్కలే పూపొదలకు, ఫల వృక్షాలకు, కీకారణ్యాలకు మాతృకలైన తొలి రూపాలు.

ఈ వర్షపునీరు కొండల, పర్వతాల దొనలందు, వాగుల వంకలందు ఆరక, పారక నిలిచుంటే అందులో కొన్నాళ్ళకు గుండ్రనివి, కదిలేవి జీవాలు కనిపించును. కనుక ఆ చెరువుల, దొరువుల నీరు వడకట్టి త్రాగాలంటుంటాము మరియు గ్రుడ్డు పుట్టిందంటాము.

మరికొన్నాళ్ళకి ఆ గ్రుడ్డు పొడవుగా సాగి, నీటిపైన, నీటి లోపల ప్రాకుచుండును. అది చూచి నీటిలో పురుగు పుట్టింది త్రాగటానికి పనికిరాదంటున్నాము. కాబట్టి ఈ కదిలే, ప్రాకే జీవాకారాలె పశు, పక్షి, మృగ జీవ జంతువులకు మానవులతో సహా జీవలోకానికి జన్మదాతలంటున్నాను.

ఈ జీవ పరిణామ క్రమాన్ని అనుభవ కాలజ్ఞానులు, దేవుళ్ళనే విద్యావంతులు, సత్యవంతులు క్రింది విధంగా వర్ణించారు .

శ్లో ॥ ఆత్మన ఆకాశసంభూతః ఆకాశద్యా ః వాయోరగ్నిః
అగ్నేరాపః అబ్దః ప్రుధివీ పృధివ్యో ఔషదయః
ఔషదభ్యో అన్నమ్ అన్నాత్ పురుష ః ॥

(త్తైత్తెర్ యోపనిషత్తు బ్రహ్మసూ -॥)

తా ॥ జీవుల కన్న ముందుగా ఆహారం పుట్టెను. ఆహారం ముందు పుట్టి ఆహారం నుండే జీవి పుట్టెను. అంటే జీవులను పెంచేది ఆహారం, జీవలోకానికి పరమవుషధం ఆహారం అని ఉన్నది. కాబట్టి ఆ ఆహారము నుండి జీవులుద్భవించెను. (దీనినే **'ఓమ్ - ఖమ్ - బ్రహ్మ'** అన్నారని నేననుకుంటున్నాను.)

**ఓమ్ - ఖమ్ - బ్రహ్మ :**

**ఓమ్** - అనగా ఇందులో అ, ఉ, మ, అని మూడు నాదాలు వున్నవి. 'అ' అనగా పృధివ్యాది పంచభూత ప్రకృతి అని, 'ఉ' అనగా తేజస్సు, వికాసాలని, 'మ' అనగా సంతానం, జీవోత్పత్తి అని నిఘంటు నిర్ణయం.

అంటే ప్రకృతి శక్తుల ప్రయాణ ఒరిపిడి ఘర్షణలో, వాటిలో కదిలే అంటే ప్రకృతి స్వభావములున్న జీవాణువులు తునకలై, కణములై, ప్రతి కణము ఒక జీవిగా వాతావరణ అనుకూల పరిస్థితులందు వ్యక్తి జీవులుగా వికసించెను. నరజీవితొ సహా పుట్టెను. ('ఓమ్'

అనగా మరొక అర్థం జీవ ప్రకృతి. జీవ జాతులు తమతమ నిత్యవసరాలు, అవస్థలు, ఆలోచనలు, బహిరంగపరచు కొనుటకు, వివరించుకొనుటకు, పంచభూతాల్లో ఒకటైన శబ్దమును వాడుకొనుట, అరచుట, కూయుట, కేకలు, కేరింతలు, కిచకిచలు వగైరా నాదాలు ప్రకటించుట).

**ఖమ్** - అనగా జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, విజ్ఞానముతోసహా పదకొండు జ్ఞానకర్మేంద్రియాలు వాటి విధులు నిర్వర్తించుచున్నవి.

**బ్రహ్మ** - అనగా ఆహార ఆత్మరక్షణ విధులందు, నిత్యవసరాలందు, శక్తి యుక్తుల, ధైర్య సాహసాల, ఓర్పు నేర్పుల కూర్చి జీవజాతులను వృద్ధిపొందించు చున్నది. ఇది ఈ **ఓమ్, ఖమ్, బ్రహ్మ** సంకేతాక్షరాలకు నిఘంటు నిర్వచనము.

జీవగణాలిట్లా వ్యక్తిరూపాలు, అందచందాలు, ఆలోచనలు, విజ్ఞాన, ప్రజ్ఞాన శక్తియుక్తులు, సామర్థ్యాలు పెంచుకుంటున్న వ్యక్తి జీవులు వేటికవిగ, విడివిడిగ కనిపిస్తున్నాయి, కొన్ని కొన్ని తేడాలునట్లు అనిపిస్తున్నాయి కాని, వీటన్నిటికి కొలికి పూసమాత్రం ఒక్కటె. ఈ తేడాలకు కారణాలు వాతావరణాలు, ఆహార విహారాలు, అభిరుచులు మాత్రమే కాని, ఇవన్నీ బాల్య, యవ్వనం, కౌమార్యం, వార్థక్యం, మరణం అనుభవించవలసిందేనని నాభావన. మరణం అంటే ప్రకృతి నుండి జీవులుగా రూపుదిద్దుకున్నట్టి, జీవులన్నిటిలోనున్న ధ్వని ధ్వనిలోను, గాలి గాలిలోను, నిప్పు నిప్పులోను, వేటిలో అవి పంచభూతముల్లో కలియుటే మరణ లక్షణం. అనగా ఎల్లప్పుడూ దేన్నో, ఏ జీవినో కనటం, బ్రహ్మతత్వం వృద్ధి పొందించటం, అదే సమయములో దేనినో క్షీణింపజేయటం, చంపటం, తనలో విలీనం చేసుకోవటం, పనిగా కల్గినదే వృత్తియై యుండునదే ప్రకృతి.

''శివునెరుక లేనిది చీమైనా కుట్టదని, పుట్టించిన వాడు పెట్టకమానడని, నారు బోసినవాడు నీరు బోస్తాడని, మనం నిమిత్తమాత్రులమని, మిధ్యని, పుక్కిట పురాణాలతొ అబద్ధాలతో 'అన్నంలో పుట్టిన పురుగు' అనే లోకోక్తిని కప్పి పుచ్చారు. కనుక జీవాణువుల కుండయైన ప్రకృతి 'జీవభాండమని', పుట్టించి పెంచే గ్రుడ్డు 'బ్రహ్మాండమని' నా భావన.

# 4. వ్యక్తి జీవులు - శక్తి వంతులు

'' మశ్చ కూర్మ వరాహశ్చ నారశింహశ్చ వామన ః
రామో రామశ్చ రామశ్చ బుద్ధ ః కల్కిరే వచ ః''

అర్ధం ॥ మశ్చ = చేప, కూర్మ = తాబేలు, వరాహ = పంది, నరసింహం = సింహాన్ని త్రోసి రాజన్న నరప్రతినిధి, వానర ః= దాహానికై , ఆహారానికై ప్రకృతి పరిసరాలలో తిరుగాడిన నరప్రతినిధి. రామో= పరశురామ, శిలాయుగ నరప్రతి నిధి, రామశ్చ = 'శ్రీరామ', విజ్ఞాన సంపన్న మానవప్రతి నిధి, మూడవ రామశ్చ = ''బలరామ'', శరీర మానసిక ఐక్యతా బలసంపన్న మానవ ప్రతినిధి, బుద్ధ ః = బుద్ధి, జ్ఞాన సంపన్న విజ్ఞాన జనప్రతినిధి, కల్కి= ప్రకృతి శక్తులలో ఒకటైన భూమిపై ఆడవి, పోడు, బీళ్ళు కొట్టి, దున్ని, దోకి, పంట పొలాలుగా మార్చినట్టి భూపతన కలియుగా రంభ లగ్న కర్తలైనట్టి , తిరుగుబాటు, విప్లవ కల్లోల తత్వజ్ఞులైనట్టి విజ్ఞాన మానవ ప్రతినిదే 'కల్కి' కల్లోల సృష్టి కర్త. అని పై శ్లోకానికి అర్ధం.

రెండుకోట్ల యేండ్లనాడొ కోటిన్నర యేడ్లనాడో ఒక 'మృగం' పుట్టినదని, ఆ మృగాన్ని **'ఈఊ'** అన్నారనీ జీవశాస్త్రంలో వున్నది.

**ఈ** : అనగా సరస్వతి. అనగా శ్రేష్ఠమైన స్త్రీ .(స్త్రీ అనగా బిడ్డలను కనే ఆడదని లక్ష్మి అనగా లోకమాతని, పార్వతి అనగా గణనాయకని అర్థాలున్నవి.)

**ఊ** : అనగా మానవజీవి యని, ఆంధ్రవాచస్పత్యంలో అర్థమున్నది.

కానీ రెండు కోట్లు, ఒకటిన్నర కోట్ల యేండ్లనాడు మానవతా లక్షణాలుంటే ఉన్నవేమో కాని సంపూర్ణ మానవుడు పుట్టి యుండడు. అది నరజీవొ, నరమృగమో పుట్టి యుండును. నాటి ఆ **నరమ్మ** కన్న వాళ్ళు గనుక వాళ్ళను నరులని, నరజీవులని అన్నారు జీవ శాస్త్రజ్ఞులు.

''గర్భస్థ శిశువునకు వెంట్రుకలు, గడ్డం, మీసాలు, రోమాలు, శరీర ఎముకలు, గోళ్లు, ద ంతాలు, శిరలు, స్నాయువులు, ధమనులు, శుక్రము, మొదలగు కఠిన పదార్థములు తండ్రి వలన'' సంక్రమించును. (ఆం॥ వా॥ అర్థం)

గర్భస్థ శిశువునకు మాంసము, రక్తము, మేధస్సు, మజ్జ అనే మూలిక, హృదయము, నాభి, యాకృత్తు, ప్లీహము, ఆంత్రములు, గుదము మొదలగు మృదుపదార్థములు తల్లి

వలన బిడ్డలకు సంక్రమించును. (శు॥ శ.. శాస్త్రము పేజీ 48 - 21 - 49 - 21లో ఉన్నది.) అంతేకాదు మాత యొక్క గర్భాశయం నుండి ధమని గర్భంలోని శిశువు యొక్క నాభిలోనికి వ్యాపించి యున్నట్టి శిరలతో చుట్టబడి, తల్లితో బిడ్డ ముడిపెట్టబడి పుట్టుచున్నది. నేటికీ ఇది జరుగుచున్న వాస్తవ సత్యము.

నేటి వైజ్ఞానిక యుగంలో సూక్ష్మదర్శిని యంత్రాలద్వారా పెద్దజంతువుల గర్భస్థ పిండాలను పరీక్షించి అన్ని జంతువులు, నరజీవులతో సహా మొదట మత్స్యాంగకము (చాపగాను), కొన్నాళ్ళకు ఆ పిండము పుచ్చకాయ సగం బద్ద బోర్లించి నట్టిరీతిలో ఉండునని, మరికొన్నాళ్ళకు బోర్లించిన పుచ్చబద్ద ఆకారానికి రెండుప్రక్కల రెండు గట్టి బుడిపెలు మరోపక్క ఒక్కబుడిపె యేర్పడును. ఈ ఆకారాన్ని ''కూర్మము'' (తాబేలు)గా నిర్ణయించారు. ఈ ఐదు బుడిపెలే నరశిశువుకు రెండు చేతులు రెండు కాళ్ళు ఒక తల్లగా యేర్పడుచున్నవి. ఇదే జీవుల జన్మ వృత్తాంతమంటున్నారు దేవుళ్లనే సత్యవంతులు. మరియు నరుల ఆలోచనల తుట్టె ఐనట్టిది 'మెదడు'. ఇది నరుల యొక్క బుద్ధి జ్ఞానాలకు, విజ్ఞాన కర్మేంద్రియాలకు, పనులు పురమాయించును. అంటే ఆత్మ రక్షణ, తక్షణావసరాలు తీర్చే రీతిలో అంగ, ఉపాంగాలు నటిస్తాయన్న మాట. అంటే నిన్ను నీ బుద్ధి 'నీళ్ళు తాగుము' అన్నదనుకోండి తక్షణం ''నీళ్ళు'' ''మంచినీళ్ళు'' అని జపిస్తే నీకు దాహం తీరదు. కాగితం మీద 'నీళ్ళు, నీళ్ళు' అని రాసినా దాహం తీరదు. నీవు మంచినీళ్ళు త్రాగితేనే నీకు దాహం తీరుతుంది. దీన్నే 'ప్రత్యక్ష జ్ఞానము' అన్నారు అనుభవజ్ఞులు.

నరజీవుల నాళ్ళు నరాలందు నాల్గుకోట్ల కణజాలములున్నవని, ఇవన్నీ నరుల ఆహార ఆత్మ రక్షణాది ప్రాధమిక దినచర్యలందు ఇచ్ఛాశక్తి పెరగడం, అందువల్ల అభ్యాసాల, అనుభవాల ప్రాతిపదికపైన జ్ఞాన విజ్ఞానం పెరగటం, విజ్ఞానం పెరిగే కొలది ప్రజ్ఞానం అనగా పరిశ్రమశక్తి పెరగటం (అంటే పనుల్లో, పరిశ్రమల్లో నైపుణ్యాలు పెరగటం, ) జరుగును. ఈవిధంగా శరీర, మానసిక, బలసంపదల పెంచుకొనుటకు తల్లీ దండ్రుల నుండి సంక్రమించి నట్టి ఈనాడులు నరాలు తోడు పడుతుంటాయని, తక్షణ పరిశ్రమలకు సంభంధించినట్టి అవసరాలకు సంభంధించినట్టి నటనా రీతులలో నరులను తర్ఫీదు చేయుచు, అదుపు చేయుచుంటాయని, ఈ నరనాడులు వగైరా వస్తుసముదాయం తోడుపడతాయని శరీర శాస్త్రములో యున్నది. నరుల సర్వతోముఖాభివృద్ధికి

కారణమైనట్టి ప్రధానమైనట్టి మెదడు, కండరాలు, నాళ్ళు,నరాలు పాడైతే మొత్తంగా మనిషే పాడైనట్లవుతుంది. (శు-శా-శాస్త్రం.)

ఈ నరజీవి యెన్నో జీవుల వెనుక బుట్టి సరస్వతి (శ్రేష్ఠమైన స్త్రీ, బిడ్డల గనే ఆడపడుచు అనే అర్థం) బిడ్డలుగా, లక్ష్మి (లోకమాత) శిశువులుగా, పార్వతి (గణనాయకి) సంతతిగా వృద్ధి చెందింది. పంచభూత ప్రకృతిని ముందరిజుట్టు బట్టుకొని వంచి తవః అవసరాల కనుగుణంగా వాడుకుంటూ అభివృద్ధి మార్గంలో పయనిస్తున్న బిడ్డలకని పెంచింది. 'ఆడది' కాని మగ మనిషి కాదని శాస్త్రాల్లో వుంది .

అంటే ! నర జీవి పుట్టి వృద్ధిచెందుటకు, వ్యక్తి జీవులుగ, శక్తివంతులుగ అగుటకు స్త్రీ ప్రధాన కారణం అని నానమ్మకం. అందుకే తల్లి వాస్తవం, తండ్రి విశ్వాసం అన్నారు తాపీ ధర్మారావు గారు. కాబట్టి తల్లే జీవరాసులను వ్యక్తి జీవులుగ, శక్తి వంతులుగా తీర్చిదిద్దింది. (వ్యక్తి జీవులు = ప్రత్యేక లక్షణాలు కలిగిన జీవులు)

## 5. ఈడు ముదిరింది - జోడు కుదిరింది

''స్త్రీణాం సంస్మర్మదర్శనా ఛవితే శుక్రేవ్య వాయజాన్ దోషాన్''

అనగా యుక్తవయసు యువతీయువకులు వారివారి శరీర వాసనలు సోకిన, ఒకరికొకరు తాకిన, ఒకవిధమైన సంభాషణలు చేసిన, శుక్రం చలిస్తుందని, అలా చలించిన శుక్రం తిరిగి శరీరానికుపయోగపడదని పై శ్లోకానికి ఆంధ్రవాచస్పత్యంలో అర్థమున్నది. వివరాలు ముందు ముందు చెప్తాను.

నాడీ వయ్యారికి, వలపుల చెలికి పిండప్రధానం చేసిన చెలికాడెవడు? జోడుకోసం దేవులాడుతుంది నారమ్మ. మామిడి మానుక్రింద అంగాంగాలు అలిసి ఆరేశు కూర్చున్నాడు కోతయ్య .తన కాళ్ళకు, వాడి కాళ్ళకు, తన చేతులకు వాడి చేతులకు తేడా లేదే ! అని ఏక దీక్షతో చూస్తుంది నారమ్మ . వాడి అంగాంగాలు దృష్టిని కేంద్రీకరించి చూస్తుంది నారమ్మ . అటే అల్లటే మళ్లీ మళ్లీ చూడగా నారమ్మ వళ్లు పులకించింది. కోతయ్య తలెత్తి ఆమె వంకచూచి 'టప్‌టప్' కళ్లార్పుతు, పళ్ళికిలించాడు. (''కోతయ్యకా చిల్లగొండి రోగం ఇప్పటికీ వుంది'' అంటుంటారు. అదేమంటే వంటరిగా ఆడమనిషి కనిపిస్తే ఇప్పుడూ కొంగుపట్టి చాటు మాటుకు లాగ చూస్తాడట.)



నరమ్మ,కోతయ్యల కుటుంబ పరిణామం



## 11

నారమ్మ మెల్లగా వాడి దాపునకు వెళ్ళింది. గీరుకుంటున్న వాడి తల్లో పేలు పొరాడుట చూచి, కూర్చొని అతని తల్లో పేలేర సాగింది. కోతయ్యకు హాయిగుందేమో ! అట్టనే ఆమె వళ్ళోకి జరిగి వక్షోజాల మీద వాలి నిద్రబోయాడు. నారమ్మ కూడా ఏదో మైకం కమ్మినట్లు వాడిపై చేయ్యుంచే నిద్రలో మునిగింది.

ప్రాధమికమ్మైన ఆహార ఆత్మరక్షణాది దినచర్యలందు విడదీయ వీలుకాని ఆత్మకలయిక యిరువురి మధ్య యేర్పడినది. ఒకేతిండి, ఒకచోటే నిద్ర, యవ్వన వయసు వాసనలు వారిని మరీ దగ్గరకు జరిపాయి. ఈడు జోడు, కోరికలు ముహూర్తాన్ని స్థిరీకరించాయి. మదాలు, ఉద్రేకాలు నాలుగు చేతులను ఏకం చేశాయి.

ప్రకృతిలో ''కడుపు తున్నమ్మ కనక మానదు'' అనే సామెత పుట్టింది. నారమ్మ కన్నది, కంటున్నది. కన్న వాడికే కన్నది, తాకన్న వాళ్ళల్లో , వాళ్ళకు వాళ్ళే కంటున్నారు. ప్రపంచంలొ ఎన్నొ జీవుల వెనక ఇట్లా జన్మించిన నరమ్మ కోతయ్యల సంతానం గంపెడై, గుంపెడై నరమ్మ గన్న వారంతా నరగణంగా వృద్ధి చెందినది.

పాలిచ్చి పెంచి ప్రకృతి ప్రసాదాలు తిని, బిడ్డకు తినిపించి తినటంనేర్పిన తల్లి , ఎంతో ఓర్పు నేర్పులతో ప్రకృతి పరిసర శత్రువర్గ ఆటు పోట్లకు తట్టుకొనుట, ఆహార ఆత్మరక్షణ విధానాలు నేర్పినది . 'మనమంతా కలిసుంటే కలదు సుఖం.' అనే గుర్తింపు, సంఘచైతన్యం, కలిగించినది తల్లి. ఆపదలు, ఆర్భాటాలు, ఆనందాలందు ఆడటం, ఆరవటం, సమయస్ఫూర్తి నెరిగించు రీతిలో నినదించటం నేర్పిన తల్లి నీడలో, తల్లి పెత్తనం క్రింద పెరుగుట వలననే తల్లికి 'మాతృదేవోభవ' అనే మహోన్నత స్థానం ఇచ్చారు. కనుకనే తల్లి వాస్తవం, తండ్రి విశ్వాసం అన్నారు. 'స్త్రీలు పురుషులని - ఆడామగా అని, అమ్మానాన్న అని, ఆలూమగలని, భార్యా భర్తలని, తల్లీ తండ్రని, అత్తగారింటికని, అమ్మగారింటికని, తల్లికడుపు చల్లనిదని, తల్లి కడుపు నచెడబుట్టాడని, భూదేవియని, నేలతల్లి, మాతృదేశం, కళామతల్లి అని స్త్రీ ప్రాముఖ్యతను, స్త్రీ అధిక్యతను తెలియజెప్పే లోకోక్తులు ప్రజల నాలుకలపై నాటికి నేటికి కోకొల్లలుగ నాట్యమాడు తున్నవి . తొలి నరజీవి స్త్రీ అనగా బిడ్డలకనే ఆడది అని ఋజువు చేస్తున్నవి శాస్త్రాలు.

( దీర్ఘకాలిక జీవితాను భవాలే సామెతలు . ఇవి సాంఘీక సూత్రాలు, వాక్యాలు. ఇవి చారిత్రక స్వభావాన్ని కలిగుంటాయని కారల్ మార్క్స్ వ్రాశారు. ॥మార్గదర్శి॥)

# ౬. తిండ్లకు పోరాటం నీళ్ళకు దేవులాడటం

గణాలు పెరిగాయి, కోరికలు, అవసరాలు పెరిగాయి. శారీరక మానసిక పనులు, పరిశ్రమలు పెరిగాయి. కానీ ఇంతగా ప్రసాదాలను అందించే ప్రకృతి శక్తులు, ఆహార వనరులు, వస్తువులు అంతగా పెరుగుట లేదేమో! ఆకలి ఆరాటాలు, దేవులాట లెక్కువైనవి నరగణాలకు.

చలి వంట్లో నీరును వడకట్టి పోతే, మిడిమిడి ఎండలు, వడగాల్పులు మంట మండిస్తున్నవి. దొరువులు, చెరువులు సెలయేళ్ళతొసహా నీళ్లారుతున్నవి. ఎండి బీటలు బారుతున్నవి, నాలుకలు ఆర్చుకు పోతున్నవి.

పలుక శక్తి లేదు. గొంతులో చెమ్మలేదు. నీళ్ళెక్కడున్నవో పసిగట్ట లేని పశు, పక్షి, మృగజీవ జంతువులు నాలుకలు చాచి పండుటాకులవలే నేలరాలు తున్నవి. నరులే నీళ్ళకోసం గుహలు వదలి త్రిలింగాలు దిగీ జీవ నదీ నదాల, సముద్రాల వెంట నత్తలు, పీతలు, చాపలు, జల్లలతొ ఆకలి తీర్చుకుని ప్రాణాలు నిల్పుకుంటున్నారు, వీరినే వానరులన్నారు.

నాటి వానరుడికి నడవటం, పరుగెత్తటం, పోరాడటం నేటి మనవలెనే అను కోకూడదు! ఎడబిడ్డల్లే బందాడటం, నడుం వంగిన ముదుసలి తాతలా, అవ్వలా వెనక్కాళ్ళు వంగి వంగనట్లు నిలిచి, తప్పటడుగుల పడుతూ లేస్తు, లయబద్ధంగాని, వంకర టింకరగా నడుస్తున్నారు. ఆత్మ రక్షణకొ, ఆహార సంపాదనకో, ముందరి కాళ్ళతో వాటుబట్టి చిన్నా పెద్దా మానులు ప్రాకటం, కొమ్మలు పట్టి వంచి పండ్లు తుంచి, కాయలు కోసి నోటి కందించు కోవటం, వ్రేళ్ళాడు వాలు కొమ్మలుపట్టి ఊగి తూగి, మరో కొమ్మకు లంఘించి వడిసి పట్టటం ఇలా వారి నిత్య ఆహార, ఆత్మరక్షణ, పోరాట వ్యాయామ కసరత్తులలో కాళ్ళు చేతులు, మోకాళ్ల మోచేతులు పిల్లి వంపులు తిరిగేటి మన చేతులు, కాళ్లవలె మారుతున్నవి. ముఖ్యంగా ముందరి కాళ్ళబొటన్న వ్రేళ్ళు నాలుగు వ్రేళ్ళ వైపు వంగటం , యే వస్తువునైనా గట్టిగా పట్టు బట్టడం నేర్చుకున్నారు.

వేటల్లొ, కోతి కొమ్మచ్చి ఆటల్లొ, క్రూర మృగ పోరాటాల్లొ, ముందరి కాళ్ళు ఎక్కువ ఉపయోగ యుక్తంగ, నేటి మన చేతులవలే మారుతున్నవి . ఇట్లా చేసేవాటి నుండి చేయవలసిన వాటిని, మారే అంగోపాంగాల రీతుల నుండి మారవలసిన రీతులను,

గమనించి ఊహిస్తున్నారు, సాధన చేస్తున్నారు, మాటలురాని పేరులు పలుకలేని వేటగాం(డు తమతమ చేతులతో, మూతులతో, తలతో, కళ్ళతో, కాళ్ళు చేతులతో అంగాంగాల ద్వారా పనులు, ఊహలు వివరించు కుంటు చీమలు దూరని చిట్టడవుల్లో నడుస్తున్నారు **నరమృగయులు.**

'అంతలో నోరు తెరిచి నాలుక చాచి భయంకరంగా అరుస్తూ పైకి దూకింది పొదమాటు నుండి వ(టపంది. తక్షణంలో దాన్నోట్లో చేయి దోపి దాన్నాలుక మొదలు రెప్పపాటులో పట్టాడు. ముందుకు గుంజి కుడి చేతి (వేళ్ళు కట్టగట్టి కత్తివలె బిగించి పట్టి, పండ్ల బిగించి దాని నడుం మీద బలం కొద్ది 'ఊ' అని నరికాడు. ఇవన్నీ క్షణాల మీద జరుపుచున్నాడు. నాలుగు (వేళ్ళు బిగించి గుండెపై గుద్దేడు, గట్టిగోరు బలిసున్న బొటనవేలు చాచి గుప్పిలి బిగించి నల్ల జంకలో కుమ్మి , (గుచ్చి చిమ్మగా బలమైన పంది ఆవళించింది. రక్తం (గక్కుతూ నేలకూలింది. వెంటనే గొంతుపై కాలుబెట్టి కసకస నులిమాడు. గుండెలో (వేళ్ళు గుచ్చి బర్రున గుదస్థానం వరకూ చీరాడు. చిమ్మి కొట్టే రక్తాన్ని చారతో జుర్రాడు. రెక్కకు రెక్క, పిక్కకు పిక్క పట్టి లాగి, పండ్లతో పీకి క్షణాల మీద మొత్తంగా పందిని తినేశాడు. భయంకర పంది పోరాటంలో ఆదుర్దా, ఆయాసంలో, ఆదరాబాదరా ఆరగించుటలో గొంతు తడారింది! దప్పికచే నాలుక గుంజుకుపోతుంది! రొప్పుతు రోజుతు గుంపులో కలిశాడు. మాటలు రాని, పలుక చేతగాని ఆ నరుడు నాలుక చాపుతు, తడి ఆరిందని, మంచినీళ్ళు కావాలని నటించాడు. పందికి తనకు జరిగినట్టి పోరాటం అంగాంగాల నటించాడు. గుంపును నవ్వించాడు, కవ్వించాడు. సెభాష్ అనట్లు వారి అంగాంగ నటనలు గమనించి కులికాడు. ధైర్య సాహస శౌర్యాల నెరుక పరచే రీతిలో నటించాడు మహానటుడైనాడు నరమృగయుడు.

సింహ వరాహ (క్రీడానటనమే ''బాణిక'' అని,సింహ వరాహముల వర్ణించు స్నేహ (క్రీడయే ''బాణమ్'' అని, ఏనుగుల పట్టి చంపు విధాన నటనే ''(ప్రస్తానమ్'' అని, ఏనుగుల తో స్నేహ పూర్వక నటనమే ''ఉద్ధతమ్'' అని భరత శా(స్త్రములో ఉన్నది. ''(ప్రకృష్టం ఉచితో యోగః (ప్రయోగః'' అనగా పృధి వ్యాది పంచభూత (ప్రకృతి జీవరాసుల, పరస్పర సంభంధాలు, (ప్రవర్తనలు, పరి(శమలు, విజ్ఞాన (ప్రజ్ఞానాలు వీటన్నింటి ఫలితాలు. ఇవే

సర్వకళలకు మాతృకలు. వీటిల్లో మొట్టమొదటిదే అంగాంగ నటన . అంటే ''జీవరాసుల యొక్క ప్రజల యొక్క బ్రతుకును ప్రతిబింబించని కళ జాతికళ కాదు, అది ప్రేతకళ అని పించుకుంటుంది.'' అని (ఆం॥ వా॥ లో) అర్థమున్నది.

మృగయుని యీపంది పోరాటాన్నే అనుభవ కాల జ్ఞానులు ''వరాహ క్రీడ'' అన్నారు. శిరస్సు నుంచి చిరుపాదాలవరకు అంగాంగాల కదలికలనే **పతాక హస్తమని, అర్థ చంద్ర, ముష్టిహస్త, శిఖరహస్త, సర్పశీర్ష, త్రిశూల, మయూర** వగైరా లన్నీ ఆనాటి ఆ హస్త నటనలకు పేర్లు కాలగమనములో పెట్టుకున్నారు ఆది మానవులు వాటినే **అంగహారము** లన్నారు అనుభవజ్ఞులు.

## 7. శ్రమాకారాలు - అంగహారాలు

**సూర్య సోమ అంగహారాలు** : అనగా అంగహారాలు అనగా జ్ఞాన కర్మేంద్రియాల పనుల, పరిశ్రమల పుట్టుకలే సూర్య సోమ అంగహారాలు. ( జ్ఞానేంద్రియాలు అనగా కన్ను, ముక్కు, చెవి, నోరు, చర్మము. కర్మేంద్రియాలు అనగా కాళ్ళు, చేతులు వగైరాలు). వినటం, చూడటం, అరవటం, కొట్టటం, తన్నటం, మోకాళ్ళతో కుమ్మటం, మోచేత పొడవటం, పండ్లు కొరకటం, కండ్లు వురమటం, కనుబొమలు ముడిబెట్టడం, ఎగురవేయటం, తలత్రిప్పటం, ఆడించటం, క్రిందికి మీదికి ఊపటం! అంగాంగాల పనులందు, ఆహార సంపాదనలందు, ఆత్మరక్షణా విధానాలందు శ్రమాకారాలే సూర్య సోమ అంగహారాలు.

**సూర్య** - అనగా జనులు ఆహార సంపాదనలందు, ఆత్మ రక్షణాలందు చేసే పరిశ్రమ, పోరాటాలందు చేసిన, చేస్తున్న, వాటినుండి చేయవలసిన, వాటిని చూస్తున్న , అంగాంగ నటనల్లో చూచి, గ్రహించి సాధన చేయుటయే సూర్య నిర్వచనం.

**సోమ** - అనగా శ్రమ - అనగా కాలానుగుణంగా ఆహార, ఆత్మ రక్షణకు ప్రాథమిక అవసరాలందు, ధైర్య సాహస పరాక్రమ చర్యలందు సుళువు మార్గాలను అనగా నాగరికతా లక్షణాలను గ్రహించి, శ్రమించి సాధన చేయుట.

**అంగ** - అనగా జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు. అనగా కళ్ళు, ముక్కు, కనుబొమలు, కటిశాళ్ళు, చేతులు మొదలగు అంగాంగ కదలికలు ఆహార ఆత్మరక్షణ అవసరాల్లో వాడుకొనుట.

**హోరాలు** - అనగా పై నుదహరించిన జ్ఞాన, కర్మేంద్రియాల ఆహార, ఆత్మరక్షణల అవసరాలందు అంగాంగ కదలికలకు పుష్టి నిచ్చే నైపుణ్యాన్ని పెంపొందించుటకు, అనగా జ్ఞాన కర్మేంద్రియాలు రౌద్ర, భీభత్స, భయంకర చర్యలకు నేర్పు , కూర్పు, సమయస్ఫూర్తి కలిగించి అభివృద్ధి పరచు ప్రక్రియలే హోరాలు.

సూర్య, సోమ, అంగాల, హోరాల, జాతిచర్యల, పరిశ్రమల, ఫలితాల, విజ్ఞాన, శక్తి సామర్థ్యాలు, ప్రజ్ఞాపాటవాలను పెంపొందించునట్టివి, నాడులు, నరాలు, యమ్ములు కండరాలకుపుష్టిని అందాలను సమకూర్చునట్టి దండేలు, బస్కీలు, సూర్యనమస్కారాలు, ఆసనముద్రలు. ఈ నటనలన్నింటికి కాలజ్ఞానులు పెట్టిన పేర్లే అంగాహోరాలని నిఘంటువులో అర్థాలున్నవి. మానవుని ఆహార ఆత్మ రక్షణ లకై పుట్టిన అంగహోరాల, శ్రమాహోరాల నుండి జనించిన రస లక్షణాలు **నటన సిద్ధి**ని కలిగిస్తాయి.

**నటన** : అనగా ప్రకృతీ, జీవలోకము నుండి బ్రతుకు పాఠాలను నేర్చుకునే సాధన.

**సిద్ధి** : అనగా ఒక ఫలితాన్ని సాధించుట.

శ్లో॥ రూప్యతే ప్రత్యక్షే క్రియతే యో గః రూపః (నాట్యవేదం)

అనగా వేటాటలను, బ్రతుకు బాటలను, పరిశ్రమలను, సాధక బాధకాల ఫలితాలను శిరస్సు నుండి చిరుపాద పర్యంతం నటించుట-మరియు ఒక ఫలితాన్ని సాధించాలి , 'పట్టు పట్టరాదు పట్టి విడువరాదు' అనే అభిలాషను, కార్య దీక్షను కలిగించునదే ''నటన'' అని అర్థము.

**రస లక్షణాలు : వీర, రౌద్ర, భీభత్స, హాస్యం**

**వీర లక్షణం** - వట్టి చేతులు, కాళ్ళ వగైరాలతో పందిని చంపి పీక్కు-తిన్న నరశిమ్మ వరాహక్రీడలో చూపిన శౌర్యధైర్య సాహసాలను, పౌరుష చర్యలను ''వీరత్వం'' లేక వీరలక్షణం అన్నారు. అనుభవ కాలజ్ఞానులు.

**రౌద్రలక్షణం**- పోరాట బలప్రదర్శనల్లో నాడులు, నరాలు, కండరాలు, పండ్లు, కండ్లు, వాటి వాటి పటుత్వ క్రియల్లో శ్రమభయాలను, చావు బ్రతుకులను గుర్తుకు రానీయనిది 'రౌద్రము'.

**భీభత్సము** - పోరాట రంగమందు తలలు, మొండేలు దొర్లాడుట, నెత్తురులోడ్చుట రక్తమడుగులు, ఏడ్పులు, పెడబొబ్బలు, శోకాలు, హాహాకారాలు ఇది ''భీభత్సము''.

**హాస్యం** - పోరాట ఫలితాలను, విజయ విహారాలను, వీరుల ఉరవళ్ళూ పరవళ్ళుయందు, శత్రువుల చర్యలందు కల్గునది ''హాస్యము'' వీటి నాల్గింటిని ప్రధాన రసాలన్నారు ఆటగాంధ్రు.

''రౌద్రము'' నుండి ''కరుణ'', వీరత్వము నుండి ''అద్భుతం'', ''భీభత్సం'' నుండి ''భయానకం'', ''హాస్యం'' నుండి ''శృంగారం'' పుట్టింది. కానీ నాట్య వేదములో శృంగారం నుండి హాస్యం పుట్టెనని యున్నది. ఇది సమంజసం కాదు. ఎందుకంటె ఈ క్రింది శ్లోకాన్ని చదివితె మీకే అర్థమౌతుంది.

శ్లో ॥ ''మార్గదేశి విభాగేన గానం ద్వివిధం మతం''

అనగా గానం రెండు విధములు 1. మార్గ గానం 2. దేశి గానం. గానానికున్నట్టి యీ మార్గ, దేశి గాన లక్షణాలను వక్రీకరించి, ''శ్లో ॥ సంగీతం ద్వివిధం మతం'' అని సంగీతానికునట్లు అతికించారు. అట్లానే హాస్యం నుండి పుట్టిన శృంగార రసాన్ని వక్రీకరించి, శృంగారం నుండి హాస్యం పుట్టిందని చెప్పటానికి సాహసించిన కామ శృంగార రతి క్రీడా ప్రోత్సాహక కవులు శృంగారానికే పెద్ద పీట వేశారను కుంటున్నాను.

'కాలానుగుణంగా సామాజిక జీవిత చిత్రిక లేనీ ఇతివృత్తం , విషయం, కథా వస్తువుగా లేనట్టి 'నటన' అది నటనే కాదు అని శ్లోకానికి (ఆంధ్ర॥ వా॥) అర్థమున్నది. దీనిని బట్టి చూస్తే నేటి నాట్యంలో సమకాలీన సమాజ జీవిత చిత్రణ లేకపోగ, ఇతివృతాలు, కథా వస్తువులు రతీ మన్మధులని, వరూధిని ప్రవరాఖ్యులని, విశ్వామిత్ర మేనకలని, తారాచంద్రులని, మోహిని రుక్మాంగదలని, కామక్రీడా రతి భంగిమలు, చెలి చిత్త వృత్తుల రేగగొట్టే అంగ హారాలు. నన్ను ''శృంగార ద్వేషి'' అనుకున్నాసరే నేటి మన నాట్యాల్లో చిల్లగొండి చేష్టలే ఎక్కువగా కనిపిస్తున్నవనేది నిజం. ''కన్న తల్లికైనా కనుమరుగుండాలి'' అన్నారు పెద్దలు. కాని వేదికలను కేవలం పడక గదిని చేస్తున్నారు నేటి నాట్యా చార్యులు. కనుక నటనకు శ్రమాకారాలే అంగాహారాలు. కాని పుక్కిట పురాణాలు కావు.

# 8. నీరే జీవాధారం - నీరే ప్రాణాధారం

వర్షాకాలంలో ఆకాశం ఆడుగు జారిన కుండవలే కారటం, చెరువు, దొరువులు పొంగిపొర్లటం, చలికాలం మింటని, మంటిని, వంటిని చల్లబర్చటం, మిడిమిడి ఎండాకాలంలో ఎండలు, వడగాల్పులు, ఆవిర్లు చిమ్ముతు, సెలయేళ్ళు వాగులతో సహా చుక్కనీరు కన్పించకుండా ఆర్చుకు పోవటం. రోజురోజుకు అనుమానం, ఆశ్చర్యకరమైనది నాటి వానరులకు.

అడవిలో జంతువులలో జంతువుగా, పక్షులలో పక్షిగా సంచరిస్తు వానాకాలం రాగానే కొండ గుహలలో కెళితె, ఆ గుహలను ఏ ఎలుగో, పులుగో ఆక్రమించు కోవటం, వాటితో పోరాటాలు చెయ్యటం ఇట్లా ఎన్నాళ్లో జరిగింది.

పారే వాగుల్లో నీళ్ళు ఆపాలని ఇసుక అడ్డుకట్టగా నెడితె, కట్టలో నుండి బుడి కన్నాల కోసుకు పోతుంది నీరు. ఆ నీటికి అడ్డుగా దుంగలు, దూలాలు నెట్టారు. పెద్ద పెద్ద బండరాళ్ళను అడ్డుపెట్టారు, ఆపైన మట్టినెట్టారు. నీళ్ళుగొట్టి తడిపి, త్రొక్కి గట్టి పర్చారు. అంటే ఆనకట్టకు శ్రీకారం చుట్టి, ప్రాజెక్టులకు ప్రాతి పదిక వేశారన్న మాట నాటి ఆదిమ నరులు.

వారి ఆ కులుకు ఎన్నాళ్లో నిలవ లేదు. వారు ఆపిన నీరు రోజురోజుకూ తరిగి జరిగి జరిగి లోతుకు పోతున్న వింతే ఏమిటిది ? ఎవరన్నా ఎత్తుకెళుతున్నారా ? ఏవైనా పెద్ద పెద్ద జంతువులు త్రాగి పోతున్నాయా? అని అనుమానంతొ నీళ్ళ చుట్టూ ఆనకట్టలపై కాపలా పడుకున్నా లాభం లేక పోయింది. ఇసుక బైట పడిందేమిటి ? నీళ్ళేమైనాయని అవసరం అనుమానించింది, ఆసక్తి పరిశోధించింది, బుద్ధి పరిశీలించింది, విజ్ఞానం కనిపెట్టింది. మనం త్రాగే నీళ్ళు మన కడుపులోకి పోయినట్లే, ఏటి నీళ్ళు ఏటి కడుపులోనికి పోయుంటవని సౌంజ్ఞలు చేసుకొని త్రవ్వటం ప్రారంభించారు.

పలుగు పారల వంటి గోళ్ళ వ్రేళ్ళు, పారలా వంచి అరచేతులతో త్రవ్వారు. త్రవ్వగా త్రవ్వగా చెమ్మ తగిలింది. ఒకరి మొఖాలొకరు చూసుకున్నారు. పళ్ళు బిగించి పట్టుదలతో త్రవ్వుతు ఒకడు కోతి గంతులేసి పెద్దగా అరిచాడు. ('జలం') పదుగురక్కడకు చేరేలోపే గుంట నీళ్ళతో నిండింది. పైకి పైపైకి నీళ్ళు పొర్లుతుంటే దప్పిక గొన్న జనం బోర్లా

పడుకొని, పశులవలే నోటితో కొందరు, వాచేరల, దోసిళ్ళ ఎవరికందిన రీతిలో వాళ్లు త్రాగేరు, తాగుతున్నారు. పట్టుదలే విజయానికి బాట అని రుజువు చేశారు.

నీళ్ళు త్రాగివేసిన కొబ్బరిబోండాల డొప్పల్లో, గింజ, కసరుతీసిన ఆనపకాయల్లో, నీళ్ళు త్రాగేందుకు వాడుకుంటున్న తుంబల్లో నీళ్ళు నింపి, నెత్తులపైన పెట్టి, సంస్కారంలేని జుట్టుతో కట్టి, ఎగురుతు దూకుళ్ళు, మాకుళ్ళు, కుప్పిగంతులు, అంగలు పంగలు వేస్తు పిల్ల, జల్ల, ముసల, ముతక, ఆడ, మగ, ఆబాల వృద్ధులు చిల్లాటలు, శివాలు వేస్తున్నారు. అదే **గంగజాతర**. (ఈ నీటిని గంగ అనే స్త్రీగా మలచి, త్రిశక్తులకలయికైన శివుని రెండవ భార్యగా నెత్తిన బెట్టారు. దీనినే **'గంగావతరణం'** పేరుతో కల్పించి ఆడి పాడుతున్నారు.) ఈ విధంగా నీటిని సాధించాడు నాటి నరుడు.

## 9. నిప్పు వెలిగించేరు - ముప్పు తొలగించేరు

ప్రకృతి ప్రసాదాలే తింటు చలమల్లో నీళ్ళు త్రాగుతు, ప్రక్కల్లో బిడ్డల బెట్టుకొని పచ్చగడ్డిపై వళ్ళు మరచి నిద్రించి లేచి చూస్తె, పక్కలొబిడ్డ పొదలచాటున మొండెమై కనిపించగా గుండెలు బాదుకుంటూ నాటి నరుల ఏడుపులు.

ఫుల్ల చినుకులు, యీదురు గాలులు, పెద్దలే పీనుగులయ్యే చలీ! కసిగందులను గడ్డగట్టించే చలి! బిడ్డలున్నట్లుండి బిర్రబిగుసుకు పోతున్న చలి! క్రూరమృగ బాధలు చలిగాలులు. ఏంచేయాలి ? ఇదొక తరుణమైతే, ఇక మరొక తరుణం మండు టెండలు! వడగాల్పులు ! పేలగింజ లేగుతున్న ఎండలు! అడవిలో భగ్గు భగ్గున మంటల్లే పాయి! నాలుకలు కోరుతూ మంట మబ్బుల కంటుతున్నది! పశు, పక్షి, మృగాలు, మంటల కాగ లేక బ్రతుకు జీవుడా యని పారుతున్నవి !

మండే కొరువుల చేతబట్టి క్రూరమృగాలను దూరదూరాలకు తరము తున్నారు నాటి నరులు. ఆ కొరువులు చట్టూబెట్టుకొని పిల్లాజెల్లతొ దిగుల్లేకుండా నిద్రబోతున్నారు. మంటల్లో కాలిన మాంసం మహారుచిగా ఉండుటయే గాక, త్వరత్వరగా జీర్ణ మగుచున్నదని కూడా గ్రహించారు. ఈ సుఖం, ఆనందం ఎంతో కాలం నిలువలేదు. జోరున వర్షాలు ప్రారంభించాయి! ఎక్కడి నిప్పక్కడే ఆరిపోయింది! మళ్ళీ పాత ప్రమాదాలు! ప్రారంభం! ఏం చేయాలి ?

నిప్పు అవసరాన్ని గ్రహించిన జనం, అడవి ఎలా మండుతుంది ? అని అవసరం పరిశోధన ప్రారంభించింది, బుద్ధి పరిశీలించింది, విజ్ఞానం కనిపెట్టింది. మిడిమిడి ఎండల్లో, వడగాలి ఊపుల్లో చెట్టు చెట్టు, కొమ్మ కొమ్మ, రుద్దుకొని ఆ ఒరిపిడి ఘర్షణలో నిప్పుపుట్టి అడవి అంటుకొంటున్నదని గ్రహించారు. అలా త్వరత్వరగా నిప్పు రాజేయ గల్గినవి రావి, జమ్మి చెట్లని గమనించారు. ఆ రావి, జమ్మి కట్టెల దెచ్చి పట్టుదలతో, బలం కొలదీ రాపాడిస్తున్నారు. పొగరేగింది, నిప్పుపుట్టింది. దీనినే సామవేదం కూడా యెలా బలపరుస్తున్నదంటే -

శ్లో ॥ త్వామగ్నే పుష్కర దధ్వధర్వా నిరమర్థతా ॥

(సామవేదం ఆ।210 -1 పేజి 4)

తా ॥ - ఓ అగ్నీ మేము జమ్మీ రాగి కర్రలను రాపాడించి, రుద్ది నిన్ను పుట్టించితిమి

శ్లో ॥ అగ్నిమిందానో మన సాదియగ్ సచేతన మర్త్య ॥

(సామవేదం పేజీ 7)

తా ॥ - నరులయిన మేము శ్రద్ధగా పరిశ్రమ జేసి అగ్నిని పుట్టించితిమి. అగ్ని ప్రజాబలములకు శరీర మానసిక పరిశ్రమలకు పుట్టినట్టిబిడ్డ.

నరులిట్లా నిప్పును పుట్టించి, మంటలు మండించి, మృగాల వెంట, మండే కట్టెల చేతబట్టి (నిన్నటి దివిటీలు) త్రిప్పుతు, పొలిమేరలు దాటి తరుముతు, ఉరుకులు, పరుగులు, గంతులు, అంగలు, పంగలు వేసినదే **శివతాండవం.**

**శివం -** అనగా ఇచ్ఛాశక్తి, పరిశ్రమ శక్తి, విజ్ఞాన శక్తి త్రయముల గుర్తు

**తాండవం -** అనగా నటన. నట్ అనగా వ్యాపించునది. కాబట్టి జనాలు అగ్నిని ముట్టించుటకు మంటలు మండిచుటకు చేసిన కృషినీ పనులనే ''**దక్షయజ్ఞం**'' అన్నారు. అంటే నిప్పును వెలిగించి, ముప్పును తొలగించిన సమిష్ఠి కృషే ''**దక్షయజ్ఞం కర్మబంధం**'' అనే అంగాంగ నటన.

**దక్షత -** అనగా నేర్పరితనం, సమర్ధతలు కల్గిన ప్రజలు.

**యజ్ఞ -** అనగా చలిలో ఆపదలో ఆత్మ రక్షణ కొరకు ముట్టించిన నెగళ్ళు, జ్యోతులు, దివిటీలు.

**కర్మ** - అనగా నిప్పు ను పుట్టించుటకై చేసిన శ్రమ, మానసిక కృషి.

**బంధం** - అనగా పృధివ్యాధి పంచభూత ప్రకృతిలో ఒకటైన అగ్నిని సృష్టించి తమ అవసరాల్లో వాడుకుంటున్న మార్గాలను సూత్రాలను వివరించు అంగోపాంగ నటన అని అర్ధం.

నేటి **'' దీపావళి'' ''సంక్రాంతి'' ''సంకురాత్రి''** అనేవి కూడా వాటి గుర్తులు

**దీప** - అనగా కర్రలతో, జొన్న ,సజ్జదంటుల కట్టి వెలిగించేవి.

**ఆవళి** - అనగా దివిటీలు బట్టిన కుర్రవాళ్ళు బారు.

**సం** - అనగా చక్కని జీవన పరిశ్రమ చేయు ప్రజలు

**క్రాంతి** - అనగా నడవడి, చక్కని వర్తనము గల్గిన జనులు.

(నేనెరిగిన తరువాత దివిటీలు త్రిప్పుతు ''ఆ ఊర్‌గాలే, ఈఊర్‌గాలే కోమటి కోటయ్య ''.... అని పొలిమేర వరకు పాడుతు వెళ్ళి పొలిమేరవతల గ్రామం పొలంలో పైరును మేము, పొలిమేర ఇవతలి గ్రామపు మా పొలంలోపైరు ఆవూరి కుర్ర వాళ్ళు, తెచ్చుకోవటం వున్నది. (ఇదే నిప్పును సృష్టించుకున్న సంబరం.)

ఈ విధంగా ప్రకృతి శక్తుల్లో ఒకటైన నిప్పును, స్వయంకృషితొ సృష్టించి తమ అవసరాలకు వాడుకుంటున్న నిప్పుల కుంపటి చరిత్రను, 'దక్షయజ్ఞ' మనే మామా అల్లుళ్ళ తగాదాగా కల్పించి శివతాండవం పేరుతో ఆడుతున్నారు. నిజ చరిత్రను దాచి మానవ విజ్ఞానాన్ని మరుగు పరచి, ఏవేవో ఆక్కూ పోకకు, కొరగాని కట్టుకధలు, అభూతకల్పనలు ఎవరు ఎందుకు చేశారొ ముందు ముందు వివరిస్తాను.

## 10. వేటకాయుధాలు ఆటకు వాయిద్యాలు

ఏనుగు తొండాన్ని, పెద్దపులి, సింహాలు గోళ్ళను, పంది కోరలను, ఆలమంద సూది కొమ్ములను, ఆహార ఆత్మరక్షణ విధానాల్లో వాడుకోవటం చూస్తున్నారు నరులు. ఆయుధ అవసరాన్ని గుర్తిస్తున్నారు.

'బక్‌భక్' మన్నది పళ్ళు తెరచింది రేచుకుక్క. అక్కడ సగంకాలి ఆరిపడున్న కట్టె నందుకున్నాడు నరుడు. కుక్కను పారగొట్టి తనను తాను కాపాడుకున్నాడు. ఇంకా ఎద్దు కొమ్ము, ఏనుగు దంతం వగైరా కొమ్ముల ఎముకలతో ఈటె , బరిశ చేశాడు.







కోసురాయి

చెక్కుడురాయి







గొడ్డలి

పరుశువు

బరిశ







ఉండేలుబద్ద

విల్లు

అంబులపొది



తొట్టి (మట్టి బూసిన వెదురు బుట్ట)





తుంబ ( సొరకాయ ఎండుడొప్ప) (కొబ్బరి చిప్పగంట)

శృతితిత్తి వాద్యం



కొలిమితిత్తి

పెద్ద చెకుముకి రాయిని ఎత్తి మరో రాయిపై గట్టిగా కొడితే మొదట లావుగా రానురాను ఏటవాలుగా నేటి గొడ్డలి ఆకారంగా విరుగుతుంది. దానితో ఎముకల, మాంసాల కోయటం, నరకటం చేయుచున్నాడు ఆది మానవుడు. చేతిలో కట్టె మొదలును ఈ రాతి పనిముట్టుతో చిట్లగొట్టి , ఆ రెమ్మల మధ్యన ఈ రాతి పనిముట్టు మొదలును ఇరికించి, ఎదురు వడప (పచ్చిపేడు) తోనా దూసరి తీగెతోనా గట్టిగ బిగించి కట్టి భుజం మీద బెట్టాడు. ఇదే **''పరుశువు''** వీడే **''పరశురాముడు''** క్రొత్త శిలాయుగం ప్రతినిధి. (పరశువు - అనగా గొడ్డలి , రామ - అనగా జీవి అని ఆం॥ వా॥ అర్ధమున్నది.)

ఇంత వరకు తన దాపుకొచ్చిన వాటినే వేటాడ కలిగాడు. దూరాన వున్న పక్షిని, చెట్టు చిటారు కొమ్మన తేనె పట్టును ఎట్లా కొట్టాలి ? అనుకుంటున్నాడు. చెట్టు చిటారు కొమ్మ కాయలు రాల్చటానికి వాడి చేతుల్లో ఏమీ లేవు . బిక్క మొఖంతో దిక్కులు చూచాడు. చెట్టు క్రింద కనుపించిన కోసురాయి, కొంకిరాయి, గుండరాయి అనే ఆనాటి తొలి ఆయుధాలు. వంగి అందుకున్నాడు. గురి చూసి ఆ కాయలు కొట్టాడు. కాయలు రాలినవి.

మాంచి కండగల వెదురుబద్ద మూడు వ్రేళ్ళ వెడల్పు రెండు జానల పొడవుగా గొడ్డలి రాయి తో నరికి నునుపు జేశాడు. గుండ్రటి గులక రాళ్ళు ను ఏరాడు. మట్టితో గుండ్రని గోలీలు చేశాడు. బద్ద ఒక వైపును గుప్పిట్లో బిగించాడు. రెండో చివరన చూపుడు వ్రేలూ, మధ్య వ్రేలు జత జేసి వాటి మధ్యన చిన్న రాయిని పట్టి తన గుండె వైపునకు గట్టిగా రెట్టిగా లాగి వదిలాడు. ఆ రాయి సర్రున పోయి చూపు వేటు దూరానున్న పక్షికి చిన్న జంతువుకి తగలాలనుకున్నచోటే తగిలి దాన్ని పడగొట్టు చున్నది. ''ఇదే **ఉండేల్ బద్ద''** (ఉండ+వేలు+బద్ద) ఇదే తొలి సంక్లిష్ట ఆయుధాలకు తొలి రూపం అనుకుంటాను.

ఆ బద్దనే మూడు చేతుల పొడవుగా నరికి, నునుపు చేసి రెండు చివరల గాట్లు పెట్టి వడపతో బలంగా వంచి కట్టాడు. వేలుతో కొడితే వడప 'టింగ్.. టింగ్' ధ్వని వస్తున్నది. దాని మధ్యన బరిశనానించి రెట్టిగా చెవి వరకు లాగి, గురి చూచి మేసేటి లేడి గుండెలోకి వదిలాడు. అంతే లేడి గుండెలో నుండి ఈటె కర్ర దూసుకు పోవటం, లేడి పడి గిజగిజ తన్నుకు పడటం చూచిన వాడి ఆనందానికి అవధుల్లేవు.

వేటాడే బరిశ లాటి బాణాలను వేటకు మోసుకెళ్ళటానికి లావు వెదురు బొంగు గొట్టాన్ని ఒక్క కణుపు వరకు నరికి అంబుల పొదిని తయారు చేసుకుని వీపున కట్టాడు. అలా బాణాన్ని బట్టి బరిలో నిల్చిన గురికాడే ''శ్రీరామం''. అంటే వీరిప్పుడు మృగయులు, నరసింహ్మలు, వానరనరులు, పరశురాములు, కాదు కాదు వీరే ''శ్రీరాము''లు.

(శ్రీ - అనగా సంపదా, విజ్ఞానం అని రెండర్థాలున్నవి. రామ - అనగా జీవి)

( ఆ॥ వా॥)

కనుక ఈ శ్రీరాములు గణంగా వృద్ధి చెందారు. గణంలో విజ్ఞానం పెరిగింది. ప్రజ్ఞాన పనితనాల్లో సుళువు మార్గాన్వేషణలు పెరిగినవి. వేటకు ఆయుధాలు అభివృద్ధి చేస్తున్న జనాలు ఆటకు వాయిద్యాలు రూపొందిస్తున్నారు.

గొడ్డలితో కొబ్బరి కాయను నడిమికి ఖచ్చితంగా నరికి ఎండిన ఆ డొక్కునకు పచ్చి బక్కి పొరనో, లేత ఉడుం, నక్క, మేక చర్మాలనో, పచ్చి వాటినే పైన మూసి, ఆరిన మూతపై సన్న వెదురు ఊసలతోనో, చేతి వేళ్ళతోనో, మ్రోగిస్తే 'కణ్.. కణ్,' అని మ్రోగుతున్నది. ఈ విధమైన వాయిద్యాలే **కంజీర, కనక తప్పెట్ల** కు మాత్రుకలుగా తయారైనవి.

ఉండేలు బద్దను ఇంకొంచెం పొడవుంచి, విల్లు బద్దను కడెంగా గుండ్రంగా చుట్టి, వడపతో గట్టిగ కట్టి , ఆ కడెముకు ఒక ప్రక్క పచ్చి చర్మాన్ని మూసి ఆరగట్టి, బాగా ఆరి ఎండిన మూతపై కర్రతో, చేతి వేళ్లతో కొడితె, 'డబ్...డబ్ 'న మ్రోగుతున్నది. ఈ మోత కనుగుణంగా దీన్ని ''**డప్పు**'' అన్నారు.

నీళ్ళు నింపి నిలవుంచుకునేందుకు తయారు చేసుకొన్నారు గోళెం లేక గాబు. అంటే ఎదురు బద్దలతో గుండ్రంగ అల్లి, చేతెడు బంకమట్టి పేమి, ఆరబెట్టినట్టి గాబు. ఆ పనిముట్టుపై పచ్చి చర్మం మూసి , బాగా ఎండబెట్టి, మూరెడు కర్రతో కొడితే, 'డం..డం' మ్రోగుచున్నది. ఈమోత కనుగుణంగా దీన్ని ''**డమ్మ**'' అన్నారు.

బరిశలు, ఈటెలు, అంబులు దాచుకునేందుకు, వేటకు మోసుకెళ్ళేందుకు, వాడుకుంటున్న లావు బొంగు (వెదురు) గొట్టాలు ఒక్క కణుపు గల్గిందె తీసుకొని, అలాగే

ఆయుధాలె వాయిద్యాలైన నమూన







వాడుకవస్తువులే వాయిద్యాలైన నమూన






అనపకాయ పొడవుది, లావుది కూడా లోపల గింజ క సరుతీసివేసి, వీటికి చర్మాలు మూసి, వారులతో బిగించి, వెడెల్పు సన్నం మూతిపై వాయిస్తే, 'పం..పం..పం.' అని రెండోదైన లావు మందం చర్మం మూసిన మూతపై కొడితే, 'భమ్.. బమ్' అని వినిపిస్తున్నది. వీటి రెంటిని ఒక దానిపై నొకటి బొడ్డు క్రిందకు కట్టుకుని, ఎడపా దడపా ఒక్కడే రెండు చేతుల కొడుతూ వున్నారు. దీన్నే 'పం..బం' 'పం..బం' మోతల కనుగుణంగా **''పంబ'' జోడం** అన్నారు. **జమిలిక** అని అన్నారు. ఇవే నేటి డోలు, డోలక్కు, మృదంగం, తబ్లా, వగైరా అభివృద్ధి క్రమంలో మ్రోగిస్తున్న ఎన్నో చర్మ వాయిద్యాలకు మాతృకలు. అంటే చర్మ పరిశ్రమ కానాడే శ్రీకారం చుట్టారు నాటి నరులు.

వేటల్లో, ఆటల్లో, పనిముట్లు, వాయిద్యాలు రూపొందించారు . మరి లయ, తాళ గతులెలా స్థిరీకరించారంటే -

॥శివశక్తి సమాయోగే తాళమానాభిధేయతే ॥

తా ॥ శివ పార్వతీ సంయోగంలో లయ, తాళములు పుట్టెను. ఈ విద్యాదర్పణపు నిర్వచనం నిజం కాదనుకుంటున్నాను. రాళ్లు, రప్పలు, కొమ్ములు, దంతాలు, ఎముకలు, బరిశ, ఈటె, కోతకత్తి, వగైరా ఆయుధాలు తయారీలోనే లయ, వడి, తాళం, గురి, నిలకడా, సమత్వ , చపలత్వాది, లయ, తాళ, లక్షణాలన్నింటినీ గ్రహించారు.

టక్. టక్. టక్. టక్ మని దెబ్బలో దెబ్బ కొట్టే టప్పుడు, కత్తితో నరికేటప్పుడు, గురిగా దెబ్బ లయగా కొట్టక, అటు ఇటు తప్పు దెబ్బలు కొట్టినట్లయితె , క్రింద పట్టుకున్న వ్రేళ్ళు పచ్చడి పచ్చడి కావటమె, తెగి పడటమె జరుగును. కనుక వాయిద్యాల కతి ప్రధానమైన లయ తాళ గతులను ఆయుధాల తయారీలోనే గమనించి స్థిరీకరించారని నా భావన. కనుక వేటకాయుధాలు ఆటకు వాయిద్యాలుగా ఏర్పరచారు నాటి గణం.

( ఏ ఆయుధం ఏ వాయిద్యంగా మార్చుకున్నారో ప్రక్క పేజీ లో చూడండి)


పిల్లనగ్రోవి


శృతితిత్తి


కొమ్ముబూర


ఏకతార


శంఖువు


కంజిర


వీరణం


బుడబుడక


డక్కి


పంబజోడు


డ్రమ్ము

తొలివాయిద్యాలు.

# 11. వాయిద్యాల నేర్పు - వేషధారణకూర్పు

పుల్లయ్యలు పులి ఆట, నల్లోడి నెమిలాట, యర్రోడి ఎలుగొడ్డు ఆట, కోతయ్య, కొండన్నల కుక్కనక్కల పీకులాటలు బాగున్నవి. కానీ ఏదో లేనట్లనిపిస్తుంది అంటున్నారు ప్రేక్షక జనాలు.

''పెద్దపులి చర్మం , ఎలుగుబంటు చర్మం వలచి ఆరగట్టారు. వాటి వాటి కొమ్ములు, కోరలు, గోళ్ళు, పక్షుల ఈకెలు, తోకలు పీకి జాగ్రత్త చేస్తున్నారు.

వెదురు బద్దలతో ఎలుగబంటి తలఆకారం చేసి చర్మం అతికించారు, కోరలు కూర్చారు. పెద్ద ఆనపకాయను పులి తలగా చేసి, బొగ్గులు, ఆకు పసరలతో, ఎర్ర రంగు రాళ్ళు రంగరించి మచ్చలు, చారలు, చుక్కలు దిద్దుకున్నారు.

పులి, ఎలుగు వగైరా క్రూర మృగాల తలలు, కోరలు వెదురు బద్దలతోను, వడపల (పచ్చపేడు) తోను రూపొందించి చర్మాల నతికించుకున్నారు.

బొగ్గులు, రంగురంగుల రాళ్ళు రంగరించి, రంగు నీళ్లతో చారలు, మచ్చలు పొడలు శరీరాలపైన అద్దుతున్నారు. కొందరు ఆయా చర్మాలనే ధరిస్తున్నారు. నెమళ్ల , కొంగల, చిలుకల రంగు రంగుల ఈకెలతో వేషాలు అమర్చు కుంటున్నారు. గవ్వల గుత్తులు కాళ్ళకు కట్టారు. నెమలీకెలు, కోడి, తెల్ల కొంగలీకలు రంగులు దిద్ది, కొమ్ములుతో కిరీటాలు శిరముకు ధరించారు. కత్తులు, కఠార్లు , ఈటెలు, బరిశలు, బట్టారు. ఎవరు ఏవేషానికి నప్పుతారో, ధీటుగా వుంటారో, వారా వేషాలేశారు - ఆడుట అరచుట నేర్చారు.

పన్నెండు కొమ్మల పతామర్రి క్రింద ప్రేక్షకులు ఆడామగా, పిల్లా జల్లా వేదిక చుట్టూ కూర్చుని ఎదురు చూస్తుండగ, ''ఖాంద్రు.. ఖాంద్రు'' మని పెద్దకేకతో జనాలపైగా రెండు కాళ్ళ నరపులి బరిలో వాలింది. పట్టీగొట్టి నిల్చింది. పిల్లాజల్లా తత్తరపాటుతో లేచి పెద్దల సముదాయింపుతో సర్దుకున్నారు. పిల్లలేడ్పులు, కేకలు, తల్లులు వీపులు తట్టుటితో నవ్వులతో సద్దు మణిగింది.

చెట్టు పై నుండి పిల్లి మొగ్గలేస్తు గాండ్రింపులతో రెండు కాళ్ళ ఎలుగు బంటి బరిలో దూకింది. ఆ ఎలుగు, పులి పోరాటం చూడాలేగాని వ్రాయటానికి అందదు. ఆ భంగిమలు, ఎన్నో ఎన్నెన్నో అంగహారాలు, పంజా విసురులు, అరుపులు, కుప్పిగంతులు వ్రాసేదానికంటే చూస్తేనే అద్భుతం.

డేగా పావురం, తోడేలు గొర్రె గావు ఆట, నెమలి పురివిప్పి సున్నితంగ, సుందరంగ అడుగులు వేయటం, పురివిప్పి చిన్న చిన్న గెంతులు గెంతటం, పురిని కులికించటం ఆడుతున్నారు.

నక్క-కుక్కల పీకులాటలు, ముద్దు ముచ్చటగ కొరుక్కోవటం, ఆంబోతు, పెయ్య, పోతూదున్న, ఎదపడ్డలు, మరకా పోతు, వగైరా పశు పక్షి మృగ శృంగార కామ వ్యసన రీతి క్రీడలు ప్రదర్శిస్తున్నారు.

పశు పక్షి మృగాల మధ్యన బుట్టారు వాటితో పెరిగారు, నిత్యం బ్రతుకు బాటల్లో ఆటల్లో అరుపుల్లో ఒక తల్లి బిడ్డల్లాగ మెలిగారు. వాటి వాటి నడకల్లు, వేటల్లో, ఆటల్లో నడుపుతు, వయ్యారాలు మరెన్నో వాటి వాటి లక్షణాలు సహజంగా నటిస్తున్నారు.

జీవ జగత్తే తల్లిగ, జీవితానుభవమె గురువుగ, జీవ ప్రకృతే పాఠశాలగ తర్ఫీదు చేసినట్టి, ఆటలు, అరుపులు, వేష ధారణలు కేవలం వినోదం కోసమేనా ? కళకళ కోసమేనా? కాదు కానే కాదు. ఇది నేడు మనకు బట్టినట్టి దుర్గతి.

జనంలో కౄర మృగాలంటే ఉన్న భయాన్ని, పిరికి తనాన్ని, తత్తరపాటు బెదురును తొలగించుటయే ఈ కళ కర్తవ్యం. మరియు కాకి మూకల వలే, కోతి కొండ ముచ్చులవలే, ఆలమందవలే కలసి కట్టుగా మనమంత జనమంత బరిలో నిలిస్తె, ఎంతటి క్రూర మృగాన్నైనా సునాయాసంగా జయించగలం అనే నమ్మకాన్ని, ధైర్యసాహసాన్ని, పోత పోయుటే, ఇట్టి కళల ప్రదర్శన ప్రయోజనము.

అంతేకాదు పశు, పక్షి, మృగాల కన్నా మనం లగువు వే గాలను, వడుపును, తెలివి తేటలను, శక్తి యుక్తులు కలిగున్నామని జనం గ్రహించేట్టు వాస్తవ సంఘటనలు నటించాలి ''కళ''. అంతేకాదు బ్రతుకు బాటల్లో చేసినట్టి , ప్రస్తుతం చేస్తున్నట్టి, అదే జీవిత పోరాటాలను చూపిన ప్రజలకు రేపటి బ్రతుకు ''కళారూపం'' బాటలను తీర్చి దిద్దే గురువుగా ఉపకరించాలి. అట్లా ఉపకరించని ''జాతికళ'' కాదు ''ప్రేత కళ''.

ప్రకృతి ప్రసాదాలు తింటూ కురవలపైనా, గుహల్లోనూ ఆసనముద్రలు, వ్యాయామ కసరత్తులు, నాళ్ళ నరాల, మానసిక శక్తి సామర్థ్యాలు పెంచుకుంటు, పరిసర శత్రువర్గాల సామ, దాన, భేద, దండోపాయాలతో, ప్రకృతి ప్రమాదాలను తమకనుకూలంగ మార్చుకుంటు వస్తున్న పోరాటాలే ఆటలుగ, ఆయుధాలనే వాయిద్యాలుగ, నమూనాలుగ, వెదురు బద్దలతో, బొంగుగొట్టాలతో, చర్మాలతో, ఢక్క, ఢప్పు, ఢమరు, లయ, తాళ, యమక, గమకాల మధ్యన, బతుకు బాటలా వేలూటల ఆడే కళాకారులే **''గరుడులు''**.

ఈ గరుడల నివాస ప్రాంతమే **'జంబూ ద్వీపం.'** ఈ జంబూద్వీపాన్ని ఎక్కువ కాలం తన ఆధీనంలో, పెత్తనంలో వుంచుకున్న 'ఋక్షుడు' అనే భల్లూక పతిని **'జాంబుడు'** అన్నారు.

జంబూద్వీప ప్రాంతంలో ఈ వానరేంద్రుడు , భల్లూకపతి. నివాస ప్రాంతం కాంచనాద్రి అనగా నేటి కనకదుర్గ అనీ ''ఆంధ్ర వాచస్పత్యంలో అర్థాల్నువి. అంతేగాదు ఈనాడు తెలుగుదేశంలో జాంబుడు వంశస్తులము అనే తెగలున్నవి. అంతేకాదు ''మహా భారత యుద్ధంలో భల్లూక తెగలు నానాయాతనలు పెట్టినారని, ఈ తెగల జయించుట అసాధ్యమన్నంతగా భయం కల్గిందనీ'' ఆర్య ఋగ్ వేదములో వున్నది. (॥ఉ॥ ల॥ రావు . సందేశం పత్రిక.) కావున వాలి, సుగ్రీవులీ జాంబుడి బిడ్డలే ననుకుంటున్నాను. వీరి నివాసం బెజవాడ కొండపైన గల కనకదుర్గం(మ్మ) అనీ సుగ్రీవుడు తల దాచుకున్న దుర్గం ''కొండపల్లి'' అని భావిస్తున్నాను.

**జంబు** : అనగా రెల్లు తుప్పలు, దర్భదుబ్బులు, నేరేడు వృక్షాల తోపులు.

**ద్వీపం** : అనగా ప్రాంతము, ప్రదేశం.

**గరుడం** : అనగా లయ, తాళ, గతుల్లో నడకల్లో, అంగాంగ విన్యాసముల, ముద్రల, భంగిమల నటించుట (॥ఆ॥వా॥స్ప॥)

పై అర్థాలను బట్టి చూస్తె ఈనాటి మన పెద్దపులి వేషధారణ , కీలు గుర్రాలు, నెమలాట, పెండ్లి వేడుకలో పెండ్లి కుమారుని, పెండ్లి కూతురిని భుజాల పైన ఎక్కించుకుని ఆడుతున్న తెగలున్నవి. కాబట్టి ఆ దేగాట ఆడినవారే **గరుడులు.** అట్టి గరుడులు నివసించిన ప్రాంతమే **జంబుద్వీపము.**

ఐతే నేటి పగటి వేషాల పేరుతో వేస్తున్న 'బోడెమ్మలు' గంట జంగాలు ప్రాచీనాలు కావు కల్పితాలు. వీటి వలన ఒకళ్ళనొకళ్ళకు హేళన, ఎగతాళి, వైషమ్యాలు వైరాలు యేర్పడుటే గాని ప్రజలకు ఉపయుక్తమైనట్టివి, నేర్చుకునేవి పిసరంతైన లేవు. కనుక నాటి గణంలో వాయిద్యాల నేర్పుతో వేషధారణ కూర్పుతో తొలిసారిగా ఆడిన వారె గరుడులు.

# 12. కోనలో గోల - గానాల మాల

చప్పట్లు చరుస్తూ కర్రలపై, పిర్రలపై దర్వులు దంచుతు, అవే దరువులు ఊపుగా జంతు చర్మాలపై వాయిస్తు, హుషారుగా వారి జీవిత నటనల నాడుతున్నారు నాటి ఆదిమ కళాకారులు. కుప్పి గంతులు, పిల్లి మొగ్గలు, పల్టీలు (జిమ్నాస్టిక్స్) ఆడుతున్నారు నాటి ఆ నరులు. ఇదే చర్మానికి పుట్టిన చప్పుడు. అవే **బుడబడక, డ్రమ్ము.**

చీమలుదూరని చిట్టడవిలో, కాకులు దూరని కారడవిలో రాత్రి పగలనక 'బుయ్..బుయ్' అని నాదం వస్తున్నది. మొదట భయపడ్డా, తరువాత తరువాత అలవాటు పడినారు. ఆ శబ్దం ఎక్కడ నుండి ఎలా వస్తున్నదో తెలుసుకొన ప్రయత్నం చేశారు. పురుగు తొలిచిన లావు వెదురు బొంగు, ఆ బొంగు బొక్క లోనికి గాలి బోవుట చేత 'బుయ్...' అని మ్రోగుచున్నదని గ్రహించారు. భయం తీరిన కళాకారుడు ఆ మ్రోగె బొంగును ఆ కణుపు వరకు నరికి తెచ్చాడు. లోపల బైట శుభ్రపరచి, పెదవులకు ఆనించి గాలి ఊది మ్రోగించ ప్రయత్నం ప్రారంభించాడు. 'సాధనమున పనులు సమకూరు ధరలోన' అన్నట్లు మ్రోగింది. బాగా పలికింది. దీనినే **బిల్లుల్ల బుర్ర, పిల్లన గ్రోవు** అన్నారు అనుభవజ్ఞులు. (పిల్లనమ్ అనగా చెట్టునకు పుట్టినట్టిదనీ, గ్రోవు అనగా శబ్దమనీ ఆం॥ వా॥ లో అర్థమున్నది.) ఈ విధంగా **పిల్లన గ్రోవి**ని కనిపెట్టారు.

భూమి నుండి మరోసారి 'బ్రుయ్.. బ్రుయ్..' మోతతో మొదట భయ పెట్టింది. కానీ తరువాత చూచి గ్రహించారు. బర్రె కొమ్మో, దున్న కొమ్మో, మట్టి క్రింద కూరుకు పోయి, లోపలి పదార్థం పురుగులు తినగా బోలై మ్రోగుతున్నదని గ్రహించి దాన్ని తెచ్చి తుడిచి శుభ్రపరచి పెదవుల పట్టుతో మ్రోగించారు. ''బ్రుయ్'' అని మోత వచ్చింది. కనుకనే దీని శబ్దానికనుగుణంగా **కొమ్ము బూర** అన్నారు. ఈ విధంగా కొమ్ము బూర కనిపెట్టారు.

సముద్రాల వెంట నత్తలు, పీతలు తింటూ తిరిగే నాడు ఇసుకలో నుండి ఒక నాదం వినిపిస్తున్నది. అదే గవ్వ. దాన్ని పరికించారు. తెచ్చి గాలి ఊది మ్రోగించారు. అదే **శంఖ** నాదం. ఈ విధంగా ఐదురకాల చప్పుళ్ళుగా నిర్ణయించారు.

1. చర్మాన బుట్టిన చప్పుడు
2. చెట్టున బుట్టిన చప్పుడు
3. కొమ్మున బుట్టిన చప్పుడు
4. గవ్వకు బుట్టిన చప్పుడు
5. కంఠాన బుట్టిన చప్పుడు

పశు, పక్షి, మృగ జీవ జాతులన్ని నిత్య జీవితావసరాల్లో, అవస్థల్లో, ఆనంద, ఆర్భాటాల్లో, దినచర్యల్లో చేసే కంఠనాదాలు, ప్రకృతి శబ్దాలు ఎలా వాడుకుంటున్నవో జీవుల గమనిస్తున్నారు నాటి నరులు.

ప్రకృతి సిద్ధంగా కళాకారులుగా పుట్టిన నరజీవులు. సాటి జీవుల జీవిత అవసరాల్లోను, ప్రేమ, వినోద, శృంగార రతి క్రీడలలోను, రాగ, అనురాగ, సరాగ, విరాగాలందును, తమతమ కంఠవీణల ద్వారా కూతలు కూయుట, పిలుపులు పిలుచుట, పలుకులు పలుకుట చూస్తున్నారు.

మావి చిగుళ్ళు మెక్కి మదించి, మత్తులో ''కుహూ''..అంది కోయిల, ఆ కేక విన్న కళాకారుడు ''కూహూ..కుహూ'' అని అనుకరించాడు. గొంతు చిరిగేట్టు బదులు కూసింది కోయిల.

నిద్ర పట్టని ఒక చిల్లగొండి నక్కవలే ఊళ బెట్టాడు నడి ఝాము రాత్రి, అడివంతా నక్కల గోల. అది విన్న మరో సన్నాసి గుండె మీద ''టప్..టప్..టప్'' దర్వేసి ''కొక్కరోకో..'' అని కోడి కూత కూశాడు. అడవిలో కోళ్ళన్నీ గోలగోలగా అరిచాయి. తెల్లారిందని గణగుంపు మొత్తం లేవటం వాళ్ళను జూచి కూసేవాళ్ళు నవ్వులాట.

వేటకై నట్టడవిలో నడుస్తున్నారు వేటరులు. ఒకడు పెద్దపులివలే ''గాండ్రు.. గాండ్రు'' మన్నాడు. ఎదుట పొదలో పులి 'గాండ్రు' మన్నది. ఎదుట పులి తావుందని ఆ దారి మార్చారు. చీకట్లు చిమ్మేకా వనవనాలు, గచ్చు కోరింద పొదల్లో, క్రూర మృగ, జంతువులు నడచిన దారుల్లో నడుస్తున్నప్పుడు, విన్నవి అనుకరిస్తున్నట్టి శబ్దనాదాలు ప్రమాదాల నుండి రక్షిస్తున్నవి.

ఐతే కానల్లో గోలగా రాగాను రాగాల మాల, హాస్య, రౌద్ర, భయానక, భీభత్స, సరాగ, విరాగాల హేలగా ప్రకటించటం అనుకరించటం, ఆలపించటం,వాటి ఆహ్వానిం

చటం చెప్పుకున్నంత తేలిక కాదు. జీవ జాతులలో సన్నిహిత సంభంధం కూతల, అరుపుల సమయస్ఫూర్తి వివరణ, అనుభవజ్ఞానం, సమయ స్ఫూర్తి, గుర్తింపు ఎన్నో కావాలి.

వారిలోని ప్రాణ వాయువు, జీవ ధ్వనిని నాభిస్థానం నుండి అన్యోన్య ఘర్షణతొ పొత్తికడుపు ఊపిరితిత్తులు, గుండె పట్టు సహకారంతొ హృదయం, కుతికా, కంఠం, కపాళ, రంధ్రాల ద్వారా ధ్వని, శబ్ద, నాదాలను, బైటకు త్రోయాలి. ప్రకృతీ జీవలోకంలోనికి పంపకం చేయాలి. క్రిందనుంచి మీదకు, మీద నుంచి క్రిందకు ఆరోహణ అవరోహణ ఆర్యోక్తిలో రస భావయుక్తంగా అక్షరాలను పలకాలంటే దౌడలు, దంతాలు, ముక్కు, చెవులు, కండ్లు, కొండనాలుకా మరెన్నో స్వరాంగాలు సహకరించాలి. వాటన్నింటి పట్టు సాధించటం అంత తేలిక కాదు. అందుకే కంఠాలు సాగదీస్తూ ప్రయత్నిస్తున్నారు.

స్వర అంగాల సాధన చేసి, వాటిని తన ఇష్టాల కనుగుణంగా పల్కించు శక్తి సామర్ధ్యాలు కలిగినప్పుడే స్వర పక్వతతో కూడిన , ఆయా పశు,పక్షి, మృగ, జీవలోకం, ఆ పిలుపు ఆ పలుకు, తనవారిదని గుర్తించి స్పందించును. కీకారణ్యాలలోని ఈ గోలలే, శుక, పిక, కలకలాపాలే గానాల మాల.

నాటి ఆ గానాల మాలను ఆ మృగయుడు తనకు తనే గురువుగా ఆ దశకు రావటానికి ఎన్నేళ్లు పట్టిందో లెక్క గట్టడం, వాటి శ్రమకు విలువ గట్టడం అసాధ్యం. శ్రీ శ్రీ అనట్లు ''ఖరీదు గట్టే షరాబు లేడోయ్''.

నానాటి సాటి జీవ జంతుకోటిని వాటి వాటి జీవధ్వనుల, జీవశబ్దాల, జీవనాదాల విని, అని అనుకరించి, ఆలపించి వాటి నాహ్వానించి పట్టి, పెంచి బిడ్డల కనించి, కోడి పుంజుల తన్నులాట, కొమ్ము పొట్టేళ్ళ గుద్దులాట, మైనాల కరువులాట లాడించి పోట్లాడించి అవసర సమయాల్లొ భోంచేస్తున్న ఈ గాయకులే **గంధర్వులు.** వీరాలాపించిన శుక, పిక, శౌరికా కలకలారవములే ''శిశుర్వేత్తి, పశుర్వేత్తి వేత్తిగాన రసం ఫణి'' అని నిర్వచించిన గానం నిజమైన **''గంధర్వ గానం''** ఇది గాక ఆదశలో మరోగానం లేదు.

(**గాంధర్వమ్-** అనగా శుక, పిక, శౌరికా ప్రలాపములూ చిలుకల గోర్వంకల కలకలారవములు తాము వినుట అనుట,. వాటిచే తిరిగి అనిపించుట. **గానం** -అనగా తమ తమ కంఠనాదాల అక్షర పేరుల, వాక్యాల పలికించిన నాదాలాపన.)

పశు, పక్షి, మృగ, జీవ రాసుల కంఠ నాదాలతొ, స్వరరీతులను విని తామనుకరించి వాటి చేత అనిపించి, తమతమ జాతి కంఠ నాదాలని గుర్తింపు కల్గించిన గానమే **గంధర్వగానం** అని ఆంధ్ర వాచస్పత్యంలో యున్నది. కనుక కోనలో గోలలేగానల మాలగా అ.క.మ.పో.రా. అనే పదాలతో, తొలి గంధర్వ గానానికి నాందిపలికారు నాటి గణజనాలు.

## 13. జీవధ్యానం - మార్గగానం

గంధర్వ గాయకుని ఆ గానం, అంత శ్రమ, కేవలం, వినోదంకోసం కడుపాకలి కోసమేనా? కాదు. నాటి నరుల గంధర్వ గానం నిత్యాహార ,పశు, పక్షి, జంతువుల కోసమై నిత్యము అడవి గాలించే శ్రమ తగ్గింది. అంతే కాదు ఈ గానం బరిశల ములుకులు కన్నా ఉపయుక్తముగా వున్నది. ఈ గానాలాపనల్లో సామాజిక రస, భావ, ప్రకటనలకు బహిరంగ రూపమైన భాషకు సంబంధించిన ఆ.తా.మా. పో.రా. ఇత్యాది పేర్లూ పల్కుటకు వాగాంగాలను రాపిడి చేస్తున్నారు. అలవాటు చేస్తున్నారు గంధర్వులు.

అలా జీవ జంతువులను ఆకర్షించు ''మార్గమే'' సాయ గాను, మరియు ప్రజా జీవితవసర పనుల , ప్రమాదాల, అవస్థల గమనించి ఆ సాయల, ఆలపించు ఆ గానమే **మార్గగానం** అయింది.

నేటికి పశు, పక్షి, మృగ, జీవుల ఆహ్వానాధ్యయనంలో మార్గగాన సాయలను, నిత్యం వాడుకుంటు న్నాము, ఇంకా ఇంకా వాడుకుంటూనే వుంటాము.

''దా..దా..బో..బో..బో'' అని గానం చేస్తూ పిలిస్తే వీధిలో చెలిగిపిల్లలకు పురుగు పుట్ట పెట్టుకునే కోడి మాత్రమే తన బిడ్డల పిలుచుకుంటు గానం చేసి పిలిచే వారి దాపు కొస్తుంది.

''దా ..దా.. టర్.. టర్.. టర్'' అని గానం చేస్తూ పిలిస్తే పొతేలు మాత్రమే ఆ గానం చేసి పిలిచే వారి దాపు కొస్తుంది.

''దా..దా.. ఉజ్జా ..ఉజ్జా.. ఉజ్జా '' అని, గానం చేస్తూ పిలిస్తే వీధిలో నిద్రించే కుక్కమాత్రమే ఆ గానం చేసి పిలిచే వారి దగ్గరకొచ్చి తోకూపుతు ముఖం వంక చూస్తుంది.

వ్యవసాయ దారుడు పగ్గం, ముల్లు గఱ్ర, సౌజ్ఞ చేసి ''హర్..హర్.. హర్ ''అంటే ఆ గానం విన్నంతనే వెలపటెద్దే అరకను తిరగ త్రిప్పుతుంది.

''వలియ వలియో వలియో - రా వేలుగలవాడ రార పొలిగాడా హోయ్'' = అనే గానం వినిపిస్తే ఇంట్లో వున్న మనం ఆ గానంచేసే ఆ జనం ఏమిచేస్తూ అలా గానాన్ని ఆలపిస్తున్నారో ఎవరూ చెప్పకనే, చూడకనే చెప్పగలం.

''చి చొ ళు ళు ళు ళు ళు ళు ళూ హోయీ '' అనే గానం విన పడగానే రోడ్డున వెళ్ళే మనం ఆ యింట్లో ఆ ఇల్లాలు ఏంచేస్తూ ఆ యొక్క గానాన్ని ఆలపిస్తున్నదో చూడకనే చెప్పగలం.

'' ఓరిమా నాయనో.. ఓయ్యో'' అనే శోక రీతిలో గానం వినిపిస్తే ఆ ఇంట్లో అలా ఎందుకు గానం చేస్తున్నారో చూడకనే చెప్పగలం.

పిట్టల వేటగాండ్రు యీనాడు కౌజు పిట్టకోసం ఆవును వెంట దీసుకెళ్ళి అడవిలో దూరి చాటనో, చర్మాన్నో, దూడతల ఆకారంలొ తలకు తగిలించుకుని లేత ఆకులను పెదవుల కానించొ లేక అనాది నుంచి సాధన చేస్తూ వచ్చిన తన పెదవుల సహజ పట్టుతోనొ ఆయాపిట్టల నాకర్షించు మార్గాలలో, సాయలలొకూసి, గానం చేసి, వాటిని తమ వలలోనికి , ఉచ్చులలోనికి ఆకర్షించి పట్టి మార్కెట్టులొ అమ్ముకుని నేడూ జీవిస్తున్నారు. కనుక దీనినే **'మార్గగానం'** అన్నారు.

కాని ఒకనాటి ఆర్యపండితులో, ఇటీవల వారి వారసులో జీవధ్యానమైన ఈ గానాన్ని ''జీవ'' అనే పదాన్ని, ''దైవం'' అని తెలివిగా దిద్ది, మార్గగానమునగా, దేవుళ్ళును ఆరాధించునదిగాను ''ఈశ్వర ప్రణీత'' మైనదిగాను నిర్వచించారు (సం॥ విద్యా పేజీ - 452 లో.) ఇది నిజం కాదు. నిత్య జీవధ్యానంతో, జీవులకు మార్గాన్ని, చూపిందే మార్గ గానం.

## 14. నటన ప్రాణం - ఖడ్గ గానం

పుట్టి భూమిమీదపడి కాళ్ళు చేతులాడిస్తూ 'కెవ్.. కెవ్'' అనినగానం నుంచి గంధర్వ గానం, గంధర్వ గానం నుంచి మార్గగానం, మార్గగానం నుంచి ఖడ్గ గానం లోకి ప్రవేశించారు నరులు.

మార్గగానం తరువాత దేశిగానం ముందు అక్షర పేర్లు, రస , భావాల కనుగుణంగా అల్లి ఆలాపిస్తు నటించిన ఆట పాట **''కురవంజి''** నృత్యంగాక, గేయ భాగం తక్కువ ఆట భాగం ఎక్కువగా కల్గిన జనపద కళారూపం మరొకటున్నట్లు రుజువులు లేవు.

**ఖడ్గగానం** - అనగా రౌద్ర , అద్భుత, రసములలో మాటలల్లుట, (ఆం॥ వా॥)

**కురవంజి** - అంటే గానం తక్కువ, ఆట భాగం ఎక్కువ వున్న నృత్య కళ.

''దేశే దేశేను గానం తద్దే శీయ త్యభిధీయతె (సం॥ వి॥ ణం.)

దేశేదేశేను= అనగా నేటి బెంగాలు - మహారాష్ట్ర, కర్నాట, ప్రజలవలే మన తెలుగు ప్రజలు. గా నం = అనగా తమ తమ కంఠ నాదాల, అక్షర పేరుల, వాక్యాలు పలికించిన నాదాలాపనతో యున్నట్టి , తద్దేశీయ = అనగా ప్రధానమైన తమతమ ఆనందాల, అభిమతాల సాధక బాధకాల, సుఖదుఃఖాల రసభావాల ప్రకటించునట్టి , త్యభిదీయతే = అనగా ఉద్దేశించినట్టీ జాతి, ప్రయోజనకరమైనట్టి ఆలాపన లేక అక్షర, వాక్య వివరణలు అని సంస్కృతాంధ్ర నిఘంటువులో పై శ్లోకానికి అర్థమున్నది. అంటే నేటి బెంగాలు, మహారాష్ట్ర, కర్నాటక ప్రాంతాల ప్రజల వలనె మన తెలుగు ప్రజలు తమ కంఠ నాదాల, అక్షర పేరుల, వాక్యాల, ఆనంద ఆర్భాటాల, సాధక బాధకాల, సుఖదుఃఖాల నుద్దేశించినట్టి , వివరించునట్టి , ప్రజా ప్రయోజనకరమైనట్టి అక్షర మాలికల ఆలాపనే **కురవంజి** అనే **''ఖడ్గగానం''** అని భావిస్తున్నాను.

''రసభావ వ్యంజకాదియుత నృత్యం''

''రసభావ విహీనంతునృత్తం''

ఏ రసము, భావము లేని కేవలము ఆట మాత్రమే కాదు **''కురవంజినృత్యం''**

ఒకటి ఈ నటనలో కండ్లు ఉరమటం, పండ్లు కొరకటం, ఉద్రేకం వగైరా వీరరసం ఉన్నది. రెండవది క్రూర మృగాల నెదిరించండి, పోరాడగా సిద్ధం కండి, వగైరా కర్తవ్యం ప్రభోదమున్నది. ఈ రెంటిని అక్షర పేరులలో కూర్చిన గానాన్ని చేయుచు నటించే కళాకారులు ఈ అక్షర మాలికలను ''ఖడ్గాలు'' అంటున్నారు.

ప్రజల్లో నేటికి కనిపిస్తున్న **''కురవంజి''** (ఖడ్గగానం) నృత్య లక్షణము లక్ష్యము ఏమిటనగా నేడు చాకలి, మంగలి, కమ్మరి, కుమ్మరి వగైరా వృత్తిదారుల్లో, వీరుల కొలువుల్లో, వీరభద్రుడి ఉత్సవాల్లో **నారసాలు** అని ఇనుప వూచలో, ఘంటాలో బుగ్గలకు, గొంతుల్లో గుచ్చుకొని, కొందరీనాడు ఆడుతు పాడుతున్నారు. లోహపు కత్తులతో రొమ్ములపైన, ప్రక్కలందు వరుచుకొనుచు, మోదుకొనుచు నెత్తురులు చిందిస్తూ మరికొందరు

ఆడుతున్నారు. పై పంచలు నడుములకు చుట్టి, ఆదట్టీల్లో కత్తులను దోపి రుంజల, డోళ్లు, డప్పుల మోతలతో కంతాల నాదాల మేళవించెదరు ఈ గాయకులు.

జనాలు చుట్టూ కడెం గట్టి నిల్చుండగ, మధ్యలో గాయకులు, వాయిద్య గాండ్రు అందరు చెవుల వద్ద చేతులానించి గంభీరంగా క్రింది విధంగా ప్రదర్శించెదరు.

| | | |
|---|---|---|
| గాయకులు | - | అ. ల్ల ల ల ల ల లా |
| అందరు | - | శ్శ ర భ |
| గాయకులు | - | అ గ్గ గ గ గ గ్గా |
| అందరు | - | అ శ్శ ర భ |
| గాయకులు | - | అ ద్ద ద ద ద ద్దా |
| అందరు | - | ద శ్శ ర భ |
| గాయకులు | - | నే. వీర భద్రుండ |
| అందరు | - | అ.శ్శ ర భ |
| గాయకులు | - | నే. బ్రహ్మ రుద్రుండ |
| అందరు | - | అ శ్శ ర భ |
| గాయకులు | - | అ. ల్ల ల ల ల ల లా |
| అందరు | - | అ శ్శ ర భ |
| గాయకులు | - | అ గ్గ గ గ గ గ్గా |
| అందరు | - | అ శ్శ ర భ |
| గాయకులు | - | అ. ద్ద ద ద ద ద్దా |
| అందరు | - | అ శ్శ ర భ |
| గాయకులు | - | ద్దా ద్దా దశ్శరభ |
| అందరు | - | ద శ్శ ర భ |

పై గానంలోని వాక్యాల్లో అర్థమేమిటనగా

**శరభ** - అనగా సింహాన్ని చంపగల మృగరాజును. అని

**అశ్శరభ** - అనగా మిక్కిలి నిర్బందించి, బలవంతముగా పట్టి బంధించి చంపగల మృగరాజును అని

**నే వీరభద్రుండ** - అనగా నేను ఎల్లప్పుడు మెలుకువతో అనగా చైతన్య వంతుడనై యుండువాడనని

**నే బ్రహ్మ రుద్రుండ** - అనగా ప్రజాభి వృద్ధినీ, ప్రజా క్షేమాన్నీ ఎల్లప్పుడూ కాపాడు వాడనూ శ్రద్ధ గా చూచువాడను అని.

**అ** - అనగా అంగసాచి ముందుకు అడుగు వెయ్యండని

**లలలలా** - అనగా మృగముల పై పైకి త్రోసుకు పదండని

**ద ద ద దా** - అనగా ముందుకే మునుముందకే అడుగెయ్యండని

**గ గ గ గ్గా** - అనగా పోరాడు , యుద్ధం చేయగా సంసిద్ధం కండని

(ఆం॥ వా॥)

ప్రజల్లో నేటికి కనిపిస్తున్న ఈ '' కురవంజి (ఖడ్గగానం) నృత్య లక్షణలక్ష్యము ఆలోచిస్తే అక్షర మాలికలందు ఆటపాట పోలికలే ఎక్కువగా కనిపిస్తున్నవి.

దేశీయుల నాలుకలపైన నటన, గాన, సాహిత్య, శాస్త్రాలలోను కనుపిస్తున్న వాస్తవ స్వరూప స్వభావముల రీత్యా, మార్గ - దేశిగానముల మధ్యన ఆట పాటతో కూడిన గానం ఈ **ఖడ్గ గానం** (కురవంజి) గాక మరొకటి లేదు.

ఈ గానంలోని సాహిత్యం గేయ భాగాలంటే గురజాడ, దేవులపల్లి, శ్రీశ్రీలను దృష్టిలో పెట్టుకో కూడదు. నాటి ఆ గణం జనం గుప్పెడు వాళ్ల అవసరాలు పిడికెడు. వీటిని బట్టి వీటి నెరుక పరచిన వారి పాటలు, అక్షరాలు చిటికెడై యుండినదే కురవంజి అనే **ఖడ్గ గానం.**

## 15. శ్రమ ప్రధానం - దేశీయగానం

పర్వత శ్రేణులు దిగివచ్చి పర్ణశాలల్లో పడుకుంటున్న వాగ్గేయకారులు తమతమ నివాస ప్రాంతాలకు చుట్టు హద్దులు గీశారు, కంచెలు బాతారు. అంటే 'చేనుకు చుట్టూ కంచ, చేలో మంచ' అనే సామెత ప్రారంభమైంది. ఆ మంచె మీది మొనగాడె, సరిహద్దు కాపలా దారుడే **''దేశీయగానం''** లో నాయకుడు, కథా కథనంలో వీరుడు, ధీరుడు.

**దేశి గానం** - శ్రమ జనితమై పరిశ్రమ ప్రాతిపదికపై పరిశ్రమల ఫలితాల వీరోచితంగా ఆడుతు, పాడుతు వినిపించే నేటి **బవనీ కథ** నాటి **దేశీయ గానం.**

**'బవని'** అనగా జాతి భూఆక్రమణ, శ్రమ ప్రాతిపాదికపై కళల, ఇతి వృత్తాల విషయాలను వివరించు అనుభవ కాలజ్ఞానులు.

**బవని కథ అనగా**

**బవ** - అనగా బ్రతుకు శ్రమ ప్రాతిపదికపై నిర్మించినట్టి కరుణ, అద్భుత, హాస్య రసములతో నిండిన అంగాంగ నటన.

**నీ** - అనగా పాట లేక పదము ( ఆ.వా.స్పత్యం) లలో కథగా చెప్పునదే **బవనీ కథ.**

ప్రజలు ఈ **దేశీయగానాన్ని** ఈనాడు ప్రక్కచర్మవాద్యాన్నీ దాని రిధిమునసరించి ప్రాంతానికొక పేరుతో పిలుస్తున్నారు.

'పంబ జోడు' చర్మ వాద్యరిధిములో **పంబకథ**

'ఒగ్గు' అనే చర్మ వాద్యం రిధింలో చెప్పునది **ఒగ్గు కథ**

'ఝుంకు' అనే చర్మ వాద్యం రిధింలో **ఝుంకు కథ**

ఈ విధమైన పేర్లుతొ ఇప్పటికి ప్రదర్శింప బడుతున్నవి యీ దేశి గాన బాణీలు.

రూపం : (నేటికి ప్రజల్లో వుంది ) ముగ్గురి తో కూడిన ఒక దళం.

వాద్యాలు : రెండు వుంటవి. ఒకటవది చర్మంతో చేసిన ఒక శృతితిత్తి. (దీనికి తోకన వెదురు సన్న గొట్టాన్ని మగినంతో బంధించి వుండును. దీని పైన మూడు చిన్నచిన్న రంధ్రాలు కాల్చబడి వుండును. ఇవి మగినంతో మూసివుంచి) శృతి కనుగుణంగా రంధ్రాలపై మగినం తొలగిస్తు ఉంటారు ఒక వంతగాడు. రెండవది **పంబజోడు.** ఒక్కడే ఒక్కేభుజాన ధరించి కుడిచేత ''పమ్‌పమ్'' అని, ఎడమచేతి ''భమ్‌భమ్'' అని, మ్రోగిస్తు ఉండును రెండొ వంతగాడు.

వేషం : ముగ్గురూ మామూలు పంచ మడిగోచి పెట్టుకుందురు, కాశీకోక చుట్టి మధ్యలోని కథకుడి కుడి చేతిలో బారుకత్తి, ఎడమ చేత డాలు పట్టి , తలపాగ, కాళ్ళకు గజ్జలును ధరించి ఉండు ( ఝుముకుకథ లో భామ వేషానికి చేతిలో చిన్న రుమాల వుండును. **ఒగ్గు కథలో** రెండు ఆడ వేషాలు వుండవచ్చును. కథకుడే మారుతుంటాడు.)

ప్రదర్శన విధం : మధ్యవ్యక్తి కథా గానం వివరణ చేయును. చర్మవాద్యాలైన, పంబజోడు ఒక్కడే ఒకే భుజాన ధరించి వాయిస్తు 'హో.. హో' అని వంత పదం పాడుతు, మరియూ శృతితిత్తి మరొకరు ధరించి వంతపాడును.

**బవనీ, పంబల, ఒగ్గు, ఝుంకుల** కధకులు నేడు భిక్షక వృత్తి కళాకారులుగా వున్నారు కాని వీరు ఈ కథల్లో నాడు వినిపించు విషయం, కథా వస్తువు లేమిటో నేటి ప్రజల్లోను, శాస్త్ర పుటల్లోను లేవు. శ్రమ జనితమైన **బవనీ కథ** (దేశి గానం) జనాలభివృద్ధినెలా ప్రోత్సహిస్తూ నడిపిందో ఎక్కడా కనిపించుటలేదు.

నాటి దేశిగానమనే ఈ బవనీ కథలొ నాయికలుగా నేడు వినిపిస్తునట్టి స్త్రీ మూర్తులను మాతృస్వామిక యుగంనాటి వీరమాతలను ఎందుకు అలా వికృతంగా కౄరంగ వర్ణించారొ తెలియదు. తెలుగు స్త్రీలకు విద్యా విజ్ఞానాలు లేకుండా చేసేందుకు కేవలం బిడ్డలు గనే మూర్ఖులనుగా మలిచేందుకే అలా సృష్టించారో కాని, దేవతల పేర్లతో వున్న మారెమ్మ, మద్దిరాలమ్మ, అద్దెంకమ్మ, జడలమ్మ, పోలేరమ్మ ఇత్యాది పేర్లతొ కథల్లొ వినేవి, చూసేవి, కథాకాలం నాటి వీర చరిత్రలు కాదని. ఇవన్ని సుద్దకల్పిత కట్టుకథలని భావిస్తున్నాను.

బవని కథలో 'మంజరులు' 'ద్విపదలు' అనిపిలవబడే వీటి అక్షర లెక్కలు, మాలికలు లయ, తాళ, నడకలు, శృతులు, నాదాలు మాత్రమె నాటికథలకాలంనాటి వను కుంటున్నాను. ఎందుకంటే యక్షగానానికి ముందు, మార్గ ఖడ్గగానాల తరువాత ఈ 'మంజరులు' 'ద్విపదలు' గాక మరోరకం అక్షర మాలికలు పాడి ఆడిన కళారూపాలు, ప్రజల నాలుకలపైన కథాకథనాలు లేవు .

నాటి ''**దేశిగానం**'' అనే నేటి ''బవనీకథ''లో అక్షర లెక్కలు! '9 : 8' '8 : 7' నిష్పత్తిలో కనుపిస్తున్నవి. ఇక యతులు, ప్రాసలు, అంత్య ప్రాసలు,సమాసాలు, తెలుగుపేర్ల వాక్యాలు, పదాలు ఇవియన్నీ నరుల నిత్య జీవితవసరాల్లొ కూర్చి పలుకుటలోనే ఇవి సహజంగ అభివృద్ధి చెందాయి. అందుకే 'దేశ భాషలందు తెలుగులెస్స'' అన్నారని భావిస్తున్నాను.

ప్రజల నాలుకమీద నాట్యమాడె మంజరులు, ద్విపదలు

1) (9 : 8 అక్షరాల ద్విపద) హరి హరి నారాయణ : ఆదినారాయణ
కరుణించి మమ్మేలు : కమలలోచనుడా ॥

2) (8 : 7 అక్షరాల త్రిపద) గొల్లల గోత్రాలు : గొర్రెల కెరుక
గొర్రెల గోత్రాలు : గొల్లల కెరుక
వారీరి గోత్రాలు : తోడేళ్లకెరుకా

3) (8:7 అక్షరాల ద్విపద) భళిభళి మాతాత : బల్లెంబు బట్టి
పుల్లాకు తూట్లుగా : పొడి చేసినాడు

4) (9 :8 అక్షరాల ద్విపద) జోలల్లు పాడంగ : బాలలకు నిద్ర
హాయి హాయి హాయి : ఆపదలు గాయి

ప్రాచీనమైన యక్ష గానం పేరుతో ''యాదవదాసు'' రచించిన 'గరుడాచలం' చెంచునాటకం పేజీ 16 లో ద్విపద

5) (9 : 8 అక్షరాల ద్విపద) శ్రీలక్ష్మి వినవమ్మ : సిగ్గేలనమ్మ
చేతిలో శుభములు : చెప్పెదవినవె

ఆర్ మరాఠీలు చిత్ర కళా ప్రదర్శకులు 'వనారస అంజమ్మ బృందం' లక్ష్మమ్మ మూర్చె రామాయణంలో ॥ ద్విపద ॥

6) (8 :7 అక్షరాల ద్విపద) కాల వశమ్మునా : కదనమున కంప
కూరె ధరణి మీద : కుదరంబు పగిది

7) (8 : 7 అక్షరాల త్రిపద) ధరణి పైబడి యున్న - తమ్ముని జూచి
కనుగవే భాష్పముల్ - గ్రమ్ముగా వగచి
దనుజేంద్రపై బాణ - తతుల తాగురిచె

ఇవి మనకు కనిపిస్తున్న, వినిపిస్తున్నట్టి దేశియ గానం అనబడే బవనీ కథా సాహిత్య స్వరూపాలు.

కాని నా భావన ప్రకారం 'ఇంత వరకు ఈ అడవి మన గణానిది. ఇందున్న పండ్లు, పొలాలు, పశు, పక్షి, మృగ జీవరాశులన్ని మనవి'. ఇదే నాటి వ్యక్తుల్లోని మమకార, అహంకారాలు. కాని 'ఇవన్నీ ప్రకృతి ప్రసాదాలు కదా ?' 'వాటి మీద మన పరిపాలన

(పెత్తనం) ఏమిటి ? గణాధిపతులారా.. గణ నాయకులారా..'' అనలేదు గణం. 'విజ్ఞానం పెరిగింది' అనుకునే ఆ జనాలు ''సైసై'' అన్నారు. ఇదే వ్యక్తి స్వార్థానికి, వ్యక్తి పతనానికి తొలి మెట్టని నేనుకుంటున్నాను.

వారి అడవి చుట్టూ కంచెలు బాతారు. నాలుగు దిక్కుల మంచెలమర్చారు. మంచెలపైన మహావీరులు నిల్చారు. ఆనాడు జరిగిన నాటి దేశిగానమనే బవనీ కథ రూపం నా ఊహా గానం ఏమంటే.

1) (9:8 అక్షరాల ద్విపద)
జాతి దేశి గాన : రీతి యేమనగ
కాపున్న వీరుని : సమరాన చావు

2) (8:7 అక్షరాల త్రిపద)
గవ్వల చడ్డీ పై : కాశను జుట్టి
కత్తి బరిశీటను : ఘనముగా బట్టి
చుట్టు చూపందిన : మేర చూస్తుండ

3) (9:8 అక్షరాల చతుష్పద)
గుట్టుగ పందులను : బట్టునా దొంగలు
చెట్ల చాటుమాటు : నొచ్చెడి శతృలన్
చూచికేక బెట్టి : దూసి ఖడ్గాన్ని
అట్టె మంచెదూలికి : దుష్టులన్ డాసెన్

4) (9:8 అక్షరాల పంచపద)
గొడ్డలితో నొక్కండు : ఖడ్గాన్ని ద్రుంచా
దుండగీడొక్కండు : ద్రుంచె బరిశ కట
కుమ్మి చిమ్మె నీటె : రొమ్ము లో నొకడు
అమ్మచచ్చానంటు : అరచి ధర కొరుగ
కేక విన్న గుంపు : ఏకంగ రాగా
దొంగలా చీకట్లో : దూరి పోయారు

॥ హో కొడుకా ॥

5) (9:8 అక్షరాల షట్పది)
ఓరినాయనో : ఓరి వీరన్నా
తీరని వేదన : లొడిగట్టినావా
ఎటు నుండి వత్తవా : నిదురెదుర జాడ
కత్తి కఱ్ఱ సాము : నెట్లు నే మరతూ

నిన్ను చంపినోల్లు : చంపినే చత్తా
ఏడ్చేడ్చి యాయమ్మ : సొమ్మ సిల్లింద

''ఓరినాయనా వీరన్నా ! నిజమైన ఆవేశ పూరితుడా! ఉన్నతాశయ ప్రేరితుడా! నిరంతర భావనాశీలీ! అపూర్వ ధైర్యశాలీ ! నిన్ను కాపాడుకో లేని మేమా గణపెద్దలం గుంపునకు మొనగాళ్లం.

1) (9:8 అక్షరాల ద్విపద) గణంపర్వునిల్వ : రణమునొరిగావా
జనం బతుక్కొరకు : ప్రాణమిచ్చావా

2) (9:8 అక్షరాల ద్విపద) త్యాగశీలీ ధైర్య : సాహస వీరుడ
చావదునీయాత్మ : చంపలే రెవరు

3) (9:8 అక్షరాల చతుష్పద) కొల్చేము నీపేరతొలి : పేర్ల కొలుపూ
పిల్చేము నీపేర తొలి : బిడ్డ పిలుపూ
శత్రువుల దూషించి : శపధాలు చేసి
గోతిలో దాచేసి : గూడేని కెల్లే

పై కథలోని ద్విపద మాలికల్లో, వచనాల్లోని భాష ప్రాచీనం కాదు, అంతా ప్రజల వాడుకభాష కూడాకాదు, కలగాపులగము. అయితే వీరుడా పోరాటంలో కత్తెట్లా దూశాడో, వంచెట్లా దూకాడో, పరుగెట్లా దీశాడో, శత్రువులనెలా డాశాడో, కత్తెలాత్రిప్పాడో, మెరుపువలె ఎట్లా గుంపులో మెరిశాడో, పళ్ళెట్ల కొరికాడో, కళ్ళెట్ల ఉరిమాడో, దూకుళ్ల, మాకుళ్ళు, గంతులు, రంతులు, కుప్పిలు, పిల్లడుగు, పక్కడుగు, అంగులు, పంగలు వాడి భావాలు, ఆ పోరాట వీర, రౌద్ర, భీభత్స, భయానక దృశ్యాలు చూడాలి గాని వ్రాస్తే వాటి బిగువు పోద్దనీ నే వదిలేశాను.

వీటన్నింటిని ఆడుతు పాడుతు, అంగాంగ ఉపాంగాల నటిస్తు వచ్చిన తెలుగు జాతి కళా రూపమైన దేశిగానమనే బవనికథ కళాకారుల నాలుకల నుండి వినిపిస్తున్న మాలికలే వాస్తవం. అవే మంజరుల, ద్విపద, త్రిపద, చతష్పద, పంచపదుల బహిరంగ పోలికలని, ఇవే పాలకూరి సోమనాధుల, తంజావూరు నాయక రాజుల, శ్రీనాధుల, తదితరు లందరకు మాతృకలని భావిస్తున్నాను. కనుక నేటి **బవని కథే** నాటి **దేశి గానం.**

## 16. భూసాగు సాధన - యక్షగానబోధన

జనాలు పెరగడంతో గణాలు పెరిగాయి. అడవికి హద్దులు వుండే గూడేలు పెరిగాయి. పాతతాడి వనరులు, వగైరా తిండి వనరులు వస్తువులు చాలినన్ని లేవు.

ఆహార రక్షకులు మంచెలెక్కి చేసేదిలేక సావకాశంగా ఆకాశం వంక చూస్తు తీగ రాగాలు తీస్తున్నారు. ఓదెకొంగలబారులు వచ్చి సెలయేటి వారల్లో వాలు తున్నవి.

వరిగ, కొర్ర, ఆరిగ, రాగి, పొట్టకంకుల ధాన్యాలు పండి వరిగిన ప్రాంతాల్లో వ్రాలిన ఓదె కొంగలు ముక్కులతో పాల వంటి వెన్నులు దూసి తింటున్నవి.

సజ్జ, యర్ర, పచ్చ, తెల్ల జొన్న కంకులు ముంతలంత కంకులు పక్షుల ముక్కులతో కొడితే, 'ఏనుగంత మనిషి పీనుగయ్యానట్టు.' ఉన్నాయి. గుంపులు గుంపులు పరిగె పిట్టలు తినేవి తింటున్నవి, పోయేవి పోతున్నవి. పాలకంకులు మేసి పక్షులు బలిసి పోతున్నవి.

విల్లెక్కు బెట్టి ''అలలల హోయ్ లేలే'' అని అంబు నొదిలాడు హద్దు కాపలదారుడు మొదట బెదిరి లేచాయి పరిగెలు. తరువాత తరువాత లేవటం లేదు. అప్పుడు చేశాడు **వడిశలా గుండ్రాయి.**

పశు పక్షులు కంకులు తినటం చూచి కంకులు నల్చుకుని గింజలు నమిలాడు ఆ నరుడు. అమ్మ బాబో ! గుమ్మలు గుమ్మలు పాలూరు తున్నవి! తియ్యగా తేనె సోనలు జారినట్లున్నవి! అనుకొని కడుపారా తిన్నాడు, కంకులు తెచ్చి అందరికీ తిన బెట్టాడు.

ఎండాకాలం అవీ దొరకని రోజులొచ్చాయి. అప్పుడు సెలయోటి వారల్లో వండ్రు పేరిన ఇసుకల్లో తిండి మొక్కలు పడి మొలవటం చూచారు. మైదాన ప్రాంతాల్లో పోడుగొట్టి, పొదలు పీకినట్టి మెతక నేలల్లో త్రవ్వి, పాదులు, మళ్ళు చేసి; నీళ్ళు పోసి, చిన్న చిన్న కాల్వల ద్వారా నీళ్ళు మడులుగట్టి స్వయంగ తిండిమొక్కలు పెంచసాగారు.

ఇలా భూసాగు ప్రారంభించిన గణానికి ఎన్నో ప్రశ్నలు , పాదుల్లోపండే తిండిచాలని ప్రశ్న, పెద్ద పెద్ద మళ్ళు ఎట్లా చేయాలనె ప్రశ్న , భూమిని పతనం ( త్రవ్వటం, దున్నటం) చేసి పెద్దపెద్ద మళ్ళు చేయాలంటే, పెద్దపెద్ద మానులు నరకాలి! చిట్టడవిన్నరకాలి, పోడుగొట్టి బీళ్ళుదున్ని మళ్ళు, చేలు చేయాలి! ఇది చెప్పుకున్నంత తేలిక కాదు. ఎలా?! అనే ప్రశ్న.

అప్పటి గణంలో ఉన్నవి బరిశె, యీటె, అలుగు ఇవే వారి పనిముట్లు. వీటి పనిమంతులే వున్నారు. ఐతే గణంలోని కొందరు అనుభవ కాలజ్ఞానంతో 'గాలితిత్తులను (శృతి తిత్తులు) కొలిమితిత్తులుగా చేసి, ఆ కొలిమిలో బరిశ, ఈటె, అలుగు కన్నా బలమైన గడ్డపలుగు, చెలగపారలు చేయవచ్చని ఆ పని మంతులకు బోధించ సాగారు.

ఆ బోధనాధారంతో గణంలో కొందరు పనివుంతులు కొలిమిలో పలుగు, సెలగపారలు చేసివ్వగా, వాటితో కొందరు భూపాదులు కొనసాగించారు. వీరినే భూస్ప్రుశ్యులనవచ్చు.

'గాలితిత్తును, కొలిమితిత్తులుగా వుపయోగించవచ్చు' అని పనిమంతులకు భోదించిన అనుభవ కాలజ్ఞానులే మరలా భూస్ప్రుశ్యులకు నాగళ్లు, గొర్రుల, గుంటకలు, పాపటాలు వాటి వాటి తరుణాలు, అవసరాలు గుర్తించి ఉపయోగించే పరిజ్ఞానాన్ని భోదించసాగారు.

ఆ భోధన సహాయంతొ భూస్ప్రుశ్యులే మొదట భూపతనాన్ని కాడి భుజాన వేసుకొని నాగళ్లుతో దున్నారు. కాని భూమిని లోతుగా దున్నవలసిన అవసరం గుర్తించి తర్వాత వారి పెంపుడు పశువులను కాడిక్రిందకు అలవాటు చేసి, నాగళ్ళను, దున్నలతో, ఎద్దులతో, గుర్రాలతో మోయించి దున్నించారు. దీని గుర్తే త్రిశక్తుల సహకారియైన శివాలయం ముందున్న నంది.

ఈ విధంగా ఒక ప్రక్క భూస్ప్రుశ్యులకు నవధాన్యాలు, కాయలు పండించు విధానాలను భోధిస్తు మరోప్రక్క పనిమంతులకు భూసాగు కవసరమగు పనిముట్లు తయారీలో నైపుణ్యా పరిజ్ఞానాన్ని ప్రభోదిస్తు, గణాన్ని భూపతనకల్లోలంలోకి మరల్చారు నాటి అనుభవ కాలజ్ఞానులు. అట్టి ఈ అనుభవ కాలజ్ఞానులే **'యక్షులు'**. అట్టి యక్షుల అనుభవ కాలజ్ఞానపు ఆటపాటల భోధనే **'యక్షగానం'** అనినేననుకుంటున్నాను.

ఈ భూపతన కల్లోలం ఎలా సాగిందంటే.

1. ఎప్పటి నుంచో రాగి, కంచు, ఇనుము లోహాల కరగించి గండ్రగొడ్డలి, బరిశ, ఈటె, అంబు ములుకులు వేటాయుధాలు తయారు జేస్తున్న అనుభవజ్ఞులు యక్షులు భోధించగా కొలుములు ముట్టించారు. గడ్డ పలుగులు, చెలగపారలు, నాగళ్లకు తగిలించే ఇనుపముళ్ళు, గొర్రు, గుంటకలు, పలుగులు, కర్రకోలు అవసరం కొలది భూపతనమునకు ఇనుప పనిముట్లు వాడుకొనుటకు లోహాలపై సాగించిన ''కల్లోలం''.

2. ఎప్పటి నుండో కొయ్యలతో వెదురు కర్రల లావు బొంగులతో వీరణం డప్పు, డ్రమ్ము, పంబజోడు వగైరా వాయిద్య డొలుపులు, చట్రాలు రూపొందిస్తు వచ్చిన అనుభవజ్ఞులు యక్షులు బోధించగా ఆ పనిముట్లతో గొర్రు, అడ్డలు, గుంటక అడ్డలు, పాపటాల అడ్డలు, గుజ్జులు, నగలు, జడ్డిగాలు, రధాలు, నాగళ్ళు రూపొందించుటకై పెద్దపెద్ద వేప, తుమ్మ మానుల ఎదురు గుమ్మెల స్వాధీనానికి అడవిమానులపై సాగించిన కల్లోలం.

3. ఎప్పటి నుండో వాయిద్యాల మూతల కప్పుకోను, కట్టుకోను, డేరాలకై చర్మాల తొలిచిన అనుభజ్ఞులు యక్షులు భోధింపగా భూపతనానికవసరమైన వారెన్లు యార మోకులు, పగ్గాలు, గడ్డికట్టు తాళ్ళు, పట్టెడలూ, వగైరాలకై చర్మాలకై సాగిన కల్లోలం.

4. ఎప్పటి నుండో రంపెలతో చర్మాలపై బొచ్చు గీరిన అనుభవ శాలురు యక్షులు భోధింపగా రంపెల కన్న పదునైన పనిముట్టులతో మనుషుల గడ్డాలు, నెత్తి వగైర, బొచ్చు గీరుటకు పదునైన సున్నిత పరికరాలకై పరిశ్రమలకై సాగించిన ''కల్లోలం''.

5. ఎప్పటి నుండో చర్మాల వూనుటకు, మెత్త పరచుటకు ఆకు పసరుల నాణ్యాల కోసం అడవి ఆకుల సాధించిన అనుభవజ్ఞులు యక్షులు భోధింపగా కట్టుబట్టల, దుప్పట్ల, చీరెల అద్దకాలను శుభ్రపరచి రేవులకై సాగిన ''కల్లోలం''.

6. ఎప్పటి నుండో ప్రత్తిని ''పింజి'', గింజల వేరు చేసి, ఆ దూదితో ముతక దారంతో ఊర్పు మాలల అందించిన ''పింజారులు'', దూది నేకి ఏకులను జేసి నూలు రాటలపై వడికి రుమాల నేసిన ''మాల'' పనివారు, యక్షులు బోధింపగా పంచలు, చీరెలు దుప్పట్లు చేయుటకై ప్రత్తిపై సాగించిన ''కల్లోలం''.

7. ఎప్పటి నుండో పెద్దగోళాలు, గూనతొట్లు, బానలు రూపొందిస్తు వచ్చిన పనిమంతులు, యక్షులు బోధింపగా నీళ్ళు తెచ్చే కడవలు, త్రాగే ముంతలు, వండే కుండలు తినే సానికలు చేసేందుకు ''కుమ్మ '' దుమ్ము'' కలపి నీళ్ళు బోసి, త్రొక్కి, పదును చేయుటకు కుమ్ము దుమ్ముపై సాగిన ''కల్లోలం''.

8. పైన తెలిపిన వారందరి సహాయ సహకారాలతో అడవిన్నరికి, పోళ్ళు గొట్టి, బీళ్ళు దున్ని, సుక్షేత్రాల సృష్టించి, నిక్షేపాలు పండించుచున్న వారే భూస్పృశులు. వీరు యక్షులు బోధింపగా నిక్షేపాలు పండించుటకు అదును పదునుకై ప్రకృతి శక్తులపై సాగించిన వీర ''కల్లోలం''

''చరిత్ర కోటాన కోట్ల ప్రజల చేత నిర్మించబడునని, ఆర్థిక పునాది మార్పు చెందడం తోటే బ్రహ్మాండమైనట్టి దానిపై కట్టడాలన్నీ, పనిముట్లు, పనితనాలు, సాంఘిక సంస్కృతీ వ్యవస్థంతా హెచ్చుగానో తక్కువగానో త్వరత్వరగా మార్చి వేయబడుతుంది.'' అన్నాడు కార్ల మార్క్స్ -

కావునా ఈ కలియుగ ఆరభదశలో అనగా భూపతన కల్లోల దశలో పని మంతులను నూతన పనిముట్ల రూపొందించ పూనుకొమ్మని ప్రోత్సహిస్తున్నారు. నాటి యక్షగాన కళా కార్లు. దాని వివరణే ఈ క్రింది మాలికలు (త్రివేణి సంగమం 'జనపదాలు')

<u>మంజగతి</u> : రాగిను మిత్తడీ మొగుడో లేవర
సుత్తెల రత్తయ్య - నాయన
సుత్తెల రత్తయ్య మొగుడో లేవర
తిత్తుల కొలిమయ్యా - నాయన
తిత్తుల కొలిమయ్య మొగుడో లేవర
కొలిమిలో అగ్గయ్య - నాయన
కోలిమిలో అగ్గయ్య మొగుడో లేవర
బొగ్గుల సూరయ్య - నాయన

మధురగతి : తాగి పాలు పెరుగు- సాగించె కొలుములు - ॥ తంధా॥
వేనేటి సమ్మెట - పిడుగులా మోత - ॥ తంధా॥
పాలోసి గొడ్డళ్ళు - పదును లెక్కించె - ॥ తంధా॥
నీలోసి రాళ్ళపై - నూరె గొడ్డళ్ళు ॥ తంధా॥
పోయి రాయన్నలు - పోడుగట్టంగ ॥ తంధా॥
పోయేటి అన్నల - కేమిటో సద్ది ॥ తంధా॥

అర్ధ చంద్రిక : ఏడా మడలు పోయి - ఎ పనుగొట్టె ॥ తంధా॥
కొట్టిన మానులు సందేలదెచ్చి ॥ తంధా॥
దాతికాడా మాను - లన్నీ దెచ్చారు ॥ తంధా॥
కర్ర పని మంతులు - కూర్చె నాగళ్ళు ॥ తంధా॥
గొర్రు గుంటకలేమి - జడ్డిగా లుగట్టె - ॥ తంధా॥

ఇదే విధంగా ఆకలి యుగారంభ దశలో పంటభూముల రంగులు అనగా ఎ్ర నేల, నల్లనేల, రేగడి నేల, పాటంచు నేల, చవిటినేల, ఇసుక నేల, ఇట్లా భూమి రంగులే కాక, భూమి సారాల్లో మార్పు వున్నది. కావునా ఏ నేల ఎన్ని దఫాలు దున్నాలో ఏ నేలలు ఎన్ని దశలుగా అంటె మూలసాళ్ళు, అడ్డసాళ్ళు, ఇరవాలసాళ్ళు, గొబ్బి, గుంటక, పాపటాలు, ఎలాదున్నాలో వాటిని వివరిస్తున్న జాతి కళాకార్ల మాలికలు.

| | | | |
|---|---|---|---|
| మధురగతి | : | కోళ్ళుకూసే వేళ | - తంధాన |
| | | కోటేళ్ళు సాగెనె | - తంధాన |
| | | చుక్కపొడిచే వేళ | - తంధాన |
| | | దుక్కల్లు దున్నేర | - తంధాన |
| | | చేసిన నాగళ్లు | - తంధాన |
| | | చేలు దున్ను చుండె | - తంధాన |
| | | కట్టిన గొబ్బులకు | - తంధాన |
| | | జడ్డిగాల గట్టి | - తంధాన |
| | | ధాన్యాల నెదబెట్టి | - తంధాన |
| అర్ధచంద్రిక | : | చవిటినేల పంట - వక్కనాటి పంట - | తంధాన |
| | | నల్లరేగటి నేల - శనగ జల్లాలంట - | తంధాన |
| | | ఇసుకదున్ని బాగు - పడినోడు లేడంట - | తంధాన |
| | | రేగడినేల దున్ని - చెడినోడు లేడంట - | తంధాన |
| వృషభగతి | : | చాలు పై నొక చాలు దున్నిన | - సై |
| | | చచ్చునేలలైన పండును | - సై |
| | | జొన్న పంటకు ఏడుసాళ్ళు | - సై |
| | | ప్రత్తి పంటకు పదిసాళ్ళు | - సై |
| | | పాపటం పదిసాళ్ళు బెట్టు | - సై |
| | | పైరులకు పైసాలు చలువ | - సై |

అదేవిధంగా ఆ భూపతన కలియుగారంభ దశలో పంచాంగాలు లేని కలికాలంలో అతివృష్టి, అనావృష్టి, వాతావరణాలు వాటి ప్రభావాలు వగైర అనుభవ కాలజ్ఞాన మాలికల నాలపించిన నాటి కళాకార్ల మాలికలు -

అర్ధచంద్రిక : తూనీగలాడితె - తుంబడే వాన
కోడిరెక్కారేస్తె - గొప్పవానొచ్చు
గొర్ర గుంపుకూడ - గొప్ప వానొచ్చు
తంధానా తంధాన తంధానా ॥

మధురగతి : దోమలు తగ్గిన - తంధాన
సోముయి పండేను - తంధాన
చీమలు చెట్టలెక్క - తంధాన
భూములన్ని పండు - తంధాన

''సిద్ధాంతం తెలియుని ఆచరణ, చీకట్లో దెవులాడినట్లు'' - సరికొత్త వ్యవసాయదారులకు విత్తనాలు ఎలా భూమిలొ చల్లాలి, చల్లడంలో తీసుకోవలసిన జాగ్రత్తలు, అదును, పదునూ, చీడపీడల్లో తీసుకోవలసిన జాగ్రత్తలు, జలంబలం, మందుమాకు వగైర సస్యరక్షణ విధానాల ఇతివృత్తాలనూ, విషయ విజ్ఞాన మాలికల నాడి పాడిన విధం -

అర్ధ చంద్రిక : ఏడు ఎండలాకెండిన - విత్తుల్
ఎంతటి వరుపునకైనా - ఉండున్
చచ్చిన పండవు పుచ్చిన - విత్తులు
పైరుపల్చన పాతళ్ళు - కోరన్
వత్తు పైరు వాములను - కోరున్
అదునులో పొదలొ చల్లిన - పండున్
నువ్వుల చేనుకొ నూరుతె - గుళ్ళున్
కరువు లాపగ పండించు - పంటల్
మిడతలు జంపగ మండించు - మంటల్
(వంత పదం : రామరామ రామ॥)

అదును పదునుగని చల్లర - సై
ముదురున నిల్చిన మొక్కలె - సై
ముందుగ బుట్టిన కొడుకులె - సై'

పూసిన తంగేడే యరా - సై
కాసిన గానుగ నేయర - సై
ఆకు బలం వేసి చూడరా - సై
అడిగినంత పండేనుర - సై

ఇదే విధంగా ధాన్యల నాణాలు -
ద్విరదగతి -

ఆరిగలు పండించు రైతునా - కయ్యియె
ఆలు మగల కొకటె చీరా - భళి భళి
కొఱ్ఱ పంటొక పంటయేనా - ఓరైత
కంది పండిన కర్వుదీరూ - భళి భళి
జొన్న పెరిగితే జాడు పెరుగు - ఓరైత
వరి పెరిగితే వడ్లు పెరుగు - భళి భళి

నేదునూరి గంగాధరంగారి రైతు సామెతలేనాకాధారం. భూమినిట్లా సాగుచేసి పునాస పైర్లు సజ్జ, తెల్ల, యఱ్ఱ, పచ్చ, జొన్నల్లో పెద్దపెసలు, పిల్లి మిసరలు, దోసగింజలు కలిపి ఎదబెడుతూ గొఱ్ఱుల మధ్యన కందిసాళ్ళు, గోగుల పట్టెలు కుంటకట్టల పైన కూరల పాదులు ''ఓహో మూడు పూలు ఆరు కాయలు '' అన్నట్లు పండి వరిగిన పైర్లు పాలేలుగ పాలికేకలేస్తు -

పాట :

కొయ్యండల్లా కొయ్యండీ
కోసీ వోదెలు వేయ్యండీ
వానల వరదల వంగు నేమో
తిన్నగ దీసీ మొదలూ కోసీ
పనలన్నీని పొంజెట్టాలా
గింజలు బందలొ పడిపోకుండా
పొందుగ వెన్నులు కొయ్యండల్లా
కాలంసూత్తే సీతాకాలం
కొడవలి పాటూ జాగర్తల్లా

కాలూ సెయ్యీ ఆడీ తేనే
కుండలో కూడు కలిసొత్తాది.

కోతలు కాగానే నూర్పిళ్ళు సాగాయి. జొన్న సజ్జ కంకులు కందికంప కల్లాన వేసి పనిమంతులు రైతులు కంఠాలు కలిపి పాట :

ఒలియె ఒలియో ఒలియ
రావేలు గలవాడ రార పొలిగాడ
ఎద్దులు తొక్కంగ ఎదిగెనే రాసి
పెయ్యలు తొక్కంగ పెరిగెనే రాసి
రాగాలు నీవయ్యా రాసి మాదయ్యా
భోగాలు మావయ్య భూమి నీదయ్యా

నిండు రాసిలో ధాన్యాలు రైతులు పనివాళ్ళందరకూ ఈయవలసిన మేరలిచ్చి వారి బండ్ల పైనే సంగడులపైనే వారి వారి పనివారి ఇండ్లకు తోలుట నిన్న మొన్నటి వరకు వున్న ఆచారమిది తెలుగు దేశమందు - భూసాగు దశలో పోళ్ళు గొట్టి, బీళ్ళు దున్ని కారడవిని పంట పొలాలుగా మార్చడం చెప్పుకున్నంత తేలిక కాదు. పాతాళ గంగను పైకి తెచ్చినట్టే, కర్రలతో నిప్పును రాజేసినట్టే, అక్షరజ్యోతి వెలిగించడానికై చేసిన శ్రమ కన్న ఎక్కువ శ్రమ చేశారు మన వారసులైన త్రిలింగులు. అంటే పాత అనుభవాలతో నూతన పనిముట్ల రూపొందించి, కలియుగారంభ వ్యవసాయానికి తోడ్పడినారు యక్షులుయక్షగాన సహాయంతో ఉద్భవించినవే నాటి నూతన నేటి పాత వ్యవసాయ పనిముట్లు, ఈ వ్యవసాయ విధానం. (పనిముట్ల బొమ్మలు ప్రక్క పేజీలో చూడండి.)

నాడు యక్షగానం పాడిన వ్యవసాయ శాస్త్రం, వైద్య శాస్త్రం, అర్థశాస్త్రం, జీవశాస్త్రం ఆర్థిక శాస్త్రం వడైరా జాతి జీవిత పునాది విద్యల చంపుకున్నాం. కనకనే మెదడు కరుడు గట్టించు విద్యల, సగటు సరి అధికార మనస తత్వాన్ని పోతబోయు విద్యల, లంచాలమేయు పనిముట్టులను గా తయారుచేయు విద్యల, కలవారికి లాభాల కూర్చు విద్యల నేర్చుకుని నెత్తిన రుద్దిన కారణంగా నేడు విదేశాలకు వెళ్ళడం ఇంగ్లీషు మీడియాలు రావడం జరుగుతున్న దనుకుంటున్నాను.



కర్రు



కొడవలి



చెక్కనాగలి



గుంటక



పలుగు



గొర్రు



కాడి



మేడి



జడ్డిగం



పార

ఇలా ప్రజలు సాగించిన భూపతన కల్లోల, విప్లవాలలో (మార్పుల) పదపదార్ధ ప్రాధాన్యతను (పదము అనగా భూమి, పదార్ధమనగా వంటఇంటి సరకు)గూర్చి పాడినదే **''యక్షగానం''**, అలా ఆడిపాడినవారే యక్షులు.

ఈ భూపతన కల్లోల కాలంలోనె గణజనం వివిధ వృత్తులు, తెగలుగా యేర్పడినారు. అట్టి వివిధ వృత్తి దారులు, మరియు యక్షులు, భూసాగు చేసే భూస్పృశ్యుల నుండి **'వేంర '** అనే రాజసన్మానాలతొ బ్రతుకసాగారు. తెలుగు దేశంలో**అంటె, 'వేంర'** అనగా సన్మానించుట అని, పూజినీయులుగా భావించి సత్కరించుట అని, నిజమైన సత్యమైన 'రాసక్రమములను' విధిగా ఏర్పాటు చేయుట అని (ఆం။వా) అర్ధమున్నది. కనుక వృత్తిదారులు యక్షులు భూపతన కల్లోల దశలో భూస్పృశ్యులచే 'మేర'ల ద్వారా ఒకరి కొకరు సహాయపడుతు బ్రతికిరి.

ఒక ప్రక్క వృత్తిదారులకవసరమైన వస్తువనరుల యేర్పాటు విధానాలను, పనిముట్లు తయారీ నైపుణ్య పరిజ్ఞానాన్ని ప్రభోధించి,మరో ప్రక్క భూస్పృశ్యులకు భూసాగును గూర్చి ప్రభోధించి పాడినవారే అనుభవ కాలజ్ఞానులనే ''యక్షులు''. అని తెలిపానుకదా?, ఆ యక్షులే ఈ క్రింది తెగలు. **1. పల్లెచెంచులు, 2. కాయచెంచు, 3. కృష్ణ చెంచు, 4. దేవ చెంచు, 5. బుడబుడకచెంచు.** (వీరి బొమ్మలు ప్రక్కపేజిలో చూడండి) (ఆం॥వా॥)

వీరు పాడిన గాన లక్షణం ఏవనగా -

శ్లో॥ గానాస్యతు దశవిధ గుణావృత్తి ః ॥

(సామవేదం పేజీ 2-3)

అనగా - పదివిధములైన గుణములు కలిగివున్నదే గానం అని ఉన్నది. యక్షగానం వివరించిన పదిమొత్తము లేమిటి అనగా

**తధ్యదా -** **ప్రసన్నమ్, వ్యక్తమ్, శ్లక్ష్ణం, సమమ్, వికృష్టము, సుకుమారం, మధురం, రక్తమ్, పూర్ణమ్, అలంకృతమ్.**

**తధ్యదా -** హేతుజ్ఞానంతో పృదివ్యాది పంచభూతప్రకృతిని తమ అవసరాల కనుగుణంగ మార్చుకొనుట, నిత్యం వాడుకొనుట తత్‌సంభధిత పనులను, పనిముట్లుల, పరిశ్రమలను (నిత్యకర్మలను) జ్ఞాన,

కర్మేంద్రియాల యొక్క కార్యక్రమాలను ఆలాపించునట్టి, ఆడుతూపాడునట్టి ఆటపాట గాన లక్షణాలు ఏమనగా (ఆం॥ వా॥)

1. ప్రసన్నమ్ - అంటే శుచి శుభ్రతలను, నిర్మలత్వములను సత్యమైనట్టి, గౌరవ ప్రదమైనట్టి నడవడీ యోగ్యతలనూ, పరువు ప్రతిష్ట వగైరా మానవతాలక్షణాల మొత్తం ఆడిపాడుట. (ఆం॥వా॥)

2. వ్యక్తమ్ - అంటే పదపదార్థ స్ఫూర్తి గలుగునట్లు అంటే పదమనగా జనులు నివసించు భూమి. భూముల రంగులు, సారాలు, పంటలు పండాలంటే ఏనేలలో ఏ ధాన్యం, ఏకాయకూరలు వేయాలి ? వాటి అదును, పదును పండిన వాటిని వండుకునే విధానాలు, ఎప్పుడు చల్లాలి? వగైరా లను వివరించుట. (ఆం॥ వా॥)

3. శ్లక్ష్ణం - అంటే వూనినట్టిచర్మాలతోనూ, గోగు, జనుము, వేపనారలతోనూ వ్యవసాయానికి వుపకరించు యారమోకులు, పగ్గాలు, గడ్డిగట్టే తాళ్లు, వారెన్లు, కోపుటెడ్ల ఆవుల కోడెల తలతాళ్లు వగైరా తాళ్ళ అవసరాలు గూర్చి మొత్తంగా ఆడిపాడుట. అంతే గాక -

చర్మాలతో వాయిద్యాల మూతలు రూపొందిస్తూ వచ్చిన విజ్ఞానంగల చర్మ పారిశ్రామికులు ఆపనిముట్లతోనే యారగట్ట సామాన్లు రూపొందించి భూస్పృశ్యుల కందిస్తున్నారు. (అతడే చర్మపారిశ్రామికుడైన ''చండాలుడు'' .చండా - అంటే చర్మంలుడూ - అంటే వొలువు అని అర్థం) (ఆం॥ వా॥)

బరిశెలు, ఈటెలు, బాణములకు ఇత్తడి, రాగి, కంచు, ఇనుము కరగించు ఆయా పనిముట్లు రూపొందించిన పరిజ్ఞానులు వ్యవసాయ లోహ వస్తువులు రూపొందించు విధం.

వాద్యాల డొలుపుల డప్పుల రింగుల, వగైరా కొయ్య (వెదురు) పనిముట్లు రూపొందిస్తూ వచ్చిన అనుభవజ్ఞులు వ్యవసాయ పనిముట్లు, నాగళ్ళు, గొర్రులు, గుంటకలు జడ్డిగాలు రూపొందించు విధము.

ప్రత్తిని పింజి ముదుగు నూలు దీసిన దూదినేకి సన్ననూలు తీసే విధం. ముతక నూలుతోను, సన్ననూలుతోను, శీలాన్ని దాయగా పరిజ్ఞానంతో ఊర్వ్యమాల (నేటి రుమాల) పంచెలు, దుప్పట్లు వగైరా లెన్నో వస్త్రాలు రూపొందించు విధము.

చర్మాలపై బొచ్చు రంపెలతొ గీరిననుభవజ్ఞులు గడ్డాలు, జుట్లు గొరుగు విధము. భూమి సాగుదారులకు అండదండగా భూసాగునకు అవసర పనిముట్లు సమాజ ఆరోగ్య అవసరాల మొత్తంగా ఆడిపాడుట.

(ఆం.వా.)

**4. సమమ్ -** అంటే ప్రకృతీ ప్రసాదాల తింటు, ఆడుతు పాడుతు వచ్చిన ఆకతాయి వేటరులకు నూతన వ్యవసాయ జాతి జీవిత నడవడుల జీవనవిధానాలను, వనరులను, పరిశ్రమలను, విజ్ఞాన వికాసాలకు సంబంధించిన ఇతి వృత్తాలను, కథావస్తువులను, వ్యాకరణ శిక్షితమైన అక్షర మాలికలు వగైరా నూతన వ్యవసాయ జీవితావసరాల ఆలోచనల పరిశ్రమల మొత్తంను రసభావ యుక్తంగా ఆడిపాడుట.

**5. వికృష్టము -** ఉచ్చస్వరముతొ తారస్థాయిలో పదములు ఆలపించి వాక్యములను, శృతి, స్వర, మేళ వింపులతొ పదముల, వాక్యముల, వాటి అర్థముల స్పష్టంగ, క్షుణ్ణంగ సమాజానికి అర్థమయ్యేట్టు పాడుట.

**6. సుకుమారం -** అనగా తిండి మొక్కల పెంచు విధం మరియు నవధాన్యాలు, పప్పుదినుసులు, కూరకాయలు పంచువిధము భోదించుట.

**7. మధురం -** స్వభావముచేత, లలితాక్షరి విన్యాసము చేత, తదుచ్చారణ లాలిత్యంచేత, పదార్థ విజ్ఞా ప్రజ్ఞాన విషయముల ఉప్పు, కారం, పులుపు, రుచుల ద్రవ్య గుణముల, పిండి పదార్థముల, మాంసకృత్తుల, ఆరోగ్యరీతుల సరుకుల ఉపయోగావసరాలను ఆడిపాడుట.

**8. రక్షమ్ -** రసభావముల ప్రకటించి ప్రదర్శించునపుడు 'ఆనద్ధ' 'శుషిర' వాయిద్యాల స్రుతులందు కంఠవీణల మేళవింపులో నాదముల, శృతుల,

స్వరముల యేకీకృతంజేసి శృతి, స్వరపరిపక్వతల, లయతాళగతుల, గానలక్షణాలు మొత్తం ఆడిపాడుట.

9. **పూర్ణమ్** - శృతీస్వరమేళవింపులతో పాటుగా జాతినాదముల నుండి పలికిన అక్షర సరుల, వాక్యాల, సమాసాలను చందోబద్ధంగా కావ్యలక్షణాలతో ఆడిపాడుట.

10. **అలంకృతమ్** - అవసరమైనట్టి దృశ్యశ్రావ్య హేతువులందు లోకోక్తులు, సమాజం నిత్యం వాడుక పదములు చలోక్తులు, పద యమక గమకములతో హాస్య, శాంత, అద్భుత రసములతొ ఆడిపాడినట్టి ద్వంద్వార్థ పదముల , కలగాపులగంగా కలిగినట్టి మాలికలను మంద్ర, మధ్యమ, తార స్థాయి లలో ఆడిపాడుట (అ॥ వా॥)

సామవేదం చెప్పిన యీలక్షణాలు, గుణాలు శృతి, స్వర, స్థాయి, మూడు స్థాయిలు కలిగినగానం దేశిగానం తరువాత యక్షగానానికి ముందు మరొకగానమేదీ తెలుగు దేశంలో లేదు కనుక ''సామవేదగానం'' యక్షగానమే కాని మరేదీ కాదు. గంధర్వ, మార్గ, ఖడ్గ, దేశి గానం నుంచి యక్షగానం వృద్ధి చెందినది. (యక్షగానం నుంచి ''బుర్రకథ'' పుట్టినది కావున, బుర్రకథ గాయకులీ గాన లక్షణాలను కాలానుగుణంగా మానవ జీవితావసరాల, పరిశ్రమల కనుగుణంగా వివరించాలని, అప్పుడే ప్రజలు బుర్రకథను తదితర కళలను ఆదరిస్తారని నా అనుభవం).

## 17. నాద (గాన) సంకేతాలు - సప్తస్వరాలు

ఇప్పటి వరకు గంధర్వ, మార్గ, దేశి, యక్ష, గానాల వివరణ వివరించాను. ఇక సప్తస్వరాల నిర్దేశికత ఎలా జరిగిందో వివరిస్తాను.

**భరతుడు :** అనగా రసభావముల కనుగుణంగా స్వరాలను కూర్చువాడు, శృతుల, స్వరాల, స్థాయిల స్థిరీకరించువాడు.

**స్వరాలు :** అనగా ప్రకృతి పశు, పక్షి, మృగ జీవరాసులు మనతోసహ జీవ జాతులు తమ తమ అవస్థల కనుగుణంగా కూసే కూతలు, అరుపులు, కేకలు, పలుకులను మనషులనుకరించి, ఆయాజీవులన్నింటిని ఆకర్షించి ,

ఆహ్వానించినవే ''సరళీస్వరాలు'' ఈ సరళీలనెలా నిర్ణయించారు ? వీటి లెక్కకెన్ని ? అనగా-

**సరళీలు :** అనగా మనిషి యొక్క ఎదుర్రొమ్ము మధ్యగుంటకు సూటిగ వెన్ను పూస వున్నదని, ఈ వెన్నుపూసనే ''సృష్టి అస్థి'' అన్నారు శాస్త్రవేత్తలని, దీనినే ''మాలవీణా దండం'' అని అన్నారు యక్షులని శాస్త్రసమ్మతం.

**స్వరాల పుట్టుక :** మనిషి ''వెన్నుపూస'' అనే ''వీణాదండం''పైన హృదయ పద్మము నుండి నడినెత్తి కపాలరంధ్రం లోపలి వరకు అడ్డంగా ''ఇరువదిరెండు'' సన్నని నరాలు ప్రకృతి సిద్ధంగా అమర్చబడినవి. ఈనరాలను ''పాలశేర్లు'' అన్నారు శరీర శాస్త్రవేత్తలని, వీనినే ''గజ్జనరాలు'' అన్నారు యక్షులని శాస్త్ర సమ్మతం. ప్రకృతి ప్రసాదించిన ఈ గజ్జనరాలు ''ఇరువదిరెండు'' ను, మనిషి లోనికిగాలి పీల్చినప్పుడు, బయటకి గాలివదలినప్పుడు మ్రోగుతు వుంటాయన్నారు శరీరశాస్త్రవేత్తలు. (నేడు శతస్కోప్ అనే యంత్రం ద్వార గుండెను, ఊపిరి తిత్తులను, వెన్నును పరీక్షించు డాక్టర్లే మనకు సాక్షులు).

గజ్జనరాలనుండి మ్రోగే జీవనాదాలను, ప్రాణ వాయువు నాభీ స్థానము నుండి హృదయం, కుతిక, కంఠాల ద్వారా గుండె, ఊపిరితిత్తుల వగైరాల పట్టుతో బైటకు తోస్తూ వుండగ ఆ జీవనాదాన్ని వాగాంగాల అనుకూల దశల కనుగుణంగ 'గంధర్వగానం' 'మార్గగానం' 'ఖడ్గగానం' 'దేశిగానం' వుద్భవించగా, వ్యాకరణ శిక్షితమైన భాషను, 'శృతిమాతా పితలయ' అన్నట్లుగ గానానికి ప్రాణమైన శృతిని , స్వరాలను, అకార, ఉకార, యమక, గమక, జర్కు , స్ఫురితాలను, వాటికి సౌంజ్ఞ అక్షరాలను, సృష్టించుకున్నారు యక్షులని నాభావన.

నిరంతర ఉచ్ఛ్వాసా నిశ్వాసలందు మ్రోగే జీవనాదం, నాభిస్థానంనుండి వీణాదండము పైగా నిత్యం నిచ్చెన మెట్లెక్కినట్లు హృదయం నుండి కపాల రంధ్రంలోపలి వరకు పైకి పైపైకి నడిచే జీవనాదాలను ''స, రి, గ, మ, ప, ద, ని, స'' అన్నారు.

స : అనగా యవ్వన మదంలో మైథున వ్యసనంలో, కారు మేఘాల మైకంలో, ఉదయ సూర్యుని కెదురుగా, పురివిప్పి జిగిబిగి కులికిస్తూ అందముగా అడుగులు నటిస్తు, మెల్లమెల్లగ గెంతుతు తోడుకోరే , కోరికలు తెలిపే నెమలి పిలుపే ''స''.

ఆ కేక విన్న ఆ గానమాలకించిన కన్నె నెమళ్ళు ఆ సాయ, ఆ తావు వెతుకుతూ ఆవాసనల నాఘ్రాణిస్తు ఆ పోతు నెమలి చుట్టు కన్నె నెమళ్ళు చేరుట గమనించి మార్గ గానానుభవంతో యక్షగాన గాయకులు ''సాధనమున పనులు సమకూరు'' అన్నట్లు ఆ నాదాన్ని దిన సాధనలో కుతిక, కంఠం, దౌడలు, అనునాశికం, దంతాలు, జిహ్వ ఈ ఆరుస్థానాల నుండీ నాదాన్ని పూరించి బైటకు పంపకం చేసినప్పుడే, ఆ నాదము విన్నప్పుడే కన్నె నెమళ్ళు ఆ చోటికి వస్తున్నవి. అదే నిజముగ నెమలి కేక అను కొనుచున్నవి. అలా నెమళ్లలో స్పందన కలిగించేలా యక్షులు ఆలాపించిందే 'స '.

రి : అనగా యవ్వనంలో బలిసి మైథున వ్యసనావస్థలో వున్న పోటెద్దు, ఆంబోతు కాలునుదువ్వి, ''రిడింగ్ ..రిడింగ్'' పిలుపు వినిపించి నంతనే, ఎదపెయ్యలు, ఆవులు యవ్వన వాసనల నాఘ్రాణిస్తూ పిలుపు దాపులకు చేరుట గమనించారు యక్షులు అదే ''రి''.

ఆ నాదాన్ని ఆదే నాదంతో యక్షులు ఆలాపించిందే 'రి'.

గ : అనగా బలిసిన మేకపోతు కారుకొచ్చిన మరకల వీపున కాళ్లతో సైగ చేస్తు, గడ్డమును వీపున మృదువుగా రాస్తూ ''గ్రే. గ్రే. గ్రే'' అన్నట్లు నాదము వినిపించును. అట్టి మేకపోతు నుండి వినుపించునదే 'గ'.

ఆ నాదము కుతిక, దౌడలు, అనునాసిక ఏకీకృతముగా సాధన చేసి యక్షులు ఆలాపించిందే 'గ'.

మ : అనగా పైరు పంటలైన వరిగ, సోము, ఆరిగ, కొర్రలు పండి వరిగిన తరుణంలో ఆకాశమార్గాన కమ్మగా కూస్తు గానం చేస్తు, వందలాది పక్షుల గుంపు ప్రయాణ చేస్తుంటాయి. ఈ గాయక పక్షులను ''ఓదెకొంగలు'' అన్నారు జీవశాస్త్ర కారులు. ''క్రౌంచ పక్షులు'' అన్నారు యక్షులు. ఆ పక్షులు చేసే శబ్దమే 'మ'.

వీటి కంఠనాదాలు ఆకాశం నుండి బహు సొంపుగా వినిపిస్తుంటవి. ఆ నాదాన్ని దౌడల, అనునాసికల, నాలుకల నుండి పట్టుతో యేకీకృతంగా పలకాలని అనుకరణ

జ్ఞానంతో ఈ ''మ'' అనే అక్షరాన్ని ''రి'' ''గ'' లవలెనే స్థిరపర్చి యక్షులు ఆలాపించిందే 'మ'.

ప : అనగా బలిసి యవ్వనంలోనున్న, మావిచిగురులు మెక్కి మదమెక్కిన కారుకొచ్చిన, కోయిల గానం ''ప''.

ఈ మృదు మధుర అక్షర నాదాన్ని దౌడల, అనునాసిక పట్టుతో ఏకీకృతంగా పలికి నప్పుడే కోకిల బదులు పలుకు తుందని ఈనాడు రుజువగుచున్నది. దానినే అనుకరించి యక్షులు అలాపించిందే 'ప'.

ద : అనగా బాగ బలిసి వ్యసనంలో నున్న ''గుర్రం'' ముక్కులు ముకుళించి ''ర్ఘుర్ ర్ఘుర్'' శబ్దం ముక్కు నుండి వినిపిస్తు తొల్కరి , వురువు వురిమినట్లు ''ద్ర.ద్ర.ద్ర.ద్ర.దా'' నాదిస్తున్న గుర్రం గుభాళింపుల సకిలింపులే ''ద'' .

ఆ నాదాన్ని కుతిగ, దౌడలు, దంతాలు వీటి పట్టుతో యక్షులు ఆలాపించిందే ''ద''.

ని : అనగా నేలకావులో పడదోయబడిన మదపుటేనుగు ''ఘీ'' కారము. మత్తుగా, నిషామైకం అవరించినట్లున్న నాదమే ''ని''.

ఆ నాదాన్ని ఒక్క అనునాశిక నుండే పల్కాలని, అలా యక్షులు ఆలాపించిందే ''ని ''.

వేటగాండ్రయిన ఆ గాయకులనుకున్నంత తేలికగా, సుళువుగా ఆపక్షుల కేకల సరళీలు కూస్తున్నారంటె, అనాదిగా వంశపారంపర్య విద్య. తాత నుండి మనుమనికి, తండ్రినుండి బిడ్డకు అలవాటుగా వస్తున్నది. వారి బ్రతుకు దెరువునకు ఆధార వస్తువైయున్నది. యీ కేకలమాలే ఆ వేటరులకు ఆది ప్రధాన జీవనాధారం. ఈ విధంగా సప్త స్వరాల స్థిరీకరణ పశుపక్షి జీవజాతుల ఆధారంతో వారి పోషణకై స్వరాలను యక్షులు స్థిరపరచుకున్నారు.

# 18. శృతి స్వర విజ్ఞానం - యక్షగాన ప్రాణం

'శృతిమాత, పితలయ' అన్నారు పెద్దలు . ఇప్పుడు తెలుగు కళల శృతి ప్రాధాన్యతను వివరిస్తాను. వీణాదండమనే వెన్నుపూసపై మ్రోగే గజ్జనరాలమాల వరుసను కుతిక నుండి నిచ్చెన మెట్లెకినట్లు సాగే 'స. రి. గ. మ. ప. ద. ని.'' ఏడు స్వరముల బారును ''మంద్రస్థాయి'' అన్నారు .

కంఠం నుండి గజ్జనరాల నిచ్చెన మెట్లెక్కినట్లు మ్రోగే 'స. రి. గ. మ. ప. ద. ని.' యేడు స్వరాల బారు ''మధ్యమస్థాయి '' అన్నారు.

కంఠము, అనునాసిక, కొండనాలుక పట్టుతో మాడువెంట్రుకలపాదు అంచు వరకు సుషుమ్నానాడి నాదాన్ని నిచ్చెన మెట్లెక్కి నట్లు పైకి పైకి నడిపే 'స. రి. గ. మ. ప. ద. ని.' ఏడు స్వరాల బారును ''తారస్థాయి'' అన్నారు.

మాడును ఛేదించి, సెలిగి అందుండి సుషుమ్నానాడి నాదాన్ని బైటకు పంపకం చేసేది పై షడ్జమం (స.). ఇట్లా మద్యమ షడ్జమశృతి మూడు స్థాయిాలు శృతి స్వర పక్వంగా - ఇరువది రెండు(22) (ద్వాదశ స్వరస్థానాలను) నాదాలు పట్టాలి. అప్పుడే మొత్తం 22 స్వరాలు పల్కునన్నారు యక్షులు.

కొండనాలుకపైన మాడు వెంట్రుకల పాదైన ప్రాంతాన్ని కపాళ మన్నారు. హృదయము నుండి సాగిన గజ్జనరాలు గాక, సుషుమ్న నాడనే మరో నరమున్నదనీ, ఈ నాడీ నాదంలో మత్తు, మైకం కలిగించు స్వభావమున్నదని, తారస్థాయిలొ గాయనీ గాయకులకు అరకన్ను లేర్పడునని, వినేజీవులకు అరకన్నులేర్పడుటే గాక మత్తుజల్లినట్లు మైకంలో మునుగుదురని ఇదే యీ తారస్థాయి లక్షణమనీ శాస్త్రసమ్మతం.

జానపద గాయకుల మొదటి ''శృతి వాయిద్యం'' ''పిల్లనగ్రోవి''. దీనికన్నాముందు మరోశృతి వాయిద్యం లేదు. కాని గాలి వాయిద్యాలందు, పిల్లనగ్రోవునకు క్రిందినుండి ఆరు చిన్న రంధ్రాలు, నోటితో గాలి ఊదేందుకు కొంచెం పెద్దరంధ్రం మరొకటి వుండును. పిల్లన గ్రోవు క్రిందనుండి నాలుగో రంధ్రం వ్రేలెత్తితే వినిపిచేది షడ్జమం. (స) ఆరు రంధ్రాలు మూస్తే వినిపించేది ''మ''. అనగా మూసిన వ్రేళ్ళు వరుసగా ఎత్తినప్పుడు ఈ వరుస

క్రమన్ని మధ్యమ షడ్జమక్రమం అన్నారు. ఐతే మధ్యమ షడ్జమ క్రమాన్ని నిర్ణయించుటలో గానానికి ఎలాంటి మంచి జరుగుచున్నదంటే -

మధ్యమ షడ్జమం నుండి క్రిందికి (అవరోహణం) 'ని.ద.ప.మ.గ.రి.స.' పైకి (ఆరోహణం) 'రి.గ.మ.ప.ద.ని.స.' ఏడేసి స్వరాలు క్రిందికీ పైకీ అన్నందున గాయనీ గాయకులు రస, భావములయందు స్వరాల నాలాపనల్లో వారి వారి పాండిత్యం గాత్ర సౌలభ్యం, మూడు స్థాయిల వివరణందు వెసులుబాటు, రస, భావ, ప్రకటనల స్పష్టతలకు విశ్రాంతి ఎక్కువ వుంటుందని నేను భావిస్తున్నాను.

సాంప్రదాయ జనపద గాయక కళాకారులలొ బాగా ముసలి వారు ''భవనీ కథకులు'', వీధి భాగవతులు, యక్షగాన తొలి బిడ్డన దగిన బుర్రకథ గాయకులు ఆలాపనలొ, కథ నడకల్లో మధ్యమ, షడ్జమమే నేటికి వినిపిస్తున్నది. నేనూ బుర్ర కథగానాన్ని ఎక్కువ ''సాయలు'' మధ్యమ షడ్జమంలోనే ఆలాపించాను. ఉస్తాద్ అబ్దుల్ కరీంఖాన్, బిస్మిల్లా షహనాయి వింటుంటే అదీ మధ్యమ షడ్జమంగానే వుంటుంది. బుర్రకథకుల తంబుర్ర ఇత్తడితీగె భుజానికి బొటన వ్రేలుకు మొదట ''ప'' వినిపిస్తుంది అంటే వీరి నాద శృతి 'ప॥ స'ప॥ స'॥ అని వినిపిస్తూ వుంటాయి. అంటే బుర్ర కథకులు భుజం వైపు నుండి మెడ వైపు తీగెలను వ్రేళ్ళతో కొడతారు. బొటన వ్రేలు ఇత్తడి తీగెల పై నాదమాలికల కనుగుణంగా ఆడుతూ వుంటుంది.

కానీ ఒక్క కర్నాట సంగీత విధ్వాంసుల ఆలాపనా ఎత్తు గడలు మాత్రం నాకు మంద్ర షడ్జమంగా వినుపిస్తున్నవి. కర్నాట సంగీత విధ్వాంసుల శృతి వాయిధ్యం పెద్ద తంబుర ఇత్తడి తీగ మొదట వుంటుంది. అదివారి 'స' తరువాత ఉక్కు తీగ 'ప'. కనుక వీరి నాదశృతి 'స॥ప''స॥ ప'॥ అని వినిపించును.

నేటి బుర్రకథ రగడమాలికలు లయ, తాళ, గతులు, తంబురాపై శృతి, గతి, మాలికలు వినవించుట ఆ గానకాలం నాటి వనుకుంటున్నాను. వేషం..దుస్తులు, రంగుల ఎన్నిక నిర్ణయాలు నావి.

# 19. జాతక్షర విరులు - యక్షగాన సరులు

జాతి యక్షగాన అక్షర మాలికలు, తెలుగు సాహిత్యం ఏ చరిత్రల్లోనూ వివరంగా లేవు. ''అప్పకవీయంలో'' పేజీ 252 -265 లో అప్పకవి తాళాక్షరాల లెక్కలిచ్చారు. ఇతి వృత్తాలేమిటో ఇవ్వలేదు. మన తెలుగు సాహిత్య శాస్త్రాల్లో లేని యీ మాలికలు అప్పకవికి ఎలా వచ్చాయి? అప్పకవి ననుసరించి రుద్రయ్య యక్షగానం పేరుతో ''సుగ్రీవ విజయం'' వ్రాశారు. ఇవి రెండే ఈ నాటికీ మనకు కనిపిస్తున్న యక్షగాన (అధార్టీ) వాస్తవ గ్రంధాలంటున్నారు, వేటూరి ప్రభాకర శాస్త్రి గారి వంటి పెద్దలు. కానీ రుద్రయ్య గారు కూడా నాటి విషయం కథా వస్తువుల వివరాలు వ్రాయలేదు. ఆయన వ్రాసినదీ కల్పిత కథేగాని యక్షగాన కాలంనాటిది కాదనుకుంటున్నాను. ఆనాడు **శ్రీ మద్రామాయణం** అసలు వ్రాయబడిలేదని నమ్ముతున్నాను.

జాతి యక్షగాన మాలికల పోలికలు, అప్పకవి చెప్పినట్టి ఐదు జాతుల అక్షర లెక్కలు లయ తాళ గతులు గిరిజనుల పేర్లతో ఉన్న కోయ, చెంచులు అనే తెలుగు అటవిక గాయక తెగల్లో '' నిషాదులు'' 'పంచములు' అని చెప్పబడుతున్న ఐదు తెగల్లోనే ఈ ఐదు మాలికలు వినిపిస్తున్నవి. మరేతెలుగు కంఠాలనుండీ వినిపించుట లేదు. కనుక వీరే యక్షగానం పేరుతో పాటు నిషేదింపబడిన పంచములు, యక్షగాన గాయకులు అని నమ్ముతున్నాను.

అప్పకవి సీ ॥ తుదనేడు లఘువులు తొలగించి చదివిన
త్రిపుటకు ''వృషభగతి'' పద యుగము.
లలి గడపల ఒక్క లఘువు మానిన ''ఝంపె'' మను
''ద్విరదగతి'' సమపదయుగము.
గురుతగు రచ్చెరకు దురగ వల్గనా హ్వాయ
మేక తాళి యా మధురగతికి ''
ఆంఘ్రి కిర్వది నాలుగు '' అట తాళము'' నమాత్ర
లోనే విశ్రాంతి పద్నాలు గింట
తే ॥ గీ దెలియ''అర్థంబు'' అర్థచంద్రికలు వీలు
యక్షగాన ప్రభందంబు లతుకవచ్చు
రగడ భేదంబు లివి యంద్రు రసకవీంద్రు
లలిత నిజ సేవకస్తోమ అబ్ధిధామ

(అప్పకవీయం పేజీ - 252)

అప్పకవి - త్రిపుట : సరిగ సరిగపః
గుమ్మెట దరువు : తకిట తకధిమి.
**వృషభగతి మాలిక :** తుదను - యేడూ - లఘువు-ఁ నూ 14
తొలగ - జేసీ - చదువు - కొనినా 14
త్రిపుట - కు వృషభ - గతి పద యుగము. 14

అప్పకవి వరవడిలోనే కందుకూరి రుద్రయ్య '' సుగ్రీవ విజయం'' పే - 3

కపికులోత్తమ- నాకు జూడగ - 14
గపట వేషము - గానరాదిది 14
విపుల పుణ్యాల - బాపమతులను. వహ్వారే వహ్వా

అని బుర్రకథకులు వూతపదంగా పాడుతున్నారు చివర, వీరి ననుసరించి బుర్రకథా పితామహాషేక్ నాజర్ '' బొబ్బిలి యుద్ధం'' బుర్రకథాగానంలో

అట్టి మాటకు - ధర్మరాయుడు - 14
అగ్గి పిగుగ్గై - భగ్గు మనితా - 14
పట్టి మీసం పట్టి దువ్వాడ - నారాయణా

**ఈ వృషభగతి మాలికను - అప్పకవికీ, రుద్రయ్యకూ, నాజర్ల కందించిన కోయ చెంచు మాలిక :**

చెవిలో పోటుకి - చెవులో చీముకి -14
వాయు నొప్పికి - వాయు నొప్పికి - 14
కొర్నాస్సుమది - రసబ స్తాముంద. -14
(॥ తాళగతిలో రాగసాయలో కేకవేస్తారు॥)

అప్పకవి కురుజంపె : సరి సరిగ
గుమ్మెట దరువు : ధిమి ధిమిత
**ద్విరదగతి మాలిక :** లలీ గడప తొక్క లఘువూ - 10 ॥ భళి భళి ॥
మాన ఝంపె ద్విరదగతి - 10 ॥ భళి భళి ॥
సమపద యుగమ్మూ - 10 ॥ భళి భళి ॥

అప్పకవి వరవడిలోనే కందుకూరి రుద్రయ్య 'సుగ్రీవ విజయం'.

వనచరోత్తము లెల్ల వచ్చి॥ మంచి॥
దినము చే కొని నిన్ను దెచ్చి ॥భళి భళి ॥

వీరి ననుసరించి షేక్ నాజర్ ''అల్లూరి సీతారామరాజు యుద్ధం'' బుర్రకథా గానంలో

కొండగడ్డితో కొంపగట్టే - 10 - భళిభళి
పండాకులే పట్టుపరుపూ - 10 - భళిభళి
పుల్లనీల్ చలువ యంటాడా - 10 - భళిభళి
మల్లగంజే త్రాగుతాడా - 10 - భళిభళి

**ఈ ద్విరదగతి మాలికను అప్పకవి, రుద్రయ్య, నాజర్ల కందించిన ఆది యక్షగాన గాయకులు ''ఎరుకచెంచు'' గాన మాలిక**

॥ఎరుక చెంచు॥ సోది ॥గద్దె॥ తాళ గతి రాగయుక్తంగా పాడుతుంది.

ఇంతగల శరదనే అమ్మో - 10 - ॥ నేను ॥
ఇల్లిడిసి పోలేదే తల్లో - 10 ॥ భళి భళి ॥
పోలేక పోయానే అమ్మో - 10 ॥ నేను ॥
పేరులే గొంటానె తల్లో - 10 ॥ భళి భళి ॥

అప్పకవి ఆదితాళం : సరిగమ
గుమ్మెట దరువు : తకధిమి

**మధురగతి మాలిక** : గురుతగు - రచ్చరకు - తంధాన
తురగవ - ల్గనా హ్వా తంధాన తంధాన
మేకతాళ్య మధుర్ - గతి - తంధాన

అప్పకవి వరవడిలో రుద్రయ్య సుగ్రీవ విజయం మధురగతి మాలిక

ముక్కలు - చెక్కలు - తంధాన
మూపులు వీపులు - తంధాప
ప్రక్కలు సిక్కలు - తంధాన
స్వరములు శిరములు - తంధాన

వీరిననుసరించి షేక్ నాజర్ పలనాటియుద్ధం బుర్రకథలో మాలిక

శ్రీమన్ మహావీర - తంధాన
కామేంద్రావిభుడు - తంధాన
మానభూషణులక్కు - తంధాన
దీవించి వ్రాయు - తంధాన

**ఈ మధురగతి మాలిక అప్పకవికి, రుద్రయ్యకు నాజర్ల కందించినట్టి ప్రాచీన యక్షగాన గాయకుడు '' కృష్ణచెంచు'' మాలిక.**

ఉ ॥ రేపల్లె వాడాలో - చెంచీత

గోపెమ్మ నీలాడే - చెంచీత

ఏ మూరు ఏ భామ - తంధాన

ఏ వారి దానావే - చెంచీత

అప్పకవి అట తాళంలో మరోమాలిక ఉన్నది కాని ఆ మాలిక (రగడ) పేరు లేదు. ఈ అట తాళంలోనే హరికథ పితామహుడు ఆదిబట్ల నారాయణ దాసుగారు అట తాళ రగడను '' **మంజుగతి** '' అన్నారు. (మార్కండేయ చరిత్ర హరికథ పేజు 28) మంజుగతి అనగా ఈ క్రింది అర్థము.

మమ్ - అనగా పోరాటము

జు - అనగా పోరాటము

గతి - అనగా ఆ తరుణము

కావున మంజుగతి అనగా జనసమూహపోరాట తరణము అని అర్థం. అంటె తెలుగు జాతి ఆబాలవృద్ధులు అడవులను పంటభూములుగా మార్చుటకు పోరాడినదశ. ఆ తరుణంలో పాడినవని అనుకుంటున్నాను.

' అంఘ్రి కీర్త్యదినాలు గట తాళమున్ మాత్ర లోని విశ్రాంతి

పద్నాలుగింట - 14+ 10 = 24 (దాసుగారి నిర్వచనం)

రుద్రయ్యగారి ''సుగ్రీవ విజయం'' మంజుగతి మాలిక

కపికులోత్తమా - కపి శిఖామణీ

కపివతంసా నిర్మల - నాయన

మంజు మంజుగతి కపికులాంబుధీ - పూర్ణా హిమం

కరకపి వరేణ్యా - నాయన

వీరి వరవడిలో షేక్ నాజర్ పలనాటి యుద్ధం బుర్రకథలోని 'మంజుగతి' మాలిక.

మాలామాదిగ చాకలి మంగలి

సర్వ జనుల నెల్ల - నాయన

ఏక పంక్తిలో విందు భోజనము

లేరుపరిచి నాడా - నాయన

**ఈ అటుతాళ 'మంజుగతి మాలికను అప్పకవికి, నారాయణ దాసుగార్కి నాజరుకు అందించినట్టి ఆదిమ యక్షగాన గాయకులు ''దేవచెంచు'' మాలిక.**

ఉ ॥ మాయమ్మ సత్తెము - చూడండమ్మాయి

ఇల్లాలో ఓ ఇల్లాల్లో - వహ్వా

పసుపు పచ్చునగు - నీ దేవి సత్తెము

కుంకు మెఱ్రనగునా - వహ్వా

అప్పకవి చెప్పిన అర్ధ చంద్రికలు ''ఆంఘ్రి కిరువది నాలుగటతాళమున మాత్రలోని విశ్రాంతి పధ్నాలుగింట , 'అర్ధంబు' అర్ధ చంద్రికలు వీలు'' అన్నారు.
అనగా అటతాళ మంజుగతి లోని సగం అర్ధచంద్రిక అన్నారు. ఇరువది నాలుగులో సగం పన్నెండు అక్షరాలు. అర్ధ చంద్రిక అన్నారు. ఇవి మొత్తం ఎనిమిది అన్నారు అప్ప కవి.

ఆచరణలో రగడలు **'పోతం- పెంటి'** అనే జంటగా కనిపిస్తాయి. అందువల్ల ఎనిమిది పోతు పెంటి లెక్కన నాలుగంటున్నాను.

రగడ ఉ ॥ పోతు : అక్షర హరవిక చాంబుర - హోక్షున్

పెంటి : యక్షప సుఖనుత యరుకుల - దక్షున్

రక్షక సురవిదు రద్విప - రక్షున్

రాక్షస విదళన ప్రరుచిర - పక్షున్

అప్పకవి చెప్పిన పన్నెండు (12) అక్షరాలు పైన చెప్పిన 'అక్షర' (4) 'హరవిక' (4) 'చాంబుర' (4). ఇక 'హోక్షున్' అనేది బుర్రకథలో వాడే తంధాన, భళి భళి మొ॥ వూత పదాల మాదిరిగ వాడినదని నాభావన.

ఇక అర్ధచంద్రికలలో ఎన్ని నడకలు ఉన్నాయో వివరిస్తాను.

సుగ్రీవ విజయంలోని నడక

అర్ధచంద్రిక : అంత నెత్తురుటేరు లంతటన్ వచ్చెన్ ॥ తంధా॥

రక్కసున్ ఘోషముల్ - వెక్కసంలాయెన్ ॥ తంధా॥

(వంత పదం : తంధాన తంధాన తంధాన)

రెండవ అర్ధ చంద్రిక : కన్నుల శృవులు గ్రమ్మన - వగచున్
ఔర విధివశమనితల - యూచున్ ॥ రామా ॥
(వంత పదం : రామ రామ రామ, కోదండరామాపాహి
హరి రామ చంద్రపాహి పట్టాభిరామపాహి )

మూడవ అర్ధచంద్రిక : చదువులు దెచ్చిన జలచరా - ॥ సై ॥
కుధరము మోసిన కూర్మమా - ॥ సై ॥
(వంత పదం : సై సై)

నాల్గవ అర్ధచంద్రిక : స్వర్ణ కుంభములందు - గంగాజలము దెచ్చి ॥ తంధా॥
అంబు జాప్తతనూజ - నభిషేకమున్ జేసి ॥ తంధా॥
(వంత పదం : తంధాన తంధాన తందన )

వీరి ననుసరించి షేక్ నాజర్ 'పలనాటి యుద్ధం' బుర్రకథలోని అర్ధచంద్రిక

ఉ ॥ ఆమలి దేవులు పాలించు సీమ - ॥ తంధా॥
ఎల్ల విధంబులు విల్లసిల్లుచుండె ॥ తంధా॥
(వంత పదం : తంధాన తందాన తందన)

మరో నడకలో ఉ ॥ అన్నదమ్ముల పోరుతో - సై
పతనమైన పల్లనాడురా - సై

మరో నడకలో ఉ ॥ అన్నియాన ధరియించి శిరంబున
మునికన్నెల జూపించు నెపంబున ॥ రామ॥
(వంత పదం : రామ రామ రామ కోదండ రామ పాహి)
హరి రామ చంద్ర పాహి పట్టాభిరామపాహి)

మరో నడకలో ఉ ॥ స్త్రీ జాతి రా గుండె నీరు కాలేదుర - ॥ తంధా॥
నీ మాతనవనాళ్ళు వ్రాలి పోలేదుర - ॥ తంధా॥
(వంత పదం : తంధాన తంధాన తందన)

**ఈ అర్ధ చంద్రికలను మా అందరి కందించిన ఆది యక్షగాన గాయకులు "బుడబుడక చెంచులు."**

ఉ॥ " మేలు మేలు మేలవుతది - రాజః
చాల మేలు మీకు కలుగును - రాజః
పెట్టెలో వున్నదిపేటంచు - పంచః
(చెమటలన మాసిన జరంచు - చీరః )

# ప్రకృతి గానం - ప్రకృతి సంగీతం

జీవుల అవసర ఆహార శ్రమ జనితమైన గానం, జాతి పరిణామ క్రమంతో వృద్ధి పొందుతూ వచ్చిన గానం, జాతిని సంస్కృతి నొందించిన గానం యక్షగానం. (బుర్రకథ గానం).

శ్లోకం - హృదయాకాం : తస్మిన్నయ : పుపుషో
మనోమయ : అమృతోహిరణ్మయ :
అంత రేణు తాలుకేయ ఎషస్తనయి వాలం బలే కేంద్ర యోన :
యత్రా సౌకేశాం న్తోవివర్తలే వ్యపోహ్యా శీర్షక పాలే
భూరిత్యగ్నౌ ప్రతిష్ఠతి భూవ ఇతి దాయా

హృదయం - అనగా ! రొమ్ము ఎడమ ప్రక్కన లోపల తామర మొగ్గ ఆకారమున శబ్దము చేయుచూ అనేకములగు రక్త నాడులు ఊర్ధ్వనాడులూ అధోబిళము గల మాంస పిండమును హృదయమందురు. (గుండె) దీని యందు పురుషుడు అనగా 'జీవము' ఉండును.

ఎష : ఆకాశ : - అనగా ! యే ఆకాశ తత్త్వమనబడే జీవనాదుమున్నదో

తస్మిన్ - అనగా ! ఆ యొక్క జీవనాదమందు 'పురుష :' జీవమున్నది.

పురుష : - అనగా గాయక స్త్రీ పురుషులు అకార, ఉకారములు, ఝుర్కులు, ఆరోహణ అవరోహణలను రసభావాల కనుగుణంగా నాదాలను శృతి స్వర పక్వంగా మధ్యమ షడ్జమ శృతిలో కంఠము నుండి దంతాల, దవడల, నాలుక పట్టుతో, ముక్కుత, చెవుల, కన్నుల, నాదాన్ని కపాల రంధ్రము ద్వారా ప్రాణవాయువు మృదుమ ధారంగా నాదా లాపనలను బయటకు పంపకం చేయువారు.

షుషుమ్మనాడి - అనగా ! హృదయం నుండి కుతిక, కంఠము, అంగిలి, కొండనాలుక వగైరాల పైగా మూడు వెంట్రుకల పొడైనక పాలరంధ్రం వరకు వ్యాపించియున్నట్టి నాడిని షుషువ్ననాడి అన్నది సుశ్రుత శరీర శాస్త్రము.

కేశం తరిత - కొండ నాలుక పైన వెంట్రుకలు పొదైన

శీర్షిక పాలే - మాడును చీల్చి విభజించి - (కపాళము)

వ్యపోహ్య - రంధ్రము ద్వారా నాదమును బైటకు పంపకం జేయు ఆడ, మగ గాయకులు.

ఇంద్ర యోని ః - స్వజాతి సమూహములో ముఖ్యులగుదురు.

అప్నోతి స్వరాజ్యం- జాతిపై సర్వాధి కారాలు పొందుదురు.

అప్నోతిమన సస్పతిం- అందరీ మనస్సులకు, వాక్కులకు, విజ్ఞాన కోరికల పరిశ్రమల కదిపతులగుదురు.

అని పై శ్లోకాలకు ఆంధ్ర వాచస్పత్యంలో అర్థమున్నది. (తైతైరీ యోపనిషత్తు) (పేజీలు - 53 -55 -6)

ప్రస్తుతం బుర్రకథ గాయకులీ అంశములను ప్రధానంగా ! గుర్తించాలి అని నా అనుభవముతో చెప్పుచున్నాను.

నాదో్బ్రహ్మ - అనగా నాద ప్రదానమైన రసభావ ప్రధాన మైన గానం బుర్రకథ ప్రాణం అని ఎంచాలి.

''నాదో రసజ్ఞ - సార్జ్ఞ బద్దనే ! నాగురాయతె''

అనగా 'నరుల' లోని 'లేడి' లాంటి మనస్సులను పట్టి బందించుటకు 'వల' వలే వుపకరించునదే 'గానము'.

''యాదాల గతి హృత్కుణ్ణె కపాళ మధి మణ్ణితం''

అనగా నరులలోని, గాయకుల్లోని, ప్రాణ వాయువూ, జీవనాదాన్ని నాభీ స్థానం నుండి హృదయ నాళముల నుండి, రొమ్ము వూపిరితిత్తుల పట్టుతో కుతికా కంఠం నాలుకా, దంతాల, దైడల సహకారంతో, ముక్కుల, చెవుల, కన్నుల, కపాళ నాడీ నాదంతో సహ మగ తుమ్మెద వలే ప్రారంచి, అనగా కంఠాన్ని విప్పి నిండుగా నాదాన్ని పూరించి గంభీరం గా ప్రారంభించే ఆడు తుమ్మెద వలే, అనగా కొండ నాలుక పట్టుతో కృత్రిమంగా సున్నిత సునాదాన్ని కపాళ రంధ్రం ద్వారా విడుదల చేసిన గాయకులు తరింతురు మరియూ అట్టి నాదాన్ని విన్న జీవులన్నింటి ద్వారా ఆకర్షింపబడుదురు. వాటిని తరింప జేతురు.

''శిశుర్వేత్తి, పశుర్వేత్తి వేత్తి గాన రసంఫణి''

అనే ఈ సూక్తి ఈ గానానికి సంబంధించినదే. బ్రహ్మనాద ప్రధానమైన తార నుండి, ముక్కుల నుండి, చెవుల నుండీ, వాగాంగముల నుండి ఏకీకృతముగా వినిపించు ఈ గాయకులకు శ్రోతలకూ విన్న జీవిలకూ 'శ్రవణ పర్వము, నేత్ర ప్రకాశము, ధాతు పుష్టి, నాడీ మండల శుద్ధీ, ఆకలీ, జీర్ణశక్తి, సంపూర్ణ ఆరోగ్యం'' కలుగుననీ హఠ యోగ దీపకలో వున్నది.

ఇట్లా రసభావ - సాయలను, ఆలాపన పూరించుట యక్షగాన బుర్రకథ గాన లక్షణం - ఇది నా అనుభవం.

'' ఋుగ్ యజు స్సామ వేద బ్యోవేదాచా అధర్వణ త్ర్క్రమాత్
వాద్యం చభినయం గీతం రసాన్ సంజ్రు హ్య పద్మ భూ ''

నాలుడు వేధాలకు వాయిద్యం, అబినయం గీతములను రసములను అందించిన దీ గానం. (అభినయ దర్పణ పేజీ - 5)

సంగ్రుహ్య - సామాజిక పరిశ్రమలను, వాటి ఫలితాలను అవసరాలను వివరించునదీ గానం. అట్టి దైన ఈ గానంను ఈ క్రింది విధంగా వివరించవచ్చు.

1. గానం ప్రకృతీ, నేటి కర్ణాటక సంగీతం వికృతి.
2. గానానికి సృతి స్థానం మద్యమ షడ్యమం.
3. గానానికి స్థాయిలూ మందరం, మద్యమం, తార అనే మూడు, కర్ణాటక సంగీతానికి స్థాయిలి మందరం, మద్యమం రెండూ, తార లేదు.
4. గానం , నాదం, భావం ప్రధాన మైనది గానం.
   కర్ణాటక సంగీతం : స్వర అక్షర ప్రధాన మైన పదగీతం మాత్రమే సంగీతం.
5. విషయాన్ని తెలిపే అక్షర మాలికలు లేక పోయినా తెలుసు కోవీలైన లక్షణం గానానికి ఉన్నది. ఈ లక్షణ లక్ష్యాల చదివిన నేను గానం ప్రకృతి అనీ, కర్నాట సంగీతం వికృతనీ భావిస్తున్నాను. ఈ లక్షణ లక్ష్యాలన్ని ఒక్క యక్షగానానికి మాత్రమే ఉన్నవని నేను నమ్ముచున్నాను.

బుర్రకథ గానం చేయుటలో నేనీ శాస్త్రాల నిర్వచనాలను కొంతవరకు పాటించినంత మాత్రామునే ప్రజలు సన్నెంతగానో ఆదరించారని బుర్రకథ గాయకులు గుర్తించాలని భావిస్తున్నాను.

ఈ ధర్మాన్ని పాటించి నాటి యక్షులు ఐదు జాతులు అక్షర మాలికలేగాక, జక్కుల రేకులు, అష్టకములు, దవళములు, శోభనములు, సుద్దులు, ఏలలు, జోలలు మొ॥ నవి బోధించారని 'లక్షణ దీపిక' లో ఉన్నది.

జక్కుల రేకులు : జక్కులు అనగా యక్షః విద్యలెరింగిన వారు. రేకులు అనగా దళములు, లయ, గ్రాహి వగైరా ఐదు దళములనే రేకులు.

జాతి వ్యవసాయ పనులకు సంబంధించిన అక్షర మాలికలే **'వృత్తాలు'** కాని **'యమా తా రా జ భా న స ల గం'** అనే ఈ చంధస్సు గారిడీలు ఈనిజ వృత్తాల నిజాన్ని మభ్య బెట్టినవని నాభావన.

ఒకటి వరేకు : (సంవర్తిక) మేఘాలు వర్షించే సూచనలు -
ఉత్తరా నురిమితెకురుచున్ - భళి భళి
తూరుపున వరద గుడివేసె - భళి భళి
తుంగ మూస్తె తడడవదెవ్వడు - బళి భళి
ఒటికుండలా వరుడు పలుక - భళి భళి
వచ్చితీరును వాన వరద - బళి భళి

రెండువ రేకు : ఎరువు కుప్పలు చిమ్మాలని సూచనలు -
గొడ్డె పెంటోక్కుడు - గోవుపెంటోరేక్కు - తంధాన
గంపె డెరువునకు - గరిసెడేధాన్యం - తంధాన

మూడవరేకు : ఏపైరు ఏ తరుణంల్లో వేయాలి, చేలుమళ్ళపాటు చేయు సూచనలు -
అదునెరిగి సేద్యం - తంధాన
పదునెరిగి పైరు - తంధాన
జొన్న కేడుమార్లు - తంధాన
తోలాలి గుంటక - తంధాన

**అష్టకవములు** - అష్ట - అనగా ఎనిమిది, క - అనగా 'వర్ణములు' (ఆం॥ వా॥)

**ఒకటో వర్ణం** - భూపతన కలియుగారంభంలో అంతకు ముందుమంచి 'బరిశె' 'విల్లు' వాయిద్యాల డొలుపులు రూపొందిస్తు వస్తున్న కొయ్యల కర్రల, పనిమంతులు, వాటి నమూనాలతో మళ్ళు, పంట పొలాలు దున్ని, పాటు జేయునట్టి పనిముట్లు వివరణ వివరించే మాలిక.

నాగలి మొద్దూ నాణెంగ - చెక్కెన్ - తంధాన తానే తంధాన
గొర్రు గుంట కల గుజ్జలు - నాటెన్ - తంధాన తానే తంధాన
కాడిమేడి జడ్డిగాలను - దెక్కెన్ - తంధాన తానే తంధాన
సర్ది తాగి సాగించిరి - కొల్మిన్ - తంధాన తానే తంధాన
నాగేటి శర్రులు నాణెంగ - చేసెన్. - తంధాన తానే తంధాన
గొర్రు గుంటకలు పల్లులు - చేసెన్ - తంధాన తానే తంధాన
ధిమిత ధిమిత ధిమితా - తా - తంధాన తానే తంధాన
ధిమిత ధిమిత ధమితా - తా - తంధాన తానే తంధాన

**రెండో వర్ణం** -

దున్నల చర్మాలొలిచిరా - సై
వారెన్ పట్టెడ లల్లిరా - సై
యారకట్ట నందించిరా - సై
కాళ్ళకు అతకల కుట్టిరా - సై
తతక్క ధోం....
భూమిని పతనం జేయంగ - మోకులు పగ్గాల్ దెచ్చారా
భళానంటి భాయ్ తమ్ముడా - బాయి భళానోయ్ దాదానా

**మూడో వర్ణం** -

కుండజేసె నోడు - తంధానా
మూకుడూ చేయడ - తంధానా
గోళెలలు రిశలు - తంధానా
పెద్ద బానలు చట్లు - తంధానా

అరివేణి కెల్లినా - యమ్మలా జూచీ - తంధానా తానె తందానా
కుమ్మురుమ్మ త్రొక్కి -గుంటలో దూకెన్ - తంధానా తానె తందానా
కుమ్మరాములో - కుండమ్మా
కుండ గిండమనాకింత వండమ్మా ॥

**నాల్గోవర్ణం -**

మగ్గమూ గుంటలో కోడినీ గోసి - తంధానా తానె తందానా
దానెకూ మ్రొక్కిరీ యా పనివారు - తంధానా తానెతందానా
నాడెకూ మ్రొక్కిర యానేత గాళ్లు. - తంధానా తానె తందానా
చీరెలు నేశారు రుమాళ్లు నేసి - తంధానా తానె తందానా
సారెలు కోశారు సరసంగ వారు - తంధానా తానె తందానా
మగ్గాలు లేనూరు మైమీద లేదు - తంధానా తానె తందానా

**ఐదవ వర్ణం -**

సరిదబ్బ నల్లిరీ - తంధానా
చాటలు గంపలు - తంధానా
ఈనెదీ సల్లిరి - తంధానా
ఇశన కుర్రాలూను - తంధానా
పత్తి బుర్ర లూను - తంధానా
జడ్డి గాల గాల్చి - తంధానా
ముల్లుగర్ర లూను - తంధానా
ఎదురు గంపల్లు బుట్ల - తంధానా

**ఆరవ వర్ణం -**

మావూరి చెర్వుకూ - రేవులెన్నెన్ని - తంధానా తానె తందా నా
చెలమలలారే వొకటి - చాకిరే వకటి - తంధానా తానె తందానా
ఉతికావ చాకలీ - ఉల్లి పూవటుల - తంధానా తానె తందానా
మాయన్న వేసినా - దట్టి పేరేమి - తంధానా తానె తందానా

ఏడవ వర్ణం -

మూడు రేవులు బెట్టి గొర్కెనూ - సై
మూకుడంతా చిప్పెరుంచెనూ - సై
జైర గడ్డమే చేసెనూ - సై
పిల్లి గడ్డమే గీసెనూ - సై
కాళ్ళు గోళ్ళనే దీసెనూ - సై
కాళ్ళ ముళ్ళు తా దీసెనూ - సై
మాదున్న పోత్ కాలుకుంటెనూ - సై

ఎనిమిదో వర్ణం -

పాత పనిమంతులు, అనుభవ కాలజ్ఞానులు, సరి కొత్త వూహలతో భూమి పై విప్లవించి పోళ్ళు గొట్టి, బీళ్ళు కట్టారు. ప్రాజెక్టులకు ప్రాతిపదికలు వేశారు. దీనిని వివరించే వర్ణం.

ఏరుముందు యేర్వాక - వచ్చెన్
ఏరువాక సాగిందా - యూరున్
గరిశల నిండా గంటెల్ - పండెన్
గరువులు దీరగ కందుల్ - పండెన్
కొర్రలారిగలు కొల్లగ - పండెన్
కూరగాయగోంగూరలు - పండెన్
ప్రత్తి పండె భాగ్యాలే - నిండన్
'మాగిలి' పండెను మూలలు - నిండన్
పండిన చేలకు పయనమై వెళ్లి
కోశారు కోతలు పదును కొడవళ్ల
పనలు పంజీ పంట కల్లాన వేసి
కంకులూ గంపలా కల్లాన బోసి

ఒలియె వలియో - ఒలియ - రా

వేలుగల వాడా - రార పొలిగాడ

ఎద్దులు త్రొక్కంగ - ఎదిగే నెరాసి

పెయ్యలు త్రొక్కంగ - పెరిగనే రాసి

కోరి పనివారికీ - కొలవండ్రి 'మేర'

కుంపించి కొలవాలి - కుంచాల మేర.

భూసాగుచేసి కూళ్ళు, కూరలు పండించుటకే ''భూస్పృశ్యా' లైన రైతులకు ప్రొద్దు చాలటం లేదు. మరీ రైతుజనాభాకు జీవితావసరాలతీర్చే వృత్తిదారుల జీవితావసరాలు సమకూర్చుకొనుటకై యేర్పాటు చేసుకున్నదే - ''మేర''. దీనిని రాజ సన్మానమని గౌరవపు పేరూ ఉన్నది.

నీమునుమునే కోస్త - తంధానా

నా మేర నీకిస్త - తరధానా

ఇలా ప్రేమికులాలపించిన జనపదం కూడా 'మేర'ను బలపరుస్తున్నది. ''మేర'' లివ్వట మనేది పనివాళ్ళను రైతులు ఘనంగా సత్కరించుట. తెలుగు జాతి గ్రామీణ జీవిత 'నీతి' నిభంధనలు నిన్న మొన్నటి వరకు రైతులు పంటకల్లాలలోనే ''మేరలు'' కొలవటం, ధాన్యం వారి బండ్లపైనే తోలు కొచ్చి పనివాళ్ళ పంచల్లో వేయటం వున్నది. దీనిని బలపరిచే మాలిక.

మెటుట్ట పై ధాన్యాదులున్నా - భళి భళి

కొష్టాలు గొడ్ల మేతున్నా - భళి భళి

ఉప్పుతో తొమ్మిదింటున్నా - భళి భళి

'జడివాన' కేశ సమానమ్ - భళి భళి

మృగనరులకు, వానరులకు, పరశురామ, బలరామ, శ్రీరాములకు తిండి దిగులు తీర్చే'' అష్టవర్ణాల'' ''అష్టవృత్తుల'' నేర్పరచి గ్రామ్యస్థిరజీవితాన్ని తీర్చి దిద్దు కుంటున్నది ఆదిమసమాజం. అజ్ఞాన దశదాటి సమాజములో విజ్ఞానం వికసిస్తున్నది.

**ధవళములు** - అనగా వర్ణః (వర్ణములు) అనగా ప్రకృతి ప్రసాదాలు తిన్న జనం కూళ్ళు, కూరలు, నిట్రాట ఇండ్లు, 'సత్‌సంగమం' స్నానం, శుచీ, శుభ్రతలు అలంకరణలు, సంతానము, తెలుగుజాతి కట్టుబాట్లు, గురుకులాలు అని (సం॥ ధ॥ ని॥ ఉన్నది.) అష్టభోగాలు, అష్టైశ్వర్యాలు ఇవే ధవళములు. ఈ కాలంలోనే అష్టకాలకు శ్రీకారం చుట్టారు తెలుగు ప్రజలనుకుంటున్నాను.

<u>కూళ్ళు - కూరలు-</u>

- సజ్జబువ్వ గోంగూర లింగతాత
- మింగలేక సచ్చాడ లింగతాత
- పచ్చ జొన్నకూడు తందానా
- పెయ్యాల పెరుగు తందానా
- ముద్దకందిపప్పు తందానా
- పెసల పులగంబువ్వ తందానా
- శాగె పులవచారు తందానా
- కాచినావూ నెయ్యి తందానా

గోంగూర నాసుకంపు - భళి భళి
రొయ్య పీసులేసి వండు - భళి భళి
వరికూడు వార్చాను - భళి భళి
వంకాయ వండాను - భళి భళి
బెండకాయ ముదర్రాదు - భళి భళి
బెమ్మచారి ముదర్రాదు - భళి భళి
చిక్కుడు పాదులో - తంధానా
సిగ్గుదీయా వద్దు - తంధానా
బీరతీగెల్లోన - తంధానా
తీరెలాగ వద్దు - తంధానా
॥ గుత్తి వంకాయ్ కూరోయ్ మామా
కోరివండీ నానోయ్ మామా ॥

ఇళ్ళు - వాకిళ్ళు :ఇప్పటి వరకు గుహల్లోను, మంచెలపై నున్న జనం - ఇళ్ళు, వాకిళ్ళు కట్టుకోవాలని వివరించుట -

ఈత చెట్టు ఇల్లుగాదూ - భళీ
తాటిచెట్టు తల్లిగాదూ - భళీ
యోటి వడ్డున ఇల్లుగడదాం పదరా !
ఐదంకణా నిల్లంటివీ - సై
నడివీధి ప్రక్కనిల్లంటివీ - సై
బజారు ప్రక్క భావంటివీ - సై
ఇంటి ముంది నాపరోలంటివీ - సై
చేతచేవా రోకలింటివీ - సై

మొగుడు - పెళ్ళం - నరమ్మ కోతయ్యల బిడ్డలు, ఆ బిడ్డల బిడ్డలు, ఒకే ఆడదీ, ఒకే మగవాడు, ఒకే ఇంట్లో కలసి జీవించే కలియుగ కుటుంబ నడవడి ప్రారంభ దశను వివరించుట -

(శిశు పోషణకై స్త్రీ పురుషుల మధ్య యేర్పడినదే మొట్ట మొదటి శ్రమ విభజన - మార్క్స్, ఎంగెల్స్).

వస్తాను నీతొ వుంటానూ - భళి భళి
కొట్టకుండా తిట్టకుండా - భళి భళి
పెట్టుకుంటవ నన్ను మావా - భళి భళి

యెవ్వరితొ మాటాడకుంటె - భళి భళి
యెకెశక్కొమూలాడ కుంటె - భళి భళి
యేమన్న చెప్పి నట్లింటె - భళి భళి
మువ్వాకు చీరనే తెత్తా - భళి భళి
మొగిలి రేకు రైక దెత్తా - భళి భళి
ఉల్లి పిల్లేళ్లూ బెడతా - భళి భళి

గచ్చొ గజ్జలు నే గడతా - భళి భళి
నాతొ కలి సుంటావ పిల్లా - భళి భళి
నన్ను పెళ్ళాడుతవ పిల్లా - భళి భళి

ఆలి మంచి దాని అనవద్దు కొడుకా - తంధాన తాన తందాన
అది వచ్చి మన ఇంట అణిగున్న దాకా- తంధాన తాన తందాన
ఆలి మీదా ఆలి - అల్లర్ల పాలు - తంధాన తాన తందాన
వూరి ముందు పంట కాకుల్ల పాలు - తంధాన తాన తందాన
కొడుకుల గనమ్మ - తంధానా
కొదువేమి గలదు - తంధానా
ముందు బుట్టిన కొడుకు - తంధానా
ముందురు నేసిన పైరు - తంధానా

<u>ఆరోగ్యము - పరిశుభ్రత :</u> స్నానం, శుచీ, శుభ్రతలు - అనగా పశు, పక్షి, మృగ జీవులకు ముక్కులు, మూతులు, ముడ్లు ఎవరు కడుగుతున్నారు ? అనే జనం నేటికీ దేశంలో వున్నారు. కలియుగ భూపతన పరిశ్రమ దశలో శ్రమ జీవులకు శుచీ, శుభ్రత, ఆరోగ్యవసరాలను ఎరుకపరచిన మాలిక -

మా బావ గడ్డమ్ము - బైరి గడ్డమ్మా - తంధాన తాన తందాన
ఇది లిచ్చి దులిపితే - ఈపి పేలుండె - తంధాన తాన తందాన
మూడూళ్ళ మంగళ్ళు - మునువెట్టి గొరగ- తంధాన తాన తందాన
దూడల సిగమార్లు - దుక్కి మొకాయె - తంధాన తాన తందాన
పొంత కాగిన నీలు - పోసుకోమనగా - తంధాన తాన తందాన
వద్దువద్దని మురికి - గుంటలో మునగా- తంధాన తాన తందాన
పలుగర్ర ఇచ్చాము -నీళ్ళ బావిచ్చాము - తంధాన తాన తందాన
అద్దాలు, దువ్వెనా - లందింపతలనూనె - తంధాన తాన తందాన
చింపిరి జుట్టూల - సిగలెగా గట్టారు - తంధాన తాన తందాన
యేతల్లి కడిగిందీ - సాయ పసుపూ - తంధాన తాన తందాన

నీలాటి రేవంత నిగ్గుదేలిరిద - తంధాన తాన తందాన

కొట్టు పసుపు కుమ్మాళ్ళ- తల్లి కడిగిరింది - తంధాన తాన తందాన

ఆమె కడిగిన పసుపు - ఆవపూసాయె- తంధాన తాన తందాన

**అలంకరణలు** - ఎట్లా పుట్టారొ, అట్లానే తిరుగాడిన జనం, సిగ్గెరిగి ఆకులతొ, నారచీరెలతొ, చర్మాలతొ శీలాన్ని దాచుకొనుచు వచ్చిన జనం, కలియుగారంభ దశలో ప్రత్తిని పింజి, యేకీ, సన్న నూలు దీసి, వస్త్రాలు నేసి, వస్త్ర భూషణాది అలంకారాలను చేసుకుంటున్నారు. ఆదశలో పాడిన మాలిక

చుట్టూ చెంగాయ్ చీరెగట్టి - భళి భళి
చుట్టు గోటూ రైక తొడిగి - భళి భళి
బుర్ర నున్నగ దువ్వు కోని - భళి భళి
బొట్టు కాటుక బెట్టుకోని - భళి భళి
కాళ్ళకే కడియాలు బెట్టి - భళి భళి
వేళ్ళకూ మెట్టాలు బెట్టి - భళి భళి
ముంతంతా కొప్పుపైన - భళి భళి
మూడు తంగెడ పూలుంచి - భళి భళి
నీరు కాయ పంచగట్టి - భళి భళి
కిర్రుచెప్పులు తొడుక్కోని - భళి భళి
కోపు తలగుడ్డాను జుట్టి - భళి భళి
కోరమీసం కొసల్ త్రిప్పి - భళి భళి
చంకనాములుగర్ర బెట్టి - భళి భళి
చంద్రకోల్ భుజాన వేసి - భళి భళి

<u>సంతానం- సౌభాగ్యం</u> : భూపతన కలియుగారంభదశలో సంతానమే సిరి సంపదని, పనిమంతులే జాతిసౌభాగ్యమని భావించారు. మేతవాములు, మండె కుచ్చెళ్ళు వేసిన, ఎదగొర్రు కొండ్రవేసిన, తాళ్ళూ మోకులు పేనిన, సిగమొర్లిన పిలిచి పిల్ల నిచ్చారు నాటి పెద్దలు. (ఈ నాడు సోమరి,

సుఖభోగిగ, బానిసత్వం పురుష లక్షణంగ, భార్యాబిడ్డలిద్దరిని పోషించు టే తెలివి తేటలుగా కోరుకుంటున్నారు నేటి పెద్దలు.)

వినరా తెలుగు - వీర కుమారా
విజయము మనదేరా - నాయన
బిడ్డలగన్నా - బిచ్చమెత్తినా
చెడిపోదేమమ్మా - అమ్మా
కడిపెడు బిడ్డల గన్న తల్లియని
గౌరవింతు రమ్మా - అమ్మా
పనివాళ్ళ కడుపున - తంధాన
తినేవాళ్ల పుట్టరు - తంధాన
ఆయమ్మ బిడ్డలు- తంధాన
అడవి రారాజులు- తంధాన
ఏపనిలొ నిల్చిన - తంధాన
ఎదురు లేనోళ్ళు - తంధాన

ఆదివారం నాడు - తంధాన
అమ్మనన్ను బుట్టె - తంధాన
సోవవారం నాడు - తంధాన
చురుకు గానడిచె - తంధాన
మంగళ వారం నాడు- తంధాన
మాటాడ నేరిచె - తంధాన

కట్టెల కెల్లర కొడుకా . భళి భళి
కడుపులొ నొప్పికదమ్మా - భళి భళి
పనిముద్దా భాగ్యం ముద్దనిరి- భళి భళి
వల్లు వంచి పని చెయ్యర బిడ్డా- భళి భళి

ఇంట బుట్టినా ఎద్దులా - సై
మక్కువతో పని చెయ్యరా - సై
పని చెయ్యని నాబట్టకి - సై
యేరోజు బువ్వేట వస్తదీ - సై
పరపతి పోయి నోడూరికి దొంగా
పని చేయని వాడాలికి దొంగా

గొప్పతనాలు - తెలుగు జాతి గొప్పలు, కట్టుబాట్లు , పౌరుషాలు చాటే మాలిక
ఆవులు గలవారి - ఆడపడుచూను తందాన తాన తందాన
కోడెలు గలవారి - కోడల్ని నేను ॥
ముంగలరకదున్ను - మొగవాడు నామగడు ॥

పౌరుషాలు - ఎగదిగానా వంక చూచేవ్ - భళి భళి
ఎకశక్కా లాడబోతవ్ ॥
వెన్నులో నా 'బరిశ' అలుగు ॥
ముంగిటంబు ముల్కి నాటును ॥

అన్నల్ని పాడేవు - తముల్ని పొగిడావు - తందాన తాన తందాన
నన్నేల పాడవే - నామామ కూతర ॥
ఎగ్గు సిగ్గూలేని - మేనత్త కొడుకా ॥
యేమని పాడేను - ఇందరిలోనిను ॥
పెళ్ళాన్ని పజకిచ్చి - బతికి వున్నావు. ॥

కట్టుబాట్లు- పొంతలో నీలన్ని పోసుకోకమ్మి - తందాన తాన తందాన
తోడేస్తి ఆపాలు తాగమాకమ్మి ॥
వీధిలో తలదువ్వి ముడి జుట్టకమ్మి ॥
నలుగుర్లో పెద్దగ నవ్వతగదమ్మి ॥

| | | |
|---|---|---|
| పోక పొరుగింటికే వెళ్లె | - | భళి భళి |
| రాః మాటొస్తదోలమ్మి | - | భళి భళి |
| ఆడి తప్పిన వాని | - | తంధాన |
| ఆలి నేలని వాని | - | తంధాన |
| ఆదరించిన హోని | - | తంధాన |

<u>శోభనములు</u>- అనగా భూసాగుదారులు కలియుగారంభంలో సొమ్ములు, సోకులు, ఆడ,మగ చీరెలు సింగారాలు గూర్చి పాడిన మాలిక -

| | | |
|---|---|---|
| తకిట తకధిమి | - | తకిట తకధిమి |
| కాళ్ళకు కడియల్ | - | మెట్టెల |
| మెళ్ళో కంచిత్తడి | - | సొమ్ముల |
| ముక్కున కులికేటి | - | ముంగెర |
| కొప్పులో తంగేడు | - | పూవులు |
| బొట్టు కాటుక కళ్ళు చూడు | - | భళి భళి |
| ॥ తా ॥ తకిట తక నా మొగుడా | - | భళి భళి |
| నే మునుపటి వలె నున్నానా | - | భళి భళి |
| ముచ్చట ముడి ముందు కొమ్ములు | - | భళి భళి |
| పాల చెంగాయ్ - పంచెగట్టీ | - | భళి భళి |
| కోపుతలపా గంచు లమర | - | భళి భళి |
| పాయల మొల్‌తాడు మెరయ | - | భళి భళి |
| కిఱ్ఱు చెప్పుల మొద్దప్పయ్య | - | భళి భళి |
| మనువాడో లమ్మినే చిట్టమ్మి | - | భళి భళి |

**సుద్దులు** - అనగా తెలుగు జాతి నడపడులు, అత్తల, ఆడబిడ్డల, ఆరళ్ళు. అరుపులు, నాటి నుండి నేటికి జరుగుచున్న సాంఘీక నడవళ్ళు, సంసారాలుతెలిపే మాలిక .

వానలేదే ఇంట వరదేమిటమ్మా తందాన తానే తందాన ఏలలు -
నువుబోయి పొరిగింట పండాప బిడ్డా తందాన తానే తందాన
నీ భార్య కనీళ్ళు కాల్వలై సాగె తందాన తానే తందాన
ఆడోళ్ళ శోకాలు అటువంటి వయ్యా తందాన తానే తందాన
మెళ్ళో పగడాల్ దండ ముద్దుగుమ్మా తందాన తానే తందాన

బంగారు బొమ్మా - ఆగు
మెళ్లో పగడాల్ దండా - ఊసెందుకు
నావళ్ళంతా క్రిందాపైనా - సూపెందుకు
చూడక ఆడేరు - చూచి ఆడేరు
కానక ఆడేరు - కల్లలీ జనము
పాటలు పాడితే - పలవదంటారు
పాడకనే యున్న - పెంకి దంటారు
కోడలా కోడలా - కొడుకు పెళ్ళాము
పచ్చి పాలపైన - మీగడేదమ్మా
అత్తపోరు - ఆడబిడ్డల్ల పోరు
ఆరళ్ళు లేనింట - హాయి గుంటాది.

నట్టనడి మంచాన - తంధాన
కూకున్న మామామ - తంధాన
కట్లపీట మీద - తంధాన
కూకున్న మా అత్త - తంధాన
మాయన్నలొచ్చారు - తంధాన
మమ్మంపుతారా - తంధాన
మేమెరుగ మేమెరుగ - తంధాన
మీ బావ నడుగు - తంధాన
రచ్చచావిట్లోన - తంధాన

రాజేంద్ర భోగి - తంధాన
మాయన్న లొచ్చారు - తంధాన
మమ్మంపుతారా - తంధాన
మే మెరుగమే మెరుగ - తంధాన
మీ యక్క నడుగు - తంధాన
వండి వడించుమా - తంధాన
అక్క పెద్దక్కా - తంధాన
మాయన్న లొచ్చారు - తంధాన
మమ్మంపుతారా - తంధాన
నే నెరుగ నే నెరుగ - తంధాన
నీ భరత నడుగుమి - తంధాన
కోటేరు వేసేటి - తంధాన
మేటి ఓ రైతా - తంధాన
మా యన్నలొచ్చారు - తంధాన
మమంపు తారా - తంధాన
పెట్టుకో సొమ్ములు - తంధాన
కట్టుకో చీరా - తంధాన
ఎత్తుకో బిడ్డను - తంధాన
ఎక్కెడ్ల బండిపై - తంధాన
పోయి రాసుకముగ - తంధాన
పుట్టినింటికినీ - తంధాన

యాలపొద్దు మీరిపోయె - భళి భళి
బువ్వగంప రాకపోయె భళి భళి
కపిలదోలె కుర్రవాడీ భళి భళి
కాలుచేతులు కదలకుండె భళి భళి

అనగా కలియుగారంభంలో గృహస్థాశ్రమ ధర్మాలు, ఆలుమగల కోడిగాలు, వావి వరుసలు, ప్రేమలు పెళ్ళిళ్ళు గూర్చి పాడిన మాలిక.

ఎగవసేలో గడ్డిగోసే
దిగవ సేలో మోపుగట్టీ
మోపు ఎత్తా రమ్మీ యంటినే
ఓలమ్మీ చూడే !
చీర జారా చెంగు లాగాడే

సూరేడంటి ముద్దుల బావను
చూసే దెన్నటికో - లమ్మీ
వూరి ముందూ ప్రత్తి పూసె
కోసె దెన్నటికో - లమ్మీ

నల్లనల్లాటి దాన - నడుమూసన్నాని దాన
నిన్ను జూచి మనసు- నిల్వాకున్నదే - ఓ చిన్నదానా
పెళ్ళి పెళ్ళున్నాడు - తంధాన
పెంచాడు గడ్డాన్ని - తంధాన
పెరిగిన గడ్డాన - తంధాన
పేలీపి పెట్టెన్ - తంధాన
బావల్లు వచ్చారు - తంధాన
ఏమి కూరల్లు - తంధాన
పాదుల్లో తొండల్లు - తంధాన
గోడబల్లూలు - తంధాన
ముత్యాల పలు వరస
ముద్దుల మేనత్త కొడుకా
॥ తానె తందన్న తానా ॥

ఊరు ముందూ వులవ జల్లూ - భళి భళి

ఉలవ కోతకు నన్నె బిలువ్వూ భళి భళి

చంకలో ముల్లు కర్రవాడా భళి భళి

ముంగలరక దున్ను తావా భళి భళి

చాలు దప్పక దున్ను తావా భళి భళి

మాట దప్పక మనుం ఆడ్తా భళి భళి

చక్కని గుంటా - రాయెనాయంటా

సరసాకూకుంట - పెళ్లి జేసుకుంటా

ఆట పాటలు -

''చల్ చెడ్ గుడ్ గుడ్ గుడ్ గుడ్ గుడ్ ''

''చింతాకు చిగురాకు పన్నెండు కొమ్మల పైరాకు''

''చిక్కన చిక్ చిక్ బాయ్ చిక్'' మొదలగు పూత పదాలులో

ఏదో ఒకటి , గుక్క త్రిప్పకుండా అంటూ ఆడాలి.

గేయ నాటికలు - యువకులంతా వీధుల కూడలిలో గుమి గూడి.

ఒకడు - ''ఆలింకాలింకోయ్''

అందరు - ''చంద్రబాలింకోయ్''

ఒకడు - ''చెట్టు పాపాయోయ్''

అందరు - ''శామల పాపాయోయ్''

ఒకడు - ''మాను నరికిందె వరోయ్''

అందరు - ''మందల మాదన్నోయ్''

ఒకడు - ''బీళ్ళు దున్ని దెవరోయ్''

అందరు - ''వీరుల వీరన్నోయ్''

ఒకడు - ''వాణ్ణాదిలి వీణ్ణాదిలి సోమల్ని కొట్టండోయ్''

అందరూ సోమన్న నెత్తిన పై పంచల ముసుగేసి గుద్దుతుంటే, వాడామంది నుండి బైటకు పరుగెత్తును ఈ ఆట పేరు **''గుద్దులాలిం కి''.**

<u>పిల్లలు నాటిక</u> - కుంటోడు, గూనోడు, తాత, గుమ్మడి కాయలుగా కొంత మంది పిల్లలు నిలువున బారు తీరి ఒకరి వెనుకగా మరొకరు కూర్చొని వుంటారు. కాయలు పంచే తాత వారి వెనుక, కావలి కాచే కుంటి వాడు ముందు, కూర్చుంటారు.

గూనివాడు - (మూరెడు పుల్ల నేల పై రాస్తు) రాదు రాదు బండీ, రాదెడ్ల బండీ అంటూ కుంటి వాడి ముందుకొస్తాడు.

కుంటి - ''ఏంటిరా ? గూనోడా వచ్చావ్''

గూని - ''తాతేడి ? తాతని పిలువ్''

కుంటి - ''తాతాటెనక పొదులు చేస్తున్నాడు.''

గూని - ''పిలువ్ పిలువ్''

కుంటి - ''తాతా ఓ తాతా గూనోడొచ్చాడు''

తాత - ''యేందిరా ? గూనోడ వచ్చావ్ ?''

గూని - ''మా తాత ఇంత కాదు, అంత కాదు, మబ్బంత గుమ్మడి కాయ ఇప్పించుకు రమ్మన్నాడు.''

తాత - ''మొన్ననే కదరా తీసుకెళ్ళావ్. కడవంత కాయ యేంచేశాడురా ?''

గూని - ''అదా ! ఆ కాయ మా తాత కాలు తగిలి మురిగి ముక్కలైంది తాతా.''

తాత - ''సరెసరె మంచిది చూచి పట్టుకెళ్ళు.''

గూని - ''అబ్బో ఇది లేత పిందే, ఛీఛీ ఇది ముదురు టెంకె ఆ....ఇదిమంచి పాకంలో వుంది. (అని కూర్చున్న పిల్లల తలలను వరుసగా వూపి వక పిల్లడిని లేపి) తాత మరి దేని మీదెళ్ళను.''

తాతా - '' ఏమిలేదు గాడిద మీదెళ్ళు''

గూని - ''అబ్బో వెనకెళితే తంతుందే. అయ్య బాబో''
ముందు కెళితే కరుస్తుందే (అంటూ వెళుతుంటే
అంతా నవ్వులు)

ఏలల్లో - అమ్మాయిల - ఆట పాటలు గేయ నాటికలు -

గొబ్బిళ్ళు - గొబ్బియ్యలో గొబ్బియని పాడరమ్మ
నిబ్బరంపు చెడెటి గొబ్బియ్యలో''

వ్యాయామం- ''చెమ్మచెక్క - చారెడేసి మొగ్గ
అట్లు బోయంగ - ఆరగించంగ
సుబ్బరాయుడి పెండ్లి - చూచివద్దాం రాండీ
మాయింటో పెండ్లి - మళ్లి వద్దాం రండి

చిప్పచిప్ప గోళ్ళు - చిన్నత్త చాళ్ళు
గిన్నె గిర గిర - చెంబు చెర చెర
గుజ గుజ రైకలు - ఓ యత్తా
గుజ్జా రైకలు - ఓ యత్తా
వానా వానా వలప్పా - వాకిలి తిరిగే తిమ్మప్పా
కోకోలంకా - కొడవటలంకా
లంకాదీసి - రాముడి పీటా
ముత్తె బియ్యం - ములగా చారు

కవ్వెర మువ్వెర కాల్ దీసి కడగా బెట్టు
వతొత్తి వారొత్తి - సూపుడు గళ్ళుకు సూరొత్తి
గప్ చుప్ సంబారు బుడ్డి
॥ కొంగలు కొంగలు గోళ్ళు
మా చేతుల నిండా పూలు ॥
గుడి గుడి గండం - గుండే రాగం
పాముని పట్నం - పడిగే రాగం

దొంగుడు మూతా - దండా కోర్
పిల్లి వస్తది - ఎలుకా భద్రం
ఎక్కడి దొంగలక్కడే గప్‌చుప్

ఇవిగాక యింకా పొడుపు కథలు, నీతి కథలు, అనగా కాకి నక్క, నక్కమాంసం కథల్లాంటి వెన్నో రష్యా తొసహా యెన్నో ఇతర దేశాల్లో నీతి కథలకు ప్రాతిపదికలయ్యాయి.

మన తెలుగు దేశాన వివిధ ప్రాంతీయ పేర్లతో చర్మ వాయిద్యాల కనుగుణంగా పిలువబడుతున్న 'భవనీ జ్ఞానులు' పంబల, పిచ్చి గుంట్ల ఝుంకుల, ఒగ్గులు, సుద్దులు, డమ్మర, ఢక్కల, దేశచెంచు, కృష్ణచెంచు, ఎరుకలచెంచు, కోయచెంచు, బుడబుడక చెంచు వగైరా నిషాదుల, పంచముల, అంటరాని, చెప్పరాని, చూడరాని వారుగా చూడబడుతున్న వీరే తెలుగు వారి అనాది, సాంప్రదాయ అనుభవ కాలజ్ఞానులు, గురువులు మూలికా వైద్యులు. నేటి గద్దె, సోది, జోస్యం చెప్పే సింగీ, గోసాయీలు, కాటి పాపలు, వగైరాలు అనాటి జ్ఞాపికలు. (మొట్ట మొదటి ఈ అనుభవ కాలజ్ఞానుల్లో పురుషులు, స్త్రీలు ఉండే వారనీ, ఈ గురువులు 'అనుభవ కాలజ్ఞానులే' కాని 'ఆధ్యాత్మిక కాల జ్ఞానులు కాదని జగత్కథ పేజీ 91 లో హెచ్ జి వెల్సు గారు వ్రాసిరి.)

పుట్టగనే నరమ్మ బిడ్డలు ఆకలి చేతనొ, చలి చేతనొ, మరే అవసర ప్రేరణ చేతనొ కాల్లు చేతులాడిస్తూ కెవ్వు కెవ్వున ఆట పాటలు మొదలెట్టి ఆ.తా.దా.పో అక్షరాలు పలికి చిలుక గోర్వంకల పలుకులు పలికించిందే **''గంధర్వగానం''**.

ఆ గంధర్వ గానం నుంచి పశు,పక్షి, మృగ, జంతు కంఠాల నాదాల ఆలకించీ, అనుసరించి, ఆలపించి వాటి నాహ్వానించి పెంచి భోంచేయుటకు ఉపకరించిందే **''మార్గగానం''**.

మార్గగానం నుంచి సింహశార్దూలాది మృగాల జయించు మార్గాల సుభోదకం గావించి, నరుల నరసింహాలుగా తీర్చి దిద్దినదే **''ఖడ్గగానం''**.

ఖడ్గగానం నుంచి భాషా పండితులనుగా అక్షర మాలికల్లో ద్విపద, త్రిపదలతో శ్రమ ప్రాతిపదికపై ఇతివృత్తాలాలపించిన భవనీకథలు కలిగిందే **''దేశిగానమాల''**.

దేశి గానమాల నుంచి భూపతన మార్గములను, అరసి విరచించు దేశి ప్రజలకు వివరించు నట్టి, పంట పొలాలందు, నవధాన్యాలు పండించు విధానాలు, కూళ్ళు , కూరగాయల గూర్చి ఆడిపాడినట్టిదే **''యక్షగానం''**.

బుఱ్ఱకథ



జముకుల కథ



ఒగ్గుకథ



సద్దులు



బవనికథ



పంబజోడు




ద్రమ్మరకథ


మాస్టిరు కథ


ఖడ్గగానం


డప్పునృత్యం

యక్షగాన స్వరూపాలే ఈ క్రింది తెల్పిన నేటి మన నిజమైన తెలుగు కళలు **1. బుర్ర కథ, 2. పంబల కథ, 3. డక్కలి కథ, 4. డ్రమ్మర కథ** (కర్రపై తీగల పై నడవడం), **5. మాష్టీరు కథ,** (వ్యాయామ కసరత్తుల కళారూపం) **6. జముకుల కథ. 7. ఒగ్గు కథ, 8. కిన్నెర కథ, 9. సుద్దలు** (యాదవుల ఇండ్ల కెళ్లి చేపుతారు) **10. పిచ్చిగుంటల కథ, 11. బవని కథ, 12 వీది భాగవతులు, 13. తోలు బోమ్మలాటలు.**

## ౨౦. బొమ్మ గీత - బ్రహ్మరాత

ఇప్పటి వరకు మీరు గంధర్వగానం, మార్గగానం, దేశిగానం, యక్షగానం మొ॥ నవి ఎలా ఉద్భవించాయె ఎలా ఉపయోగ పడ్డాయె తెలుసుకున్నారు. ఇపుడు అక్షర పుట్టుక దాని ఉపయోగం గూర్చి వివరిస్తాను.

చలి మంటలకడ ఆరిన బొగ్గులతో నేలపై పశు, పక్షి, మృగ బొమ్మలగీస్తు, రాస్తు వచ్చినట్టి కళాకారులు పెద్దపులి, చిరతగండు, ఎలుగబంటి ఏనుగు వగైరా ప్రమాద కారులైన మృగాల బొమ్మల వ్రాసి పలక రాళ్ళపైన, చర్మాలపైన బొమ్మలు గీసి, వాటి స్థావరాలకెదురుగా చెట్టకు కడుంతున్నారు. పెద్ద వూనులపై కొండబండలపై అంబువులుకులతొ చెక్కుతున్నారు. ఇదే బొమ్మరాతకు, లేక బొమ్మల లిపికి తొలిమెట్టు (మయ చిత్రలిపి అనేది (జగత్కథ॥ పేజీ 102 లో) ఈ బొమ్మరాత ప్రజలే వ్రాశారు. దాన్ని నాటి ప్రజలు పిలిచింది ''బొమ్మరాత''ని వైజ్ఞానికులు పిలిచింది 'బ్రహ్మీ' ''బ్రహ్మలిపి'' అని భావిస్తున్నాను. వీటిని చూచినప్పుడు రవివర్మలను దృష్టిలో వుంచుకోకూడదు.

ఇవీ వారి బొమ్మలరాతకు ఉదాహరణ

ఈ బొమ్మచ్చుల పలకలను చదవటం, అర్థం చేసుకోవటం, ఇతరులకు బోధపరచటం, ఇప్పటి మనకు చాలాకష్టం. బొమ్మచ్చుల జూచి విషయం తెలుసుకోవాలంటే జంతు, పశు, పక్షి జాతులు తిరుగాడు కీకారణ్యాలతొ, వనభూములతొ కొంత పరిచయం కావాలి. మృగాయా వినోదులమై యుండాలి. వేటరులై యుండాలి. జంతులోకంతో ప్రత్యక్ష సంభంధముండి తీరాలి.

బొమ్మగీత - బ్రహ్మరాత నమూన



మనిషి



పిట్ట



పులి



నెమలి



పంది



చిలుక



కుక్క



కోడి

బ్రహ్మ - అనగా ప్రకృతి జీవుల ఆకారాల అచ్చుల మాతృక.

అచ్చు - అనగా పోలిక, నకలు, సంజ్ఞ అనేవి అర్థము

ప్రకృతి ప్రత్యయము మరియు ప్రత్యయ ప్రకృతి అన్నారు. అనగా జీవశ్రేణుల యొక్క చేష్టల నటనల పోలికల ముద్రలే అచ్చులు.

లిపి అనగా వ్రాయూటా, గీయుటా . ఈ రాతల విజ్ఞానం ఎన్నో యేండ్లనాడు మనమే మన తెలుగు దేశంలోనే సృష్టించు కున్నామంటారు.( తి- రామచంద్ర- లిపి పుట్టు పూర్వోత్తరాలు) మనం తొలి బొమ్మచ్చులు గీసిన చెక్కిన నాటికి చాలా పూర్వమే బొమ్మరాతల లేఖలున్నవని, కొత్త శిలాయుగానికి పూర్వమే ఆరంభం జరిగిందని అజేరియను శిలల చిత్తరువులలొ ఉన్నదని, అవి ఎక్కువగా వేటలు, దండయాత్రలు గీయబడియున్నవని - (జగత్కథ 105 పేజీ లో ) ఉన్నది.

## 21. వాడుక వస్తువు - వ్రాతక్షరము

జనాలకు కొద్దిగా స్థిమితమేర్పడినది. ప్రమాదకర స్థలాలలో తిండికుపకరించు జీవరాశులు ఏప్రాంతాల్లో వున్నవో ఎరుక పరచు ఆయా బొమ్మచ్చులు చెక్కిన చర్మాలను, భూర్జపత్రాలను, చెట్ల పట్టలను అంబు ములుకులతో చెక్కి ఆపైన ఆకుపసరులు రుద్దారు. బొమ్మరాతలేర్పరచుకుంటున్నారు.

'వీర కథలను, గాథలను, ఇట్లానే వ్రాసుకుంటు, మాట్లాడే అక్షర పేర్లను వాక్యాలుగా వ్రాసే మార్గాలు లేనేలేవా' ? అనిమదన పడుతు, నీళ్ళు త్రాగుటకై యేటివద్దు కొచ్చినారు. సెలఏటి వారలో సన్నటి ఇసుక, వండ్రుమట్టీ కలగాపులగంగా పేరి, ఆరి, నునుపు తేరి, మసర కాగితం పరచినట్లున్నది. దానిపై నీళ్ళుత్రాగ వచ్చిన జీవ జంతు పశుపక్షుల కాళ్ళ అచ్చు ముద్రలను పరిశీలిస్తున్నారు కళాకారులు.

ఓదె కొంగల, యర్రగాటి కొంగల కాళ్ళ గోళ్ళముద్రలు, నక్క, కుక్క, తోడేలు వగైరాల కాళ్ళ గోళ్ళ ముద్రలు, అమ్మో ! ఇది పెద్దపులి, చిరుత, సింహం, శివంగుల గోళ్ళు ముడిచిన కాళ్ళ ముద్రలు ! అంటూ జనం కనిపెట్టి, 'జాగ్రత్తగా ఉండాలన్న మాట' అనే అవగాహన కొచ్చి, అవి నీళ్ళుత్రాగి ఎటువెళ్ళాయో పరిశీలిస్తు, వాళ్ళు నీళ్ళు త్రాగటం మరచి అవి వెళ్ళిన దారులు దేవులాడుతూ వెళ్ళారు.

వాడుకవస్తువులు - వ్రాతక్షరముల నమూనా



ఈ బొమ్మను చూచి మనిషి అని చదువుతున్నాము



ఈ నీళ్ల గోళెం అనే తొట్టి 'అ' అని గుర్తుంచుకోవాలి



ఈ 'విల్లు' అనే వేటాయుధం రేండో 'ఆ' అనుకోవాలి



ఈ తుంబుర్ర శృతివాద్యాన్ని 'ఈ' అనుకోవాలి



ఈ కొమ్ము బూర అనే వాద్యాన్ని 'ఎ' అనుకోవాలి



ఈ గంద్రగొడ్డలిని 'గ' అనుకోవాలి



ఈ పడిగ విప్పిన 'నాగుపామును 'క' అనుకోవాలి



ఈ శంఖువాద్యాన్ని 'త' అనుకోవాలి





ఈ నాగుసొరకాయని 'ర' అనుకోవాలి



ఈ పెట్టె సొరకాయని 'ద' అనుకోవాలి



ఈ వీరణం అనే వాద్యాన్ని 'య' అనుకోవాలి.

'బుద్ధునికి భోధి చెట్టువలె', సెలయేటి ఇసుకవంద్రు పేరి ఆరిన కాగితం లాంటి జంతుకాళ్ళ ముద్రలు కల ఇసుక పలకయే, వ్రాతాక్షరాల లిఖించు మార్గాన్ని సూచించిన తొలి అచ్చుయంత్రం.

చూడగానే వినగానే బుర్రలో పుట్టే ప్రతి ఊహకు, భావానికి బహిరంగ రూపాలైన, అక్షరాలు, వాక్యాలు, పలుకుతున్న జనానికి అక్షర రూపాలనగా, దా,కా,గా, వగైరా అక్షరాల గుర్తుకు, ఆకారాలను రూపొందించ లనే ఆలోచన చేస్తున్నారు. వీరికి పలక లేదు. గురువుగా నేలపలక సూచించిన వరవడిలోనే అక్షర లిపిని ప్రారంభించారు తొలి వ్రాతగాండ్రు.

భారత దేశ త్రవ్వకాల్లో రాతకుపకరించిన సంకేతాల బట్టి పెంపుడు పశు, పక్షి, మృగ, జీవుల ఆకారాల నుండి, నీళ్ళు త్రాగేవి, ఆహారాన్ని సృష్టించే నిత్యావసర వస్తువుల నుండే వ్రాతాక్షరాల ''లిపి''ని సృష్టించారు. ఏ వస్తువుతో ఏ అక్షరాన్ని సృష్టించుకున్నారో ప్రక్క పేజీలో చూడండి.

ఇక అక్షరాలకు తలకట్లు, దీర్ఘాలు, గుడులు, కొమ్ములు తరువాత అవసరాన్న నుసరించి ఏర్పరచుకుని ఉంటారు.

జనాలకు నిత్య సంబంధాలు లేని వస్తువులతో వ్రాతలు వ్రాస్తే వాటిని గుర్తించుటే జనాలకు కష్టమగును. అప్పుడా లిపిలేఖను చదవటం అందున్న విషయాలు బోధపరచు కోవటం, ఇతరులకు బోధించటం, అసాధ్యమగును. కనుక నాటి కళాకారులు ప్రజలందరకు నిత్య పరిచయమున్న వస్తువులనుండే వ్రాతక్షరాల లిపి రూపాలను స్వీకరించారని భావిస్తున్నాను.

ఎద్దుతలను తల్లక్రిందులు చేసిందే ఇంగ్లీషు అక్షరం 'ఎ' A

వారి ఈ గుడిశయే ఈజిప్టు వారి అక్షరం 'బి' B

ఈ మనిషి తలకాయే ఈ జిప్టు వారి అక్షరం 'పి' P

ఇట్లా ఈజిప్టు వారు చాలా వ్రాతక్షరాల లిపిని నిత్య పరిచయ వస్తువుల నుండే అక్షర ఆకారాలు సృష్టించుకున్నారని 'లిపి' పుట్టు పూర్వోత్తరాలు అనే గ్రంథంలో ఉంది. (పేజీ 74 లో ॥ తి ॥ రా ॥)

నేను ఉదహరించిన వాడుక వస్తువుల లిపుల నమూనాలు అన్నింటి ఆకారాలకు నప్పక పోవచ్చు, తేడాలుండవచ్చు. ఏదేమైనా ప్రపంచ ప్రజలందరు మనతోసహా తమతమ

వ్రాతక్షరాలను,( లిపులను) నిత్య జీవితంలో తమతమ ప్రజలందరికీ నిత్య సన్నిహిత సంబంధ వస్తువులనుండే సృష్టించుకున్నారు.

మనకీ అనుకరణ కొత్తది కాదు. పనిముట్లు, పనులు, వస్తువులు, ప్రకృతి జీవ జాతులనుండే అనుకరిస్తూ వచ్చాము. మన విజ్ఞాన ప్రజ్ఞాన సంపదలకు, బ్రతుకు బాటలన్నింటికి అనుకరణే ఆది. అట్లానే ఈ వ్రాతక్షర సృష్టికి, లిపి జ్ఞానానికి అనుకరణే తల్లి , ఆచరణె తండ్రి.

పుట్టి తల్లిపాలొదిలిన నాటినుండి కోతులవలె చెట్లు కొమ్మల నూపి, పండ్లురాల్చి కాయలుకోసి తినటము అనుకరణే! ఏనుగు తొండాన్ని, పులి ఎలుగుల గోళ్ళను, సింహం కోరలను చూచి ఆయుధాలు చేత బట్టినది అనుకరణె .

వ్రాతక్షరాలను, లిపిని, తెలుగు ప్రజలే సృష్టించు కున్నారు. అయితే అక్షరాలు ఇంత గుండ్రంగా సంఖ్యాబలంగ ఈ వరసక్రమంలోనే వున్నాయనుకోకూడదు. ఇవి అభివృద్ధి క్రమంతో చేసిన అక్షరపోకులు దిద్దుకున్న అందాలు, అలంకరణలు.

నాటి వారి జీవితావసరవస్తువులు, అవసరపనిముట్లు, చాలా కురచ. వాటికి సంబంధించిన వారి అక్షర 'లిపి' జ్ఞానం కూడా కురచని భావిస్తున్నాను.

'మయలిపి' అనే ఈ చిత్రాల వ్రాతాక్షరాలు, దక్షిణ భారతీయులనే తెలుగు, కన్నడ లిపుల వలనె గాక భారతీయుల లిపులన్నియు, 'మయలిపి' అనే బొమ్మల లిపి కూడా, వాడుక వస్తువుల పనిముట్లు పరిచయమున్న 'చిత్రలిపి ' నుండే రూపాలు దిద్దుకున్నవి. (ఈ ప్రాంతీయులు సృష్టించుకునట్టి వీరందరు 'భారతీయులు' అని పిలిపించు కొనుటకు కారణమైనట్టి 'చిత్రలిపి' అనే బొమ్మల రాత తెరమరుగైనదనీ, ఈ మయలిపి క్రీస్తు పూర్వం నాల్గైదువేల యేండ్ల నాడు వున్నదని ('జగత్కథ ' పేజీ 100 లో) తెలియుచున్నది.)

మయలిపి : అనగా వాడుక వస్తువుల, జనాలకు పరిచయమున్న ఆకారాల పోలికలు. (అంతేగాని **మయుడు** అనే మహావ్యక్తి వ్రాతక్షరాలను చెక్కి మనకు ప్రసాదించాడనటం నిజం కాదు. )

దేవనాగర లిపి : అనగా సంస్కృత అక్షరాలు. దీనర్థం ఏమనగా

సం = చక్కగా - అందంగ

సు = మిక్కిలి శుభ్రమైనది - తెలియతగినది

కృతం = రూపొందించబడినది. (నిఘంటువు)

ఈ లిపి కూడా భారతీయుల లిపులవలె వ్రాతక్షరాలవలెనె, ఈ బొమ్మల రాతనుండె రూపుదిద్దుకొన్నది. అంతేగాని ఆర్యులు భారతదేశానికి వస్తూ తెచ్చిందెంత మాత్రం కాదు.

క్రీస్తు పూర్వం 1500 యేండ్ల నాటికి ఆర్యులు తమ వేదభాష అంతరించి పోతున్ననాడు సంహితులను, బ్రాహ్మణాలను, వేదమంత్రాలను భారతీయ సంస్కృత వ్రాతక్షరాల్లో వ్రాసిరి. ( కేంబ్రిడ్జి హిస్టరీ ఆఫ్ ఇండియా పేజీ 111.)

ఆదిమ దశలో వర్గాలు, వర్గ స్వభావంగల భాషలిపులుండినవనుటకు వీలులేదు. అభివృద్ధి చెందే గణాల భాషలనుంచి తెగల భాషలు, తెగల భాష నుంచి జాతుల భాషలు, జాతుల భాషల నుంచి జాతీయ భాష అభివృద్ధి చెందుతు వచ్చాయి. (స్టాలిన్ భాషా శాస్త్రం)

పై నిర్వచనాలను గమనిస్తె ప్రజలు, ప్రజాకళా కారులు, అనుభవ కాలజ్ఞానులు రకరకాల మాటల్లో యోచించి, మెదడు కరిగించి, ఎన్నో యేండ్లు వెదకి , ప్రతి చిన్న పెద్ద మార్గాల ననుమానించి, విభజించి, సాదృశ్యపూర్వకంగా పరిశీలించి, పరిశోధించి, నిగ్గుతేల్చి కూర్చినట్టి తెలుగు భాషా వ్రాతక్షరాల మార్గాలను, నమూనాలను, తారుమారు చేసి మార్చారు స్వార్థపరులు. సొంత అధికృత కోసం ఈ పిచ్చి పనులు జేశారని నానమ్మకం.

'లిపి బ్రహ్మముఖం నుండి పుట్టిందని', **మయుడు**. చెక్కాడని సొంత అధికృతల కోసం అక్కా పోక్కా అందని ఏవో కల్పిత కట్టుకథలు సృష్టించిన కారణంగ, తెలుగు వ్రాతక్షరాల సృష్టి మార్గాలు చరిత్రలో లేకుండా చేసిన కారణంగ, నేడు ఎన్నో భాషలకు, వ్రాతాక్షరాల మార్గాలు, గుర్తులు, అగోచరమై, సావకాశంగ ఆకాశం వంక చూస్తున్నారు తెలుగు దేశ భాషాజ్ఞానులు.

గానానికి అక్షరపేర్ల వాక్యాలకు అడవి గోలే కారణమని, కళలకు కథలకు ముడి సరుకులనందించే 'సుక్షేత్రం' ప్రజాజీవితమేనని వ్రాతక్షరాలక్కాడ, ప్రజల వాడుక వస్తువులు, పనిముట్లు, పశు,పక్షి, మృగ జీవ జాతులే మూలమని మనమంతా భావించాలి, జనమంత గుర్తించాలి అంటున్నాను.

అంటే జీవ ప్రకృతి నుండే కూయుట గానం చేయుట, అక్షర పేర్లు పలుకుట, వాక్యాలు కూర్చుట, వ్రాయుట చదువుట వగైరాల క్కాడా అనుకరణే ఆది అంతస్సారమే పునాది.

# 22. వ్రాతక్షర నేర్పు - వ్యాకరణకూర్పు

పాతాళగంగను పైకిలాగి అవసరాలకు వాడు కుంటున్న జనాలు, కట్టెల్లో నిప్పును కష్టించి ముట్టించి, అవసరాల్లో వాడుకుంటున్న జనాలు, వేటకు ఆయుధాలు, ఆటకు వాయిద్యాలు సృష్టించుకున్న జనాలు, వాడుక వస్తువులతో వ్రాతాక్షరాలు సృష్టించుకున్న జనం వ్యాకరణానికి శ్రీకారం చుట్టారు.

అనుభవ కాలజ్ఞానమే తల్లిగ, బ్రతుకు దెరువు పరిశ్రమయే తండ్రిగ, తరతరాల యుగయుగాల జీవితానుభవమే గురువుగ, మనలకు అక్షర వాక్యాలను వ్యాకరణ శిక్షితమైన భాషను వ్రాతక్షరాలను సృష్టించుకొనుటకు తోడుపడి నవి, సహాయకారు లైనవి. ఈ పశు, పక్షి పనిముట్లులే గాని వేరొకటి కానేకాదు .

వ్రాతక్షరాలు :- ఓ ఆ ఈ గ ఎ త ర క ప య

పేర్లు కూర్చుట :- ఉదా॥ అ - అమ్మ, ఆ - అయ్య - తాత -కఱ్ర - ఈత

వాక్యాలు మార్చుట :- ఓరే కఱ్ర తేర - కత్తి కావాలా- అమ్మా ఈటెతో పందిని పొడువు.

సంధులు కట్టుట : అమ్మెక్కాడుంది - అయ్యేమనె - తాతిప్పుడేమనె

సంధులు విడగొట్టుట :- అమ్మ + ఎక్కాడ + ఉండె

అయ్య + ఏమి + అనె,

తాత + ఇప్పుడు + ఏమి + అనె

కర్త : అనగా ఆ జీవి, నరుడు - బరిలో వాడు

కర్మ : అనగా పని, పరిశ్రమ - బరిశతొ - బాణంతొ

క్రియ - అనగా ఫలితము - పందిని చంపి తినెను.

సామెతలు : అనగా సుధీర్ఘమైన జీవితానుభవం నుంచి క్రోడీకరించే అతి హ్రస్వ వాక్యములు అన్నారు. (మాసియాంగ్)

ఉదా : 'కఱ్ర లేక పోతే గొఱ్ఱె కరుస్తుంది.'

'కొండను త్రవ్వి ఎలుకను బట్టినట్టు'

సమాసములు : అనగా సమర్థవంతమైన పదముల ఏకీభావం. ఇవి - ద్వంద్వ సమాసములని, కర్మధారయ సమాసములని - సంభావన పూర్వపద

కర్మధారయ, ఉత్తరపదకర్మధారయ సమాసములని- ఉపమాన పూర్వక సమాసములని ఉన్నవి.

ద్వంద్వ - అనగా వాడికి వాడే సాటి వాడికి లేడెవడు సరిదీటు -

కర్మధారయ - అనగా కష్టాన్నెదిరించు. సత్కార్యాలు సాధించు.

సంభావన - అనగా అరసోలెడు గింజల కాజేస్తే తూమెడు గింజలు దూడ మేసింది.

ఉపమాన - అనగా సింహాన్ని గ్రుద్ది చంపిన నరసింహవాడు

యతి - ప్రాస - అంత్యప్రాసల - అక్షర మాలిక

ఉదా॥ పటపటపటపటపట పండ్లు గొరుకుచూ - పలుదర్పముతోడా.

వివరణ : ప - ప - ప - యతులు - 14 అక్షరం విరామం

మొత్తం 24 అక్షరాలు ఆట

ఉదా॥ అన్నా వినరా నిన్నా మొన్నటి తన్నులాట గోలా ॥

వివరణ : న్నా న్నా న్ను ప్రాసలు

ఉదా॥ శ్రీ గోపాలా శ్రితజనపాలా ఏందిర ఈ గోలా

వివరణ : లా లా లా అంత్య ప్రాసలు.

ఇట్లా వ్యాకరణానికి శ్రీకారం చుట్టారు త్రిలింగులు.కాని ''లిపి'' సృష్టి మార్గాలు అర్థంగాక వారు, అర్థం చేసుకో చేతకాక, వ్రాతక్షర సృష్టి బాటలను, ఆకారాలను మార్చి తికమక చేశారు. సామాన్య చదువరులకు అర్థంగాని రీతిలో వ్యాకరణాన్ని కూడా తికమక జేశారు నీచులు.

ప్రజల నిజాన్ని గ్రహించిన పెద్దలు స్వామి దయానంద సరస్వతీంద్రులు కూడా వ్యాకరణమంటే కాతంత్రా, సారస్వత చంద్రికా, ముగ్ధబోధ శేఖర, కౌముది, మనోరమ, వృత్తరత్నాకరము, చందస్సు, అమర కోశములు వగైరాలు కల్పిత అభూత కట్టుకధలని మిధ్యాగ్రంధములని, వీటిల్లో పిసరంతనిజం లేదని, ఉన్నా విషం కలిపిన మృష్టాన్నములాంటి వన్నారు. (సత్యార్థ ప్రకాశం పేజీ 72 లో వ్రాశారు. )

1855 లో చిన్నయసూరి కృతక కృత్రిమమైన వరవడిలో 'బాలరామాయణం' పేరుతో వ్రాశారు. అదే మనకు భాషా వరవడి గ్రంధమైనదని శ్రీవేటూరి ప్రభాకర

శాస్త్రిగారు నిరుత్సాహ నిస్పృహలతో వ్రాశారు. ఈ కృతక భాషాభిమానులు భాషానియమాలగేసి, అందరూ కవులైతే మన గొప్పతనమేమి గాను అని, స్వార్థపరులు తెలుగు వారిని భయపెట్టారు. శబ్ద శాస్త్రాన్ని తిక్కిరిబిక్కిరి జేశారు. 'అపశబ్దాలాలపిస్తే శాశ్వత నరకమని', ఆరింట ''తా'' పక్కిన వారింట పీనుగెళ్ళునని, జాతి కవులను, బవని పంబల వగైరా జనపద కళాకారులైన తెలుగు వారిని భయ పెట్టారు. 'సామాన్యుల భావాలపై' వ్యాకరణ యుద్ధం సాగించారని. కృతక, కృత్రిమ పండితులు సహజ వాస్తవ సంస్కృతిని నాశనం చేశారని' ఈస్వార్థపరుల్ని శ్రీ గిడుగు సీతాపతి, గురజాడ అప్పారావు వగైరా భాషా భాష్యకారులు కూడా విమర్శించారు.

''శబ్ద శాస్త్రం యొక్క విలువలను ఎక్కువ అంచనావేయటం, కావలిసిన దాని కన్నా అధికాధికంగా ఉపయోగించటము, ఇలా దుర్వినియోగ పరచక పోతే ''శబ్ద శాస్త్రం'' భాషా శాస్త్రానికి బాగా ఉపయోగపడుతుంది.'' అన్నారు జె. వి. స్టాలిన్

(భాషా శాస్త్రం పేజీ 47.)

ఇప్పుడీ భాషజ్ఞానుల ఆట పాటలు 'గరుడ' 'గంధర్వ' 'మార్గ' 'కురవంజి' 'ఖడ్గ' గానాలు శ్రీరామ లీలా, పిండి బంధం నాట్యాలు కావు. వీటన్నింటి మేలి కలయికతో మారుతున్న సామాజిక ఆర్థిక ఆత్మరక్షణాది గణ జీవిత ప్రతిబింబాల నుంచి భవిష్యత్ బ్రతుకు బాటల సూచించు దేశిగానం యక్షగానానివి అనగా అక్షర మాలికలు వ్రాత పూర్వకమైనట్టి, శ్రమ విభజన వ్యాకరణ శిక్షితమై కవితలైన ద్విపద, త్రిపద, చతుష్పద పంచపదులే తెలుగు సాహిత్య తొలి పునాదులనుకుంటున్నాను.

## 23. గ్రామ్యధర్మం - కలియుగారంభం

పృధివ్యాది పంచభూత జనితములే జీవాకృతులు. జీవాకృతుల్లో ఒకటైన మానవ జీవి ద్రవ్యముల కూర్చి, నూతన భోజన పదార్థముల రూపొందించు వి జ్ఞాన పరిశ్రమల కృషియే 'సృష్టి'.

వీరిప్పుడు నరసింహాలు, వానర నరులు, పరశురామ, శ్రీరాములు కాదు. బలరాములు- బలజీవులు.

బల : అనగా వృత్తి విద్యా బోధనలు, తిండిని పండించు పాండిత్యము, సాధు జంతువుల మచ్చికచేసే నేర్పు, ఓర్పు, ఇండ్లు కట్టు పనితనాలు, నైపుణ్యాలు భూసాగు శాస్త్ర విజ్ఞానము, ఇంకా ఇంకా గ్రామీణ కుటుంబ జీవితమునకు 'సాక్షి' ఎరుకయే 'బల'.

రామ : అనగా జీవి అని ఆంధ్ర॥ వా॥ స్పత్యంలో సూచిస్తున్నది.

పుట్టి భూమి మీద పడి ఫలాలు, పచ్చికాయలు, దుంపలు, పండ్లు, ఫలాలు, పచ్చి, కాల్చిన మాంసాలు వగైరా ప్రకృతి ప్రసాదాలు తిన్న జనాలకు, సృష్టి గుణములను, సృషి లక్షణాలను, సృష్టి విధానాలను వివరించినదే యక్షగానం.

సృష్టి : అనగా ద్రవ్యముల గూర్చి, నూతన పదార్థములను రూపొందించు పరిశ్రమను 'సృష్టి' అనిరి పూర్వజ్ఞానులు.

ద్రవ్యములు : అనగా పృధివ్యాది పంచ భూతములు, వర్షాకాలం, శీతాకాలం, ఎండాకాలం మూడును, మరియు యత్నము, ఇష్టము, కాలముల గతి దారులు, ఈ తొమ్మిదింటిని 'ద్రవ్యము' లన్నారు యక్షజ్ఞానులు.

ద్రవ్యావస్థలు : అనగా గుణము, రసము, నేర్పు, సామర్థ్యము, వికాసము. ఈ ఐదును ద్రవ్యావస్థలన్నారు యక్షజ్ఞానులు.

రసములు : అనగా నీళ్ళు గాక పులుపు, వగరు, చేదు, ఉప్పు, తీపి, కారం. యీ ఆరింటిని రసములు, కషాయములని యక్షజ్ఞానులు నిర్వచించారు.

గుణములు ; అనగా ఇచ్ఛ, పరిశ్రమ, అభ్యాసం, అలవాటు, పట్టుదల, విజయం అని నిర్వచించారు యక్షులు.

ఇది విన్న నాటి నరులు పరిణామ క్రమంలో పంచభూతాత్మక జీవలోకంలో ఉత్తమ జీవిగా జనించి ధ్వనులను, శబ్దాలను, నాదాలను, నిప్పు, నీళ్ళను, భూమిని సాధించి అవసరాలకు వాడుకొనుటకై విప్లవించి కలికి అవతారములైన తిరుగుబాట్లు, పోరాటాల ద్వారా స్వాధీన పరచుకున్నారు నరగణాలైన జ్ఞాన నరులు.

**గ్రామ్యధర్మమంటే -**

ఏ జాతిలోనైనా వ్యాపించి వున్నట్టి, సాంప్రదాయనడవడి, సదాచార నియమాలు, అలాగే దున్ని పండించే వాడిదే భూమి, వృత్తి వర్ణాలన్నింటికి మేరలు,

మేమాలిచ్చే విధానం, అందరికోసం ప్రతి ఒక్కడు, ప్రతిఒక్కడి కోసం అందరూ కలసి కృషి చేసే శాస్త్రీయ కళాత్మక సంఘజీవితమే 'గ్రామ్యధర్మం' అని నాభావన.

భూమిని దున్ని, మళ్ళు గట్టి నీళ్ళు బెట్టి, బలం పెట్టి సాగుచేసి తొమ్మిది ధాన్యాలు, తొమ్మిది కూరలు పండించారు. ఎట్లున్న వాటి నట్లానే తింటూ ద్రవ్యాలను, రసాలను వాటి స్వరూప స్వభావాలను, గుణాలను అవగాహన చేసుకొని నేర్పుతో, ఓర్పుతో, యుక్తితో వాటిని వండి తినాలని, కాల్చుకు తిన్న మాంసం వలే త్వరగా జీర్ణమవుతుందని ఊహించి వంట ప్రారంభించారు నరులు.

ధాన్యం కుండలలో బోసి, అందులో నీళ్ళు నింపి, కొలిమి మీద పెట్టి తిత్తి ఊదటం ప్రారంభించారు. నీళ్ళు చాలక మాడిపోయింది. ఈసారి నీళ్ళు ఎక్కువై అంబలి, జావగా తయారైంది. తుకతుక ధ్వనితో పొంగి,పోయిలో పడుతుందని దించబోయి చేతులు కాల్చుకున్నారు.

ఎన్నాళ్ళు, ఏన్నేళ్ళిట్లా అడా మగా చేతులు, మూతులు కాల్చుకుంటు సంకటి, జావ, ఉడికీ ఉడకని మెతుకులు తింటారు. ఎంతో ఓర్పు నేర్పులతో ఎంత కుండలో ఎన్ని ధాన్యం బోయాలో నీళ్ళు 'ఎసరు' ఎన్ని పోయాలో, మంట ఎంతఉండాలో, ఉడుకు మెళుకువలు ఎలా తెలుసుకున్నారో, పంచభూతాల కూడికతో అనుభవ కాలజ్ఞానంతో కూడు, కూర, పచ్చడి, చారు, పులుసు, నాలుగు కూరలు, నవకాయ పిండి వంటలన్నట్లు పంచభక్ష్య పరమాన్నాలలోకి చేరారు. పండేది భూపతన పొలం, ఉండేది కలియుగం, దున్నేవి, దోకేవి, వండేవి, వార్చేవి గుడ్డ గోచిలన్ని అనాదివే. కనుకనే ఇది 'కలి' యుగం అంటాను.

ఈవిధంగ కలియుగారంభ కాలంలోనే గణగుంపులు గ్రామాంకురాలుగా ఎదిగాయని నా భావన. బవని, పంబల, ఝుముకుల, సిగ్గుల, డ్రమ్మర మొదలగు యక్షగాన కళాకారుల (అనుభవకాల జ్ఞానులు) పదపదార్ధ ప్రాధాన్యత చాటే గానాలతో వృత్తిపనిముట్లు వివరణ తెలుసుకుంటున్నారు, వృత్తిదారులు. నవధాన్యాలు, నాలుకూ్కరలు, పాడిపంటలు ప్రాధాన్యతను తెలుసుకుంటున్నారు భూస్పృశ్యులు. ఇలా కళాకారులు, వృత్తిదారులు భూస్పృశ్యులు (రైతులు) ఇచ్చే 'మేర' గౌరవంతో హెచ్చు తగ్గులు లేక నాటి గ్రామ్యధర్మం

కలియుగారభం 'మూడు పూవుల ఆరుకాయలు' అన్నట్లు విలసిల్లుతు, తెలుగుప్రజల సిరిసంపద, నాగరికత చూచేవారికి నోళ్ళూరించే విధంగా ఉన్నది. అదే ఆనాటి నిజమైన జాతి జీవితం - కళా పరిణామం.

## 24. రోమునుండొచ్చారు - భూములాక్రమించారు.

'క్రీస్తు పూర్వం 1600 యేండ్ల నాటికి సుందరదేహులు, నీలి నేత్రులు, రైను నది నుండి కాస్పియను సముద్రమువరకు వున్నారని వీరే ఆర్యులని నాగరిక జాతులకు తెలియదు.' అని జగత్కథ పేజీ 142-144 లో హెచ్.జి. వెల్సు వ్రాసినారు. క్రీ.పూ.-1400-2000 మధ్యన ఆర్యులు భారతదేశంలో ప్రవేశించిరి. (ప్రా.ప-చరిత్ర -పేజీ-86 కోరాస్కిన్-)

అనగా ప్రపంచంలో ఎక్కడో ఆర్యులు అనే ఒక తెగ వున్నదని క్రీస్తు పూర్వం1600 ఏండ్ల నాటికి నాగరికులైన భారతీయులకు, అందున్న తెగలకు, తెలుగు వారికి తెలియదన్న మాట. క్రీ ॥ పూ 900 యేండ్ల నాటికి ఆర్యులు శౌర్యోత్సాహములుగా 'సెమిటిక్', 'ఈజిప్టు', వగైర పూర్వనాగరిక దేశాల నాక్రమిస్తూ వస్తున్న ఆర్యులు, క్రీ॥ పూ 800 ఏండ్ల నాడు 'ఇటలి' టైబరునది ఒడ్డున వ్యాపారస్థలమైన రోమునగరమున జనసాంద్రత ఎక్కువైన కారణంగా హిమాలయ పడమటి కనుముల ద్వారా ఉత్తర భారతంలోనికి వచ్చిరి. (జగత్కథ పేజీ 146).

క్రీ. పూ.800-500 మధ్య కాలంలో ఆర్యులు పడమట పంజాబు, సప్తసింధు తీరం నుండి వలస వస్తున్న ఆర్యులు, ఆప్రాంత ఆదివాసులతో పోరుకు తలపడిరి అని రూడర్స్ 143 పేజిలో. కేంబ్రిడ్జి ఆఫ్ హిస్టరి ఆఫ్ ఇండియాలో ఉంది. అచటి ఆదివాసులను దక్షిణానికి, తరిమి వేసి ఉత్తర భారతంలో స్థిర పడినారు. తామాక్రమించిన ప్రాంతాల్లో వున్న నాగరికతలను, కట్టుబాట్లను, నడవడులను, నామరూపాలు లేకుండా సమూలంగ తుడిచివేసి, ఆర్యుల నాగరికతా నడవడులు, ఆచారాలు ఆర్య బానిసలైన ప్రజల ఆయాదేశాల నెత్తిన నయాన, , భయాన రుద్దుతున్నారు. ఆర్యులు అదే తంతు, అదే రీతి, నీతి భారతీయులలో ప్రవేశ పెట్టుచుండిరి.

మొదటి నుండి ఆర్య నాగరికతా, వారి సామాజిక నడవడులేమిటనగా

1. వీరి ప్రధాన పురుషులు వారి గురువులు కాదు, అనగా అనుభవ కాలజ్ఞానులు కాదు. ఆర్యుల జాతి పెద్దలు.
2. వీరికి రాజవంశములకన్నా ఉన్నత వంశములు అనగా ఎక్కువ తక్కువ కులోత్పత్తియే ఆర్యులకు గౌరవార్ణములు అంటే ఆర్యులకు గౌరవ చిహ్నం.
3. వీరు మొదటి నుండి, అనాది నుండి ఆలమందలున్నట్టి గుర్రాలున్నట్టి, ఆయుధాలున్నట్టి వారినే నాయకులుగ మన్నించు చుండిరి. వీరినే ప్రధాన పురుషులుగ పరిగణింతురు.
4. పశుమందలు, పంటభూములు, బీళ్ళు ఈ సంపద పెద్దలైన నాయకులపై వారి యాజమాన్యానుండును.
5. ఈ నాయకులకు, వారి సతులకూ పరుండుటకు ఉన్నతమైన వసరులు, వసతులు, ఏర్పాటు చేయుట. మిగతా సామాన్యులంతా ఎక్కడ చోటుంటే అక్కడే నిద్రించుట ఇప్పటికీ ఈ దేశంలో ఈ బానిస ఆచారములు వున్నవి.

(జగత్కథ పేజీ 144-145)

భారతదేశంలో ఆర్యులు కాలుమోపేనాటికి ఈ దేశంలో నాగరికత జాతి నడవళ్ళు ఎలా ఉన్నవో క్లుప్తంగా వివరిస్తాను.

పెద్దలు పిన్నలు అనే భేదం వయసులో గాని వేరే లేదు. ఎద్దులు పాడి పశువులు ఉన్నవారు లేనివారనే స్థితిలేదు.

1. జాతి ఆత్మరక్షణ ఆహార సంపాదనలందు అందరి క్షేమం కోసం ప్రతిఒక్కడు, ప్రతి ఒక్కని కోసం అందరు పాటుబడుచు, కుల ఉచ్ఛనీచాలు, ఎక్కువ తక్కువల్లేవు.
2. భూపతన కలియుగారంభమునందు ఒక తల్లి బిడ్డల్లో ఏర్పడిన ఎనిమిది వృత్తి సంఘాలు, ఎక్కువ తక్కువలు లేక రాజసన్మానాలు అనగా మేరలతో జీవిస్తున్నారు. శక్తి కొలది పనిచేయటం. పొట్ట నిండా తినటం.
3. వీరి నాయకులు ధీరులు, విజ్ఞానులు అనుభవ కాలజ్ఞానులు, వీరి ప్రధాన గురువులు కూడ అనుభవ కాలజ్ఞానులే, వీరిలో స్త్రీలు కూడా వుండేవారు. బహుశ విద్యా వంతులైన వీరే దేవుళ్ళని, దేవీలను కుంటున్నారు.

శ్లో ॥ ఓం బ్రహ్మాదయో దేవా త్రుస్యంతామ్ విద్యాంగం - సోమి దేహ ॥

ఈ సూక్తి శత పద బ్రాహ్మణ వచనము. దీని భావము-

విధ్వాంసులకు దేవులని, విద్యావంతులైన సతులను దేవిలని వేదోపనిషత్తుల నిర్వచనము. (సత్యా - ప్ర ॥ పేజీ 104 దయానంద సరస్వతీంద్రులు చెప్పిరి) కనుక నేటికి మనం పూజిస్తున్న దేవుళ్ళు, దేవతలకు వీరే తొలిమెట్టు.

4. గుహల బోలిన నిద్రాలు గుడిశలు, గుడిశలతో గూడేలు, ఒకే గుడిశలో ఒక స్త్రీ కి ఒక పురుషుడని కలియుగ భార్యాభర్తలకిదే తొలిమెట్టు. అంతేకాదు 'ఎంగిల్స్' చెప్పినట్లు బిడ్డల పెంపకం దగ్గర స్త్రీ పురుషుల మధ్య ఏర్పడిన శ్రమ విభజన కొంచె మించు మించు ఈ దశలో జరిగింది కాని అప్పటికి ఆర్యులొచ్చే నాటికి తెలుగు దేశంలో వర్గవిభజన కలవారు, లేనివారు, కుల,వర్ణ వ్యవస్థలు లేనే లేవు. కవితల్లో కల్పిత కట్టు కథల్లేవు. వాస్తవిక జీవిత చిత్రా లే వుండేవి.

వర్ణవ్యవస్థ గురించి ఋగ్ వేదంలో మొదట లేదనీ, (క్రీ.పూ. 800 ఏండ్లనాడు రచించినట్లు భారతీయశాస్త్ర వేత్తల అభిప్రాయం. మరియూ ఆర్యులు భారతదేశం వచ్చి స్థిరపడిన తరువాతే ఈ వర్ణవ్యవస్థ ఏర్పడిందని కేంబ్రిడ్జి హిస్టరీ ఆఫ్ ఇండియా పుట 93లో రూఢిగా వ్రాసిరి.

శ్లో ॥ ఏతద్ద్దేశ ప్రసూతస్య సకాశాదగ్ర జన్మన ః స్వంస్వం
చరితం, శిక్షార్థం పృధీవ్యాం సర్వ మానవా ః

(మనుస్మృతి పేజీ 452 అ 20 శ్లోకం ॥)

ఏతద్ - అనగా ! ఈ దేశంలో అనగా (తెలుగు దేశంలో)
సకాశ - అనగా ! ప్రశాంతతనూ మరియు
అద - అనగా ! హక్కులను (ప్రజల హక్కులను)
ఏశ - అనగా ! హరించునట్టి (ప్రజలకు హక్కులు లేకుండా చేయునట్టి)
గర - అనగా ! సైనిక సభ (రాజ్యాంగ యంత్రం)
జన్మన ః- అనగా ! యేర్పడెను.

తా ॥ ఆర్యులొచ్చి తెలుగుదేశంలో ప్రశాంతతను, ప్రజల స్వేచ్ఛా, స్వాతంత్రాలను, సర్వహక్కులను, హరించునట్టి నిరంకుశ సైనికసభ నేర్పరచిరి.

స్వం - అనగా తాను అనగా సైనిక సభ

స్వం - అనగా డబ్బులిచ్చి, కూలిచ్చి, జీతభత్యం ఇచ్చి
చరిత : - అనగా పనులు చేయించుకొను విధానమును
శిక్షార్థం - అనగా అలవాటు చేయుట కూలి డబ్బులక ులు ేసుట
పృధివ్యా- అనగా భూమిని, అనగా పంటపొలమంతయూ
సర్వం - అనగా భూములన్నియూ, ఉత్పత్తి సాధనాల ంటినీ ఆక్రమించారు.
మానవ - అనగా భూపతిని అనగా రాజ్యాది పతినిగా శ ంచు సైనిక స ర్పడెను.

రాజ్యాంగ మేర్పడెను అని ఆం.వా.స్మృత్యంలో అర్థమ స్తది.

తా ॥ తెలుగు జాతి యొక్క శ్రమ శక్తిని కూడా అమ్మేదీ, కొనేదైన వర్తకప రుకుగా మార్చి వేశా రార్యులు.

సైనిక సభ తెలుగుదేశ భూస్వామ్యులు అనగా వ్యవసాయదారులు, మొత్తం ప్రజలు పొళ్ళుగొట్టి బీళ్ళు దున్ని సాగు చేసిన భూములన్నింటి నుండి భూస్వామ్యులను తొలగించి ఈ భూములన్నీ ప్రభులవనెను.

ఈ పొలములో పనులు చేసే వారికి 'మేరలు' రాజసన్మానాలు వగైరా మర్యాద జీవన భృతులన్ని రద్దు చేసి, కూలి డబ్బులకు, జీత భత్యాలకు పనులు చేయాలని సైనికులు శాసించెను. నాటి నుండి తెలుగు దేశమంతటా అదే అమలు చేయసాగారు.

'మేర' అనగా పెట్టబడి. పనివారి బ్రతుకునకు ప్రజలు, భూసాగుదార్లు బాధ్యత వహించుట, బాసటగుటను నిషేదించారు. తెలుగు జాతి మొత్తం ఆర్య బానిసలయ్యారు. మేరల నిషేధించి -కూలి జీతం నిత్యభత్యం నిర్ణయించారార్యులు.

బానిస - అనగా । ఉత్పత్తి సాధనమును తన నుండి లాగివేయ బడినట్టి ఆహార ఆత్మరక్షణ వగైరా ఆర్థిక అవసరాలకై వాటి బలవంతంవలన శ్రమ జేసే పరోక్షంగా జీవితవసరాల ఉత్పత్తి దారుడు బానిస ( ఇల్యున్ 1950-280 బ్యాకియన్ సంభాషణ నిఘంటువు - ప్రా-బా-సి-గ- పేజీ 93 వాల్టెర్ రూబెన్.)

ఆర్య సైనిక సభ తెలుగు ప్రజలందరిని కూలీలుగ, పాలేళ్ళుగ, జీతగాండ్రుగ, దీనులుగ, దరిద్రులుగ, నిత్యం చస్తూ బ్రతికేటట్లుగా కట్టడి చేసింది. ఆనాటి నుండి తెలుగు ప్రజల ఐశ్వర్యం అంతరించింది. తెలుగువారి మానవతా లక్షణాలన్ని, విద్యావిజ్ఞానాది సర్వమానవతా లక్షణాలన్ని ఒక్కొక్కటే హరించుకు పోయినవి.

271-4029



క్రీ.పూ. 1000 యేండ్ల తరువాత భారతదేశంలోన రైతుల పంటల్లో పశువుల్లో వాటాలు, పన్నులు వసూళ్లు చేసేందుకూ రైతుల్ని, బానిసల్ని, విధేయులనుగా ఉంచే సైనిక సభ యేర్పాటైనది. (ప్రా. ప్ర.చరిత్ర పేజీ 89 ఎఫ్ కోరోస్కిన్.)

## 25. ఆర్యనాట్యసృష్టి - సంతానదృష్టి

దేశంకోసం ఆర్యులు సాగిస్తూ వచ్చిన దురాక్రమణ యుద్ధంలో రోషావేశులై, పౌరుషవంతులై, లొంగుబాటెరుగని ఆదిమజాతులు, భల్లూక తెగలు, జాంబుడి వంశస్తులు, సైనికుల పేర్లతో తెలుగు ప్రజలు, పనివంతులు, చేతివృత్తుల వారు, భూస్పృశులు అనేకులు నేలకొరిగిరి. వడ్రంగం, కమ్మరం, మేదరులు, చర్మకారులు, వస్త్ర పారిశ్రామికులు తక్కువయ్యారు.

పంటభూములు తక్కువగానే వుండటం, మధ్యం తయారు చేయువారు, గానుగ త్రిప్పువారు తక్కువైన కారణంగా పంటపంటకి మధ్యన, మద్యం తయారీకి వినియోగించు బానిస జనభా అవసరత ఏర్పడినది.

పనిమంతుల, బానిసల, చేతి వృత్తిదారుల అవసర కారణంచేత, బానిసలచేత, ప్రజల చేత, అధికాధికంగా బిడ్డల కనించాలి. అధిక సంతానోత్పత్తికోసం శాస్త్ర పరిజ్ఞానమంత అనగా కవుల, కళాకారులు, మరియూ జ్యోతిషులు, మంత్ర తాంత్రికులు, యజ్ఞయాగాది క్రతువులు మొత్తం మీద యంత్రాంగ మంతా సంతానోత్పత్తి మార్గాల పై కేంద్రికరణ దృష్టి సాగాలని ప్రభువులు, సైనికసభ తీర్మానించారు. సమావేశాలు జరిపారు.

(అంటే ఈనాడు దేశపాలక వర్గాలు అధిక సంతానాన్ని అరికట్టాలని, సంతానం నిరోధక చట్టాలు, ఆపరేషన్లు, అందుకు నగదు, వస్తువులు బహుమతులు అన్ని కళలు ఈ కార్యమునకే ఎలావినియోగిస్తున్నారో అలాగన్నమాట.)

(క్రీస్తుపూర్వం 500 యేండ్ల నాటికే వృత్తి విశిష్టత, వృత్తి దారులవసరం చాలా పెరిగిందనీ కేంబ్రి. హి. ఇ. పేజీ 137 రూబెన్ పేజీ 105 లో వున్నదని ఉప్పల రావు వ్రాశారు.)

అప్పుడు సైనికాధిపతియైన ఇంద్రుడు ఆర్య నాట్యాచార్యుడైన నందీశ్వరుని వద్దకొచ్చి-

''ఓ నాట్యాచార్యా నందీశ్వరా !

శ్లో॥ త్వదీయ నర్తక సోయంత్వత్కృపామభివాంచితం
తం వి జేతుమయం నాట్య వినోదై ః క్రమవేధిభి ః॥
(అభినయ దర్పణం నందికేశ్వర ప్రోక్తం శ్లోకం -4-5)

ఓ నందీశ్వరా !

అర్థం॥ త్వదీయ - అనగా ! మీచేతుల మీదుగా

నర్తక - అనగా ! కపట కృత్రిమ నాటక

సో - అనగా ! కథను

ఓ - అనగా ! ఆడుగురి యోని అనగా రతిక్రీడకు సంభంధించిన

ఆ - అనగా ! సాహిత్యంతో

యమ్ - అనగా కూర్పు చేసి ఇవ్వ వేడుచున్నాను.

తం - అనగా సంతాన నిశ్చయము తప్పని సరిగా బిడ్డలు పుట్టే ఇతివృత్తాలు ఆ విషయాలే వుండాలి.

వి - అనగా చెలి చిత్త, చిలిపి, చిల్లగొండి కామవికారాలు.

జేత - అనగా విజయ. అనగా రతిక్రీడా చేష్టలు అన్వయయోగ్యమైనట్టిదిగా ఆ నటనా భంగిమ ముద్రలుండాలి.

ఉ - అనగా సంభోధనలు కూడా వుండాలి.

మయం - అనగా మతాంగనల గోపికా క్రీడానర్తనము లో

క్రమం - అనగా లోలము అంటే 'కులుకుల' తళుకు బెళుకులు చమత్కార చెముక్కులు.

వేధిభి- అనగా వేదికలపై నటిస్తుంటే నివ్వెర పాట్లు పారవశ్యములు, ఆడా, మగా వారిలో మైమరపింపులు, చెలి చిత్త వికారాలు కలిగించునట్టిది గా నాటక కథ ఇతివృత్తాలుండాలి.

తా॥ అంటే ''నందీశ్వర కామ, శృంగార, రతిక్రీడకు సంభంధించినట్టి వ్యభిచార బూతు' సాహిత్యంతో నిండి యున్నట్టి కపట నాటక కథతో కూడిన 'నటనా' రూపమును తమ చేతుల మీదుగా వ్రాసి మాకివ్వ వేడుచున్నాను.'' అన్నాడు 'ఇంద్రుడు' మరియు, ''ఓ నందిశ్వరా! ఈ 'భగ్' శిశిన సంభంది నటనలోకథా సాహిత్యంలో ఏమి వుండాలంటే!

సంతానసృష్టికై సృష్టింపబడిన నాట్యమని రుజువు చేస్తున్న నాట్యరాజు



పసిబిడ్డపై ప్రతిమైన శివం

## వాత్స్యాయన కామసూత్ర భంగిమల పోలిన నాట్యభంగిమలు



నాట్య భంగిమ




నాట్యశాస్త్రము

సంతాన కార్య నిశ్చయంమునకు పురికొల్పునట్లు ఆడా,మగను రెచ్చగొట్టు నటనలో కులుకులు, తళుకు బెళుకులు, చెలిచిత్త, చిల్లగొండి చేష్టలు, సంభోదనలు, వింటుంటే వావివరుసలు, ఈడు జోడులు, వయసు సొగసు, అందచందాలు, రోగాలు రొష్టులు, భయభక్తులు, సిగ్గుబిడియాలు వగైర సామాజిక నీతి నియమాలు, కట్టుబాట్లు మొ॥ మానవత లక్షణాలు గుర్తుకు రానంతగా మైమరపింపు కలిగించునట్టి నటనను, కథా రచనను కల్పించి మాకివ్వ ప్రార్థించుచున్నాము'' అని ఇంద్రుడునగా అదివిన్న నందీశ్వరుడు ''ఓ ఇంద్రుడా !

శ్లో ॥ నృత్తంతత్ర యోక్తవ్యం మభిషేకే ప్రియ సంగమే
ప్రవేసే సర్వకర్మషూ వివాహే పుత్ర జన్మనీ

నృత్తం - అనగా భావాశ్రయమైన అంగాంగ కదలికలతో

తత్ర - అనగా ప్రయోగింప సాధ్యపడునట్టిదైన అంగాంగ నటనల

అన్వయం - అనగా యధాశక్తితో భాగం , అందులో వుంచబడినదైనట్టి

అభిషేకే - అనగా తనువులరెంటినిమమేకం చేయునట్టి

ప్రియ సంగమే - అనగా రతి ప్రియులను ఏక ముఖులను గా కలుపుటలో

ప్రవేశ - అనగా చలనములలోను, ఉద్రేక ఉబలాటములలోను

సర్వకర్మషు - అనగా ఆ రెంటికి సంబంధించినట్టి అన్ని పనుల , శబ్దముల , ఫలమున కాధారమైన రుజువైనట్టి 'బిడ్డల' పనితనాల్లో

వివాహే - అనగా ఎనిమిదింటిలో ఒకటైన వివాహ పద్ధతిలో

పుత్ర - అనగా శిశువులు, పుత్రులు

జన్మని - అనగా పుట్టించు నట్టి (నృత్త, నృత్య, నటనా గ్రంథమును కల్పించి ఇస్తున్నాను అని ) (అం॥ వా॥ )

తా ॥ ఓ ఇంద్రుడా ! అధిక సంతానాభివృద్ధి ఉద్దేశానికనుగుణంగా అంగాంగాల కదలికలు, కౌగిలింతలు, ముద్దులు, ముచ్చట్లు ప్రయోగించి యధాశక్తితో తనువుల మమేకం చేయునట్లు చేయు నటనల, అంతేగాదు ప్రియుల, కాముకుల వారు చేయు అన్నిపనుల!, క్రియల , శబ్దముల వీటి ఫలమునకు రుజువులైన శిశివు ముఖ్యంగా మగబిడ్డ కలుగునట్టి ఎనిమిదింటిలో ఒకటైన వివాహపద్ధతిలో బిడ్డల పుట్టించునట్టి, రతిక్రీడకు పురికొల్పునట్టి

కార్యక్రమ వివరణా నటన, ఇతి వృత్తాల వివరణ పొందుపరచిన గ్రంథమునిస్తున్నాను.

(అభినయ దర్పణం)

''ఓ ఇంద్రుడా ! ఈనృత్త నాట్య ధర్మమును వినుము అదేమనగా -

శ్లో ॥ వివాహ ప్రసవావాహ - ప్రమోదాభ్యుదయాది ॥

అర్థం ॥ వివాహ - అనగా యేదోఒక వివాహ పద్ధతిలో

ప్రసవావాహ - అనగా శిశువులు అంటే మగ సంతానాన్ని కనటం

ప్రమోద - ఆనందం

అభ్యుదయ - అనగా జనాభివృద్ధి అవసరం

ఆమ - అనగా ప్రధాన మైనది.

ఈ గర్భాదాన ప్రయోజనమును ప్రజల్లో ఈ నృత్త నృత్యములు ద్వారా గొప్పగా, పెద్దగా, ప్రచారం చేయుట, కీర్తించుటే నాట్యధర్మం.

(నాట్యవేదం జమ్మల. శర్మ పేజీ - 90)

తా ॥ ఓ ఇంద్రుడా ! ఈ నృత్త నృత్య ఉద్దేశ్యం ఏమనగా ? గర్భాదాన సంకల్పం అనగా ప్రజల చేత అధిక సంతానాన్ని కనించుట (నాట్యవేదం పేజీ - 6), మరియు ఈ నాట్య బ్రహ్మ సంకల్పం ఏమనగా ? ప్రజలను సమాజాన్నీ వృద్ధి పొందించుట (నాట్య వేదం పేజీ - 16), మాత్రమే.

ఈ నాట్య, నృత్త, నృత్యములకు వాటి ఉద్దేశ్యములకు 'గుర్తు' 'రుజువు' 'అదే ఆ నటరాజు పాదాల ముందు కాళ్ళు చేతులాడిస్తు నోరాడించు ఆ శిశువు' ఇది ఎవరూ ఏనాడు కాదనలేని 'సత్యం'.

## 26. నాట్యకత్తెలు - నామరూపాలు

''ఓ ఇంద్రుడా ! నాట్యకత్తెల ఎంపికను వివరిస్తా విను -

శ్లో ॥ తన్వీరూపవతీ శ్యామాపీనోన్నత పయోధ
ప్రగల్భ సరసకాన్తా కుశలాగ్రహమోక్షయో ః ॥ 26

శ్లో ॥ విశాలలోచనా గీతవాద్య తాళాను వర్తిని
పరార్థ భూషా సమ్పన్న ప్రసన్న ముఖ పంకజా ॥ 28

తన్వీ - అనగా ఆడది, బిడ్డలగనే వయసులో వున్న స్త్రీ

రూపవతి - అనగా అందగత్తె, చూడ చక్కనిది

శ్యామా - అనగా యవ్వన మధ్యస్తురాలు. కనే ఈడులో వున్నట్టి

పీనోన్నత పయోధర - అనగా బలిసి నిక్కిన పొడుచు కొచ్చిన రీతిగా యున్న చున్నులు గలది - కుచములమరినది.

ప్రగల్భ - అనగా రతిక్రీడా కోరిక ఎక్కువగా కలిగున్నది.

కాంతా - అనగా రతిక్రియకు కోరదగినది

సరస - అనగా రేతస్సు తడి ఆరిపోనట్టిది. ఆరిపోనొప్పనిది.

కుశలా - అనగా రతి బంధనాలలో నేర్పుకలిగున్నది.

గ్రహ - అనగా రతి అనుభవము కలిగున్నది.

శ్లో ॥ చారతాళలయా భిజ్ఞా మణ్డలస్థాన పణ్డిత ః
హస్తాంగస్తాన ని పుణాకరణేషు విలాసిని ॥ 27

శ్లో ॥ నాతిస్థూలా నాతికృశా, నాతుచ్చానాతివామనా
ఏవం విధగుణోపేతా నర్తకీ సముదా హృతా ॥ 29

చార - అనగా కామక్రీడలందు, పనులందు ఎకసెక్కెములు, సెతుర్లు, కోడిగాలలు, శాణీతనాలు, కొరుక్కోవటాలు, పట్టుకోవటాలు ఎరిగినట్టిది (అభినయ దర్పణం పేజీ - 8-9 శ్లో 26-27-29)

తాళ ల యాభిజ్ఞ - అనగా టక్కులు, పిక్కులు, టాటోకులు వగైరా రతిక్రీడా వడుపులు, వయ్యారి లక్షణాలు కలిగున్నట్టిది.

మండల స్థానపండిత - అనగా ఆకర్షణలున్న అందగత్తె, తన యొక్క నడిమిచోటును చూపెట్టు నేర్పు, చాకచక్యం, నటనా కలిగినది.

హస్తాంగస్తాననిపుణ - అనగా భ్రమింపజేయు వాటినన్నింటిని చూప గల్గిన సర్వ సమర్థురాలు, నేర్పరి తనము కల్గిన నిపుణత ఉన్నది.

కరణేషువిలాసిని - అనగా యవ్వన మదము కలుగునట్టి వెర్రి మొర్రి చేష్టలు, వెకిలి నవ్వులు, సంతానంకనే వస్తువు ఉద్దేశం కలది.

ఎక్కువ పొట్టిది, మరీ పొడవైనది, ఎక్కువలావు, సన్నము కానట్టిది, అందగత్తెలు కావలెను. ఈ నాట్యకత్తెలు అలంకార చతురలు, విలాసాదు లమరిన కుర్రలు, కేవలం స్త్రీ లే కావలెను.

ఓ ఇంద్రుడా !

ఇట్లా అలంకారాలమరిన అందగత్తెల నటనలను, పాటలను, అంగాంగ కదలికలు, చూచిన **మునులు** ఆయొక్క నృత్త నాట్య కత్తెల సంయోగములో సమాదరణా క్రియలందు, పనులందు ఉత్సాహంతో పాల్గొనగలరు అని ఉన్నది. (నాట్యవేదం పేజీ -13)

మునులు - అనగా చేయువారు అని ఆ॥ వా॥స్పత్యం అర్థం. (ఏమి చేయురంటె ? ఈ సందర్భమునసరించి గర్భములు చేయువారుగా )

సంయోగము - అనగా స్త్రీ పురుష కలయిక 'సంభోగము'గా భావిస్తున్నాను. అంతేగాక చక్కని చుక్కలు, సిగ్గు బిడియాలు లేని, వారి అలంకరణలు, చిలిపి చేష్టల కనుగుణంగా ఉండు వారికి 'మతాంగనలు' అని పేరు పెట్టారు.

మత - అనగా అంగీకరించినట్టి వారు.

అంగనలు - అనగా చక్కగా అలంకరించుకుని, ముఖ్యఅంగాలను చూపుటకు అంగీకరించిన 'కొంచెపువాళ్ళు' 'అల్పులు' అని ఆ.వా. స్పత్యంలో అర్థముంది.

ఈవిధంగా నాట్యకత్తెలకు నామరూపాలు స్థిరీకరంచిరి.

## 27. నాట్యసిద్ధాంతం - నాటి రాద్ధాంతం

ఈవిధంగా నాట్యచార్యుడైన నందీశ్వరుడు నాట్యస్వరూపం నాట్యకత్తెలు పాటించవలసిన తీరుతెన్నులు వివరించాడు. న్యాయశాస్త్రం రూపకల్పన చేశాడు. ఇక తమ క్రింద శ్రమ జీవుల కోసం, పనిమంతులకోసం, బానిసల కోసం అధిక సంతాన సృష్టికై జనాలలో యువతీయువకులను రెచ్చగొట్టే నృత్త నృత్య, నాట్యాలను కృతిమ నటనలను సృష్టించేందుకు ఆర్యకవులు, పండితులు, శాస్త్రవేత్తలు, కళాకార్లు ఆ యొక్క నటనారాద్ధాంత, సిద్ధాంత గ్రంథాన్ని రూపొందించ పూనుకున్నారు. అదే వాత్స్యాయన కామ సూత్రాలు. అసలీ వాత్స్యాయనుడు అనే వ్యక్తి వున్నడో లేడో కాని ఆ గ్రంథం పేరునకు తెలుగు నిఘంటువులు ఏ అర్థం చెప్పాయంటే

వత్స - అనగా శిశువు 'బిడ్డ'

ఆ - పుట్టునట్టి

అ - ఉద్దేశమును

న - కోరిక నీడేర్చునట్టి, ఆకోర్కె తీర్చునట్టి.

వాత్స్యాయన కామసూత్ర భంగిమ



నాట్య భంగిమ





97

నాట్య శాస్త్రము

కామ - మర్మాంగాల యొక్క ఆచరణ (క్రియల తెల్పు)

సూత్రం అనగా అట్టి కథాప్రసంగము - కథా వస్తువు.

తా ॥ శిశువులు పుట్టే వుద్దేశమును , కోరికలను, ఈడేర్చుకొను స్త్రీపురుషుల , మర్మాంగముల యొక్క పనుల, రతిక్రీడా భంగిమల, మగబిడ్డల బుట్టు విధానములను వివరించు 'సిద్ధాంతగ్రంధము'. (ఆ॥ వా॥ స్ప్రత్యం)

క్రీస్తు పూర్వం 800-500 యేండ్ల మధ్యన వ్రాసినట్టి ఈ వాత్స్యాయన కామసూత్రాలు అనే బూతుల బుక్కు వ్రాసింది ఆర్యపండితులే గాని, వాత్స్యాయనుడనే వ్యక్తి లేడు. ''కామసూత్ర'' అనే గ్రంధాన్ని క్రీస్తు తరువాత 45 శతాబ్ది మధ్య వ్రాసిన వ్యక్తి వాత్స్యాయనుడు - కాని **వాత్స్యాయనుడు** కాదు. ఇతడు గుజరాతీయుడని'' డా॥ ప్రకాష్ కొఠారీ వ్రాసిరి.

జనసంఖ్యను పెంచు మార్గాలలో ఉత్తమ మార్గం 'నటన' గా, నృత్త ,నృత్య, నాట్యంగా నిర్ణయించారు. ఈ నాట్య ముద్రలు, భంగిమలు, అడుగులు, ఆర్భాటాలు ఇలా వుండాలనే నిర్ణయాలు, స్థిరీకరణలు చేసేందుకు సమావేశ స్థలాలు ఏర్పాటు చేశారు. వాటికి 'ఘటాలు' అని పేరు పెట్టారు. (ఒకప్పుడు మనకూ పొలాల్లో గొడ్లను గట్టేసేందుకున్నవి కొట్టాయి పొలంలో గొడ్ల పాక) .

ఆ గుడిశల్లో చర్చలు జరిపే వారికి మంచినీళ్ళు, మజ్జిగ, ఇంకా మత్తుపానీయాలు, అందించేందుకు 'గుడిచేటి ' నుంచారు. (నేడు లాడ్జింగుల్లో 'బోయ్' లున్నట్లన్నమాట)

ఇక్కడ చేరే వారు, కామ, శృంగార రతిక్రీడలో పండితులు, వ్యభిచార దురంధరులు, నోటి దురదగాళ్ళు. పోసుకోలు కూతలు, పచ్చిబూతులు ఇక్కడ వినిపించేవి.

శ్లో ॥ తత్రసమాగతయో ః ప్రీతి లింగద్యాత నార్థం
ఆలింగన చతుష్టయం స్పష్టకం విద్ధకం ఉద్ఘృష్టకం పీడక మితి
(వాత్స్యాయన కామ సూత్రం ॥ పేజీ 180)

తత్ర - అనగా ఈ నృత్త, నాట్య, నటనములందు

ఆ - అనగా నీచమైన పనులు, వ్యభిచారాభివృద్ధి పనులు చేయు

సమ - అనగా కుచములు ఎవరివి వారు, ఒకరివి మరొకరు ఒతునట్లు నటించుట లో తొడలు, మర్మాంగస్థానాలు`చూడండి´అన్నట్లు అంగాంగాలు కనుబడునట్లు కూర్చుండుట , చూచు వారిలో కామోద్రేకం పెల్లుబికేటట్లు చాకచక్యంగా ప్రదర్శించు

అగత ప్రీతి - అనగా గుర్రాలు, గాడిదల సరసాలు, కుక్కల, నక్కల చెర్లాటలు నటించాలి.

లింగద్యాతనార్థం - అనగా స్త్రీ పురుష వేషధారులు మార్మాంగాలు చూపుకుంటు చిల్లిగొండి చిలిపి సంభోధనలు, బూతులాడుతు 'సంభోగమాట' ఆడుట.

ఆలింగనచతుష్టయం - అనగా కౌగిలింతలు సభకు వినుపించునట్లుగా ముద్దులాడుట, పదునాలుగు రకాల విట చేటి చేష్టలు చూపి, చూచే ఆడామగా తనువులు పులకించునట్లు నటించుట అని ఆం. వా. స్పత్యంలో అర్థమున్నది.

శ్లో ॥ స్పష్టకం - విద్దకం - ఉద్ఘష్టకం - పీడిత కమితి ॥ (వా. కా. పేజీ 71.)

స్పష్టకం - ఆడా మగ వేషధారులు అనగా ఒకరివి ఒకరు తాకినట్లు; పట్టుకోబోయినట్లు నటించుట.

విద్దకం - అనగా ఒకరివి మరొకరు ఎదురుగా, వెనుక భాగములతో మర్మాంగాలను రుద్దుకొన్నట్లు నటించుట.

ఉద్ఘష్టం - అనగా మర్మాంగాలకు చైతన్యం, కదలిక కలిగేట్లు ఒకరినొకరు ఆలింగనాలు కౌగిలింతలు.

పీడకం - అనగా ఒకరి నొకరు కౌగిట వత్తుకున్నప్పుడు, ఒకరి పెదవు లొకరుముని పంటకొరికి నట్లుగా నటించుట.

కామిత - అనగా కొరుకుట, ఒత్తుక్కొనుట, రుద్దుకొనుటే కాదు, శృంగార రతిక్రీడల వేదికలపై నటించుటే కాదు, నేర్పు నట్టిదే కాదు, వీటన్నింటి కనుగుణమైన ఆది వృత్తాలు, కలిగిన సంగీతాలను ఆలాపించు నేర్పరులుగా నృత్త, నాట్య కత్తెలు 64 కళలలో ఆరితేరిన వారినిగా తీర్చి దిద్దాలి.

శ్లో ॥ లోకయాత్ర తన్మూలకత్వా ॥ (వా. కా. సూత్రాలు పేజీ 52.)

లోక - అనగా సంతానంకోసం, బిడ్డల కోసమైనట్టి

యాత్ర - అనగా దృష్టితో ఈ పనులన్నింటి కంగీకరించు స్త్రీ , పురుషులు.

తను - అనగా సంతాన కొర్కతో రతిక్రీడకు అంగీకరించునట్లు.

మూలకత్వా - అనగా సప్తాంగవములు, శబ్దార్థవములు, రత్యాదిక్రియలు నటించుట, భోధించుట

శ్లో ॥ లోక వృత్తాను సరణం నాట్యం ॥ (నాట్యవేదం పేజీ 27.)

లోక - అనగా సంతానం, బిడ్డలకోసమైనట్టి

వృత్తి - అనగా కృషి. సంతానవసర పనులు, పరిశ్రమలు. అనుకరణ అనగా అనుసరించుట (ఆ.వా. స్పత్యం)

అంటే వాత్స్యాయన కామసూత్రాల్లోని నిర్వచనము, నాట్య వేదంలోని నిర్వచనం వేరు వేరు కాదు. ఒక్కటే 'సంతానక్రియ'. ఈ రెంటి ఉద్దేశం సంతానం అధికంగా కనే కృషిని స్త్రీ పురుషుల్లో రెచ్చగొట్టుట' అనుకొనుటకు ఇంత కన్నా వేరే రుజువులక్కరలేదు.

ఈ రెంటిలో ఒకటి ప్రేమ శృంగార రతిక్రీడల పేరుతో చెలి చిత్త వృత్తిని, మైధున కార్యాన్ని శుద్ధ వ్యభిచారాన్ని ప్రోత్సాహించే, బహిరంగంగా సమర్పించే బూతుల పంచాంగం, కామ సిద్ధాతం మైతే , మరొకటి ఈ మాటల గారడీ బూతుల పంచాగం నకు రూపకల్పన జేసి అడుగుల ఆటల కూర్చి, అందచందాల, అలంకరణల అందగత్తెలకు తర్ఫీదిచ్చి వేదికలపై అభినయించుటకుఆడిపాడుటకు ప్రోత్సహించునది. ప్రజలు రతి క్రీడకు వేళపాళ లేకుండా, వయసు, వరసవమ్, ఈడు, జోడు, ఏది చూడక కండ్లు మూసుకు పోయి, ఒకరిపై నొకరు ఎగబడేటట్లు చేసే రాద్ధాంతం ఒకటి సిద్ధాంతం మరొకటి.**రాద్ధాంతం.**

**సిద్ధాంతం** - అనగా గర్భాదాన సమయాన స్త్రీ పురుషులకు రతిక్రీడా సంభోగ రీతులు, విధానాలు బోధించునది.

**రాద్ధాంతం** - అనగా నిశ్చయించబడినది. ఆచరించి చూపునది .

ఒకటివినేది - ఒకటి చూచేది. నాట్యాన్ని, నృత్త నాట్యాన్ని గురించిన యీ న్నిర్ణయాన్ని నాట్య వేదం బలపరుస్తున్నది.

సమ + అన్వ + అభినయ + ఓ - (నాట్య వేదం రెండవ భాగం పేజీ 63)

సమ - అనగా సమమైనట్టి అలంకరణలతో (రతికి ప్రోత్సహించు)

అన్వ - అనగా పురుష సంభోగమార్గాలను, తన, పరా అనే పురుష భేదం తలంపక తెల్పుట.

అభినయ - అనగా తనయొక్క గాని, ఇతరుల యొక్క గాని అభిప్రాయాలను తెల్పుట.

అవి దేన్ని గురించిన అభిప్రాయాలంటే.

శ్లో ॥ గోచారో ఇంద్రియార్ధశ్చ ః ॥ అనగా

అనగా వీర్యాన్ని, శుక్రశోణితాన్ని వాటి ప్రయోజనాలకు సంభందించిన అభిలాషతో కూడిన కోరికలకు

ఓ - అనగా ! సంభందించిన అభిప్రాయాలను ఆచరణల విశదపరచి చూపే నటనే రాద్ధాంతం('నృత్తనృత్యనాట్య కళారూపం') అని ఆంధ్రవాచస్పత్యంలో అర్ధముంది.

కనుక ఈవిధంగా సంతాన క్రియే సాహిత్య లక్ష్యంగా ఉద్దేశ్యంగా కల్గిన 'సిద్ధాంతపు' నాట్యశాస్త్ర గ్రంధాన్ని మరియు 'రాద్ధాంతపు' వాత్స్యాయన కామసూత్ర గ్రంధాన్ని తయారు చేసి ఈరెంటి కలయికతో నాట్యాన్ని రూపొందించారు.

## 28. ఆర్య నాట్యస్థలి - తెలుగు శీలం బలి

నేను నా 75 సంవత్సరాల జీవితంలో మణిపూర్ నాట్యం, దక్షిణ దేశ కధాకళి, కొండకురవల్లో కోయచెంచు ఆడామగా కలిసి చేసే నాట్యాలు, లంబాడీ నటనలు చూచాను. పాత కూచిపూడి భాగవతుల మరియు నాటి అందే కోటదాసు, చిన్న సుబ్బయ్య, చింతపూడి మాణిక్యం, తారాబాయి వగైరాల భామాకలాప నటనా భంగిమలు బారెడు జడ తెర బయటకు వేసి చెప్పునట్టి జోస్యాలు, కాలజ్ఞానాలు, జాతకాలు 1929 నుండి చూస్తున్నాను. వారికట్టు, బొట్టు, వేషాలు, భాషలు అడుగులు, కుప్పిలలో నాట్యం పచ్చి బూతు లేదు. యే రాష్ట్రంలోనూ కానరాదు. మరీ తెలుగు దేశంలోనే ఈ నాట్యాన్ని ఇట్లా ఎందుకు మలిచారో ! జాలి, దయ లేదే మో ఆర్యులు ఇలా చెప్పారు.

॥''మధ్య దేశ్యే ఆర్య ప్రాయే ః ॥ - అనగా

మధ్య దేశ ఆర్యావర్త స్త్రీలు పరమ పవిత్రులు ఆచారవంతులు అట్టివారు కామకరణములనూ, రతిక్రీడా చర్యలను ద్వేషిస్తారు, నిరసిస్తారన్నారు -

॥ ''బహ్లీక దేశ్యావం విశ్చ ః ॥ అనగా

బహ్లీక అవంతి దేశాల స్త్రీలు కామ చేష్టలనూ, రతి బంధనాలను ద్వేషిస్తారు.

॥ ''మాళవ్య అభీర్యశ్చ ః ॥ - అనగా

మాళవ దేశ స్త్రీలు కామ చేష్టలను అసలు ఒప్పుకోరు. వాస్తవ వ్యభిచార తాడనాలకు పరవశించి పురుషులకు దాసోహం అంటారు. కనుక వీరు నటించుటకు పనికి రారు.

''॥ సింధూ రాష్ట్రేనాంచనీనాం ॥'' - అనగా

ఆరు నదుల మధ్యనున్న ప్రజలు, ఆ ప్రదేశాల స్త్రీలు బహిరంగ కామ కరణములతోను, రతిక్రీడలతోను తృప్తి చెందరు. పైగా వారు ముఖరతి కోరుతారు. అట్లా కోరునట్టి స్త్రీలు నటించుటకు పనికి రారు అన్నారార్య సిద్ధాంతులు.

॥ స్త్రీ రాజ్యే కోసలాయంచ ః - అనగా

స్త్రీల రాజ్యమైన కోసల దేశ స్త్రీలు, కామ కరణములను అంగహారాలను కోరుతారు. కానీ యీ స్త్రీలు 'దురద' తీర్చుకొనుటకై ఎక్కువగా సంభోగాన్ని కోరతారట. అట్లా కోరి వీరే గర్భాలు చేయించుకొనుచుంటే అసలుకే మోసం వస్తుంది. నటనే ఆగి పోతుందన్నారు ఆర్యపండితులు.

మహారాష్ట్ర పాటలీపుత్రా ః - అనగా

ఈ దేశాల స్త్రీలు కళాకోవిదులు, స్పురద్రూపులు, ముద్దు గుమ్మలు, స్వభావ సిద్ధంగా వీరు చాలా సుకుమారులు. కామ కరణములకు, శృంగార చేష్టలు ఒప్పుకోరు, ఓర్చుకోను లేరు.

॥ ప్రకృత్యా మృదు ఓ వ్యారతి ప్రియా ః ॥
అశుచి రుచిరా యోని

అర్థం ॥ ప్రకృత్యా - అనగా చక్కగా అలంకరించు కొనుట యందు ఎక్కువ ఇష్టాన్ని చూపు వారు . (ఆంధ్ర స్త్రీలు అన్నారు.)

మృదు - అనగా అమ్ముకొనుట, అంగీకరించునట్టి పోచుకోలు వాళ్ళు (ఆంధ్ర స్త్రీలన్నారు)

ఓవ్యా - అనగా అమ్ముకొనుట, అంగీకరించునట్టి పోసుకోలు వాళ్ళు (ఆంధ్ర స్త్రీలన్నారు)

రతి - అనగా లోరతి, ఉపరతి, సమరతులకు ఇష్టపడువారు మరియు బహిరంగ ఆలింగన చుంబనాలకు, సంభోగ క్రియలకు అంగీకరించు వారు. (ఆంధ్ర స్త్రీలు.)

ప్రియ - అనగా ప్రియురాండ్రుగా వుండుట కంగీకరించు వారు. (ఆంధ్ర స్త్రీలు)

అశుచి - అనగా అరాచకంగా లేకితనంగా సంచరించువారు.

రుచి - అనగా అట్టి లేకి కోర్కెలు వాంఛలున్న వారు (ఆంధ్ర స్త్రీలు)

యోని - అనగా ఎప్పుడు కావాలంటే అప్పుడు రతి క్రీడకు సిద్ధ పడు వారాంధ్ర స్త్రీలు.

రా - అనగా నీచ మిత్రోద్దేశముతో రా! అని ఏక వచనంతో ఆహ్వానించువారు.

చార - అనగా ఆటపాటలన్న ఇష్టమూ కోర్కె గలవారు.

తా ॥ విలువైన వస్త్ర భూషణాలలంకరించుటకు అమ్ముకొనుటకు ఇష్టాన్ని చూపు వారని, లోరతి ఉపరతి, సమరతులకు ఇష్టాన్ని చూపు వారని, బహిరంగ ఆలింగన చుంబనాలకు, సంభోగాలకు అంగీకరించు వారు. ఉంపుడు కత్తెలుగా ఉండుటకు అంగీకరించువారు, ఆటపాటలన్నా ఇష్టపడువారు. ఇన్ని రకాలుగా ఆంధ్ర స్త్రీలలో అధిక సంతాన నాట్యానికి కావలసిన మంచి లక్షణాలున్నవి కనుక యీ నాట్యాన్ని ఇక్కడనే, యీ ప్రజలలోనే ప్రవేశ పెట్టాలను కున్నారార్య పండితులు, పురోహిత బ్రాహ్మణులు, సైనిక సభానాయకులు. (ఇది వాత్స్యాయన కామ సూత్రాలు అనే నాట్య సిద్ధాంత గ్రంథం. పేజీ 229 - 230-233 లో వున్నది.)

తెలుగువారికి వ్యతిరేకులైన ఈ ఆర్యుల మతాంగనల నాట్య దళాల్లో ఇద్దరిద్దరు నాయకురాండ్రుందురు. ఈ నాయకురాండ్రు వేద విద్య లెరిగిన వారుగా చదువరులుగ, మాటకారులుగ, పదుగురిని కూడగట్టగల్గినట్టి వారుగ, సుందరదేహులుగ, స్ఫురద్రూపులుగ నిన్న మొన్నటి వరకు మనం భోగమాటగత్తెలల్లో చూచాము. పెళ్ళి పందిళ్లలో, దేవుళ్ళ ఉత్సవాల్లో లయ, తాళగతి కర్తలు, చిప్పతాళాలతో లయ తాళ గతుల ప్రకటిస్తు, మధుర కంఠాలు, శృతులందు మేళవించి జావళీలు, కీర్తనలు, పాటలు, కృతులు పాడే నాయకురాండ్రు ఆంధ్ర స్త్రీలని నేభావిస్తున్నాను. వీరు ఆటకత్తెల వెనక నిలుచుని గతి పడుతూ పాడుచుందురు.

చదువుల్లేని దీనులు దరిద్రులు బానిస కష్టజీవుల బిడ్డ లైనట్టి తెలుగు వారిని ఆట కత్తెలుగా ఆడిస్తున్నారని భావిస్తున్నాను.

**చెప్పింది చేయరు - చేసేది చెప్పరు** అనే విధంగ సంతానక్రియ నటనను, నటించు కన్నెలను, నేర్పేటి గురువులను, నటనా సిద్ధాంతాలను సిద్ధం చేశారు, సైనిక సభ, గురుకులాలలో లయ తాళ నడకలున్న కుర్రలు చెప్పినట్లు నటించే కన్నెలు కావాలి కనుక కవులు, కళాకారులు, పండిత సైనిక సభ, గ్రామాల వెంట పేదల వీధుల్లో ప్రచారం ప్రారంభించారు.

''సోదర సోదరీమణులారా ! పెద్దలారా ! విద్యాభిలాష గల కళాభిమానులారా ! బాలబాలికల తెలివి తేటలభివృద్ధికి గురుకులాలు అలాగే బాలికల గుండె బలానికి, కండ పుష్టికీ, నరాల సత్తువకూ ఉపకరించు వ్యాయామ కళారూపమైనట్టి నృత్త, నృత్య, నాట్యాలు మరియూ కళ్ళకు, హృదయానికి, ఊపిరి తిత్తులకు శక్తిని, పుష్టిని కలిగించు గానాన్ని నేర్పే పాఠశాలలు, గురుకులాలు ఏర్పాటు చేసింది మన ప్రభుత్వం. ప్రొద్దుట పూట అల్పాహారం, మధ్యాన్నం భోజనం, సాయింత్రం అల్పాహారం పాలు, రాత్రికి భోజనం ప్రభుత్వ సహకారాలతో ప్రభుత్వమే భరిస్తుంది. కనుక తెలుగు బిడ్డల్లో వీర మాతలను, విద్యావంతులను వృద్ధి చేయండి'' అని చెవులకు ఉట్టి గట్టుకున్న సామెతగా ఆర్య పండితులు, సైనిక సభ, కవులు, కళాకారులు ప్రచారం చేస్తున్నారు.

ఆర్యులకు వాగ్ధోరణి అధికము కావున ప్రతి ఆర్య కవీ తమ పూర్వ గాధలను, ఆనంద గీతాలను ఎల్లప్పుడూ మననం చేయుట చేత వీరి భాషకు చక్కని మాధుర్యమేర్పడెను. (అని జగత్కథ పేజీ 144 లో వ్రాసిరి.)

ప్రచారం జోరులో తల్లి దండ్రులకు ఏవో ఆశలూరిస్తున్నవి. ముఖ్యంగా కడుపు నిండా తిండీ, వంటి నిండా బట్టా లేని బిడ్డలను ఎక్కువగా ఆకర్షిస్తున్నవి ఆర్య ప్రచారాలు 'నీళ్ళు పల్లమెరుగు నిజము దేముడెరుగున్' వారి సహజ ధోరణిలో వారు చెప్పుకొను చున్నారు.

మేరలు పోయి, రాజ మర్యాదలు పోయి, కూలీలుగ , పాలేళ్ళుగ, జీతగాళ్ళుగ , నిగామానులుగ, బానిసలుగ దిన బత్తేలతో 'దినగండం నూరేళ్ళాయుష'న్నట్లు బ్రతికే వారి బిడ్డలు 'ఆకలి భయంకరమైనది అవసరం బలవత్తరమైనద'న్నట్లుగా జాతి కళాకారులు బవని, పంబల, ఝంకుల, ఒగ్గుల, డ్రమ్మర , మాష్టీను, యక్షులు కళలను నమ్ముకున్న, కళలంటే ఎక్కువ ఇష్టమున్న వారి బిడ్డలు, ఆంధ్రుల బిడ్డలు, ఆర్య పాఠశాల వాకిళ్లలో మూగుతున్నారు. ఏమున్నదో లోన చూడాలని ఉబలాట పడుతున్నారని భావిస్తున్నాను.

వచ్చే పోయో బిడ్డల్లో నృత్త నృత్య, నాట్యానికి నాయిక రాంద్రకు పనికి వచ్చే బిడ్డల తల్లిదండ్రుల పేర్లు తెలుసుకుని వారికి నచ్చజెప్పి బిడ్డలను చేర్పించేట్లు చేస్తున్నారు ఆర్య కళాకార్లు. కవులు, సైనిక సభా నాయకులు.

వచ్చిన బిడ్డలకు తలంట్లు చేయటం, వాసన నూనెలు వ్రాయటం, తలలు దువ్వి జడలు వేయటంలో విటచేటీలు శ్రద్ధగా చేస్తు, విలువైన బట్టలు వేస్తున్నారు. రకరకాల పిండి వంటలతో కమ్మని భోజనం పెడుతున్నారు.

ముక్కులకు, చెవులకు మెడల్లో బంగారు వస్తువులు, దండ కడియాలు, నడుం వడ్డాణాలు, రకరకాల నగలతో అలంకరిస్తున్నారు.

ఈ నృత్త, నృత్య, నాట్యాన్ని నేర్పి ప్రదర్శించే కన్నెలకు ''మతాంగనలు'' అని పేరు కూడా పెట్టారు.

కన్నతల్లి తండ్రి గుర్తురానంతగా, 'అమ్మా నాన్న చెపుతున్న స్వర్గం ఇదేనేమో!' అనుకునేట్లు చేస్తున్నారీ మోసకారులైన సైనిక సభ వారి ఆర్య నాయకులు వారందు నియమించిన విటచేటీలు.

విద్యా విజ్ఞానాలున్న ఆంధ్ర బిడ్డల తలిదండ్రులు, విద్యావిహీనులై బానిస తెలుగు బిడ్డల తల్లితండ్రులు ఈ మోసాన్ని తెలుసుకో లేనంత నమ్మకంగా రుచిగా ఉంటున్నవి ఆర్య పండిత పురహిత సైనిక సభా ఉపన్యాసాలు.

**కన్నూ మనదే - వ్రేలూ మనదే !** అన్నట్లు ఈ దేశంలోకి ఆర్యులొచ్చే నాటికి ఇక్కడ నీలి, గోధుమ రంగు వర్ణులగు ద్రావిడుల సంస్కృతితో ఆర్యులకు సంభంధం కలిగెను. వారి నుండి ఆర్యులు చాలా నేర్చుకొనిరి.

త్రిశక్తుల క్రమాభివృద్ధి వివరణే 'కళారూపకం'. ఆ రూపాన్ని పెద్దలు, కళాకారులు, కళారాధకులు శివం అన్నారు. ఇంకా అంగముల వేల్పు, ఆకులు, చర్మాలు కట్టినవాడు తాండవ నటుడు అన్నారు. కాలానుగుణంగా అట్టి శివారాధన అంటే నటనం, భంగిమ ముద్రలు అసుర, దానవ, యక్ష, రాక్షసాది ద్రావిడ జాతులనుండే ఆర్యులు నేర్చుకొనిరి. (జగత్కథ పేజీ 129) నాగరిక జాతులను కలుసుకొను వరకు ఆర్యులకు లేఖనము తెలియదు. వారికళారూపాలే వారి వాఙ్మయము.

ఆర్యులీ తెలుగు బిడ్డల మధ్య కొచ్చిన నాటి న్నుండి ఆరోగ్య కరమైన, ఆనందకరమైన అడుగు, చిందు, గంతు, కుప్పీలు, మాళ్ళు, పల్టీలు, మొగ్గలు, గడలపై కెక్కి ఆడే డమ్మరాటలు, (జిమ్నాస్టిక్సు) ఎన్నో జాతి ఆటల భంగిమలు మరియు, మానసిక శారీరక పుష్టికోసం, కండరాల బలం కోసం సాధన చేస్తూ వచ్చిన సూర్య నమస్కారాలు, దండేలు, బస్కీలు, వ్యాయామ కసరత్తులు, ఆసన ముద్రలు మొ॥ నవి చూచి నేర్చుకొని సాధన చేస్తూ వచ్చిన ఆర్యులు వారి కళాకారులు, ఆయా ముద్రలు భంగిమలు తెలివిగా రతిక్రీడలో ఉపయోగపడునట్లే, అందాలు చూపునట్లే వాటినిగా మలచి మార్పులు, చేర్పులతో ఈ వ్యభిచార నాట్య, నటన తెలుగు బిడ్డలకు నేర్పు తున్నారు.

వ్యాయామ, (ఆసనాల, స్కరస్) భంగిమల పోలిన నాట్యభంగిమలు








(నాట్యశాస్త్రము పేజి : 87-107)

పాదాసనము, పాదమస్తకాసనము, ముక్తహస్తాసనము, తాడాసనము, వాతాయాసనము, సభకెదురుగా నిలబడి అందాల అంగాల చాటు మాటులను చూపేందుకు అర్ధాసనము, శలభాసనము, సిగ్గులు చూపగా సిగ్గుపడే కన్నెపిల్లలకు నేర్పుగా ఓర్పుగా నేర్పుతున్నారు ఆర్య కళా పండితులు.

ముఖ్యంగా హనుమాన్ బస్కీలను ఎక్కువగా నేర్పుతున్నారు. అంటె మడిమలు గట్టిగా కరిపించి, ముందుకొచ్చేట్లు బిగించి కట్టిన కుచములు ప్రత్యేకంగా కనిపించేట్లు వెన్నుబాగా వెనక్కు విరిచి, మోకాళ్ళు కొంచెం వంచి తెరచి మడమలపై కూర్చోవటం, చూచే వారి పుర్రెల్లో ఊహలెలా వుండేవో నేను వ్రాయనవసరం లేదు. ఇప్పటికి యీ ముద్రలీ ఆటలో చూడవచ్చు, చూస్తున్నాం.

సభకెదురుగా కాళ్ళుచాపి మొగ్గ వాలటం, చేతులపై నడవటం, నేలమీద డబ్బులను కనురెప్పతో, పెదవులతో తీయటం యీ నటనను నిన్న మొన్నటి వరకు భోగ మాటకత్తెలు మేజు వాణీల్లో చూపించారు. మనం చూస్తూ గుటకలు మింగాము.

ఆడామగా వేషాలు వేసుకొని పడక గదిలో సిగ్గు వదలిన, బిడియం తీరిన దంపతులు, ప్రేమికులు, పడుపు కత్తెలు చేసే చేష్టలు, పల్లుద్దాలు బహిరంగ వేదికల మీద రతిక్రియలతో సహా నటించ ప్రోత్సహిస్తున్నారు, నాట్య పాఠశాలల్లో నేర్పుతున్నారు, నాటి నాట్య పండితులు.

''అద్దాల ఘల్లుమన్నాయ్ - ముద్దు ముద్దు గుంటలున్నాయ్
ముందు వెనుక చూడకోయ్ - రాహో రాహో రా !
మెత్త మెత్త పరుపులున్నాయ్ - మల్లె పూలు పరిచి వున్నాయ్
మత్తు మత్తు మందులున్నాయ్ - రాహో రాహో రా !''

వెనుక లయ తాళ గతులతో పాటలు ఆలపిస్తుంటే, వేదిక మీద వెన్ను విరిచి ఎద్దైన చెలపెయ్యపై వచ్చే గేదె పడ్డల వలే నిలబడటం, ''రా అబ్బాయి రావేమీ'' అన్నట్లు ప్రేక్షక కుర్ర వాళ్ళను కళ్ళుతో, కనుబొమలతో, తలతో రమ్మనట్లు సంజ్ఞలు చేయుటం ''అయ్యో మగతనం లేదా!'' అన్నట్లు నోటి మీద చేయి వేసుకోవటం, పెదవులు కదపటం, మెటికలు, వళ్ళు విరుచుకోవటం, విరహ వేదన నటించటం నేర్పుతున్నారు తెలుగు, ఆంధ్ర కుర్రలకు ఆర్య నాట్య పండితులు.

శోభనపు గది కన్నా మిన్నగా ఉన్నవా వేదికలు. వన్నె చిన్నెలు వేదికపై శుషిర, ఆనర్థ వాద్య ప్రవీణులు తమతమ శృతులు కూర్చుకుంటున్నారు.

ఈ బూతు నాట్యాన్ని గోపికా క్రీడయని, గొల్లకలాపమనీ, శృంగార లీలలని, రతిక్రీడా వినోదమని ప్రచారం ప్రారంభించారు.

బంగారు గండపెండెర, సింహతలాటకాది బహుమతులాలంకృతులు, నటనా గురువులు, వాత్స్యాయన కామ సూత్రనటనా సిద్ధాంత రచనా పండితులు, జనపదాలకు ప్రత్యామ్నాయంగా జానపదాల జావళీల కవులు, కథా రచయితలు, ముందు వరుస ఉచితాసనములపై, రాజులు, రాజబంధువులు పరుపులపైన, ఆ వెనుక పని మనుషులు, పాలి కాపులు, నిగామానులు, ఆ వెనుక దీనులు, దరిద్రులు, అలగా జనులుగా క్రిక్కి-రిసున్నది సభ.

**పాడిందే పాట - ఆడిందే ఆట ;** అన్నట్లు కురులు దువ్వి ముచ్చట ముడులపైన మూరెడెత్తున పూలు చుట్టారు. పిర్రలపై జడలు పొరాడుతున్నాయి. ముక్కుకు ముక్కెరలు, బులాకులు, కమ్మలు, జూకాలు, చెంపసరాలు, జిగేల్ మంటున్నాయి. ముఖ్యాంగాలన్ని స్పష్టంగా కనిపించేట్టుగా పల్చటి రంగురంగు వస్త్రాలు శరీరాలకు అతికించారు.

మూరెడు జరీపేటంచు కావాలని తయారు చేయించి దాన్ని కుచ్చిళ్ళ రూపంలో మడిచి విడివడకుండా గట్టిగా నొక్కిపెట్టి, పై భాగాన దారంతో కట్టి బొడ్డు క్రింద మర్మాంగం కనుపించకుండా కట్టి , రెండు ప్రక్కలా తొడల దగ్గర అతికిన గుడ్డకు పిన్నులు కుట్టారు.

హనుమాన్ బస్కీల్లో కొద్దిగ మార్పులు చేర్పులు చేసి, నడుమున చేతులానించి పొడుచుకొచ్చినట్లు కట్టిన కుచాలను ముందుకు బాగావచ్చునట్లు వెన్ను విరిచి, మడిమల మీద మోకాళ్ళు తెరచి కూర్చోవటం లేవటంలో ఈ పేటంచు మడత తమాషాగా ముడుచుకోవటం, విచ్చుకోవటంలో ఏదోఅనుభూతితో చూచే వారిలో ఏదో ఉబలాటం కలుగుతుంది.

అర్ధనగ్న సుందరులు కుచాలు కులికిస్తు, కాటుక కళ్ళు గీటుతు, ఓరచూపులు చూస్తు, తల మెడ 'నాకిష్టమే! నీదే ఆలస్యమన్న' ట్లు ఆడిస్తు, రా ! అన్నట్లు పెదవులాడిస్తు నటిస్తుంటే కుర్రకుంకలు వెర్రెత్తి పోతున్నారు.

ఈ హంగులు పింగులు నీవేరా !<br>
ఈ అందం చందం నీ దేరా !<br>
ఆగలే కున్నానురా - వేగి పోతున్నానురా<br>
రారా ఆక్రమించుకోరా - అదిమిపట్టుకోరా !

అని పాడుతు, నటిస్తు గుండ్రంగ తిరుగుతు పరుగెత్తి పదేపదే పిలుస్తుంటే, వేద పండితులు వెర్రి వాళ్ళయ్యారు, పరమ నైష్ఠికులు భ్రష్టుపట్టారు. తపః సంపన్నులు తల్ల క్రిందు లయ్యారు, సచ్చరి త్రులు పిచ్చివాళ్ళయ్యారు. పిపీలికాది బ్రహ్మపర్యంతం ఏ జీవి నైనా ఆశలు రేపేవీ ఆటలు. ఆడించేవీ ఈ రెండేననేవి చారిత్రక సత్యం.

సభలో సందేహాలు, సహనాలు చచ్చాయి. చాటు మాటుల్లేవు, ఇష్టాయిష్టాలు కానరావు. ఈడుజోడులు, అందచందాలు చూడకళ్ళులేవు. కులం స్థలం గుర్తురావటం లేదు. సంతానదండె చేతబట్టి మునుల భార్యల మీదికెగబడిన శివునికన్న, కూతురు పై కెగబడిన బ్రహ్మ కన్న, రాముని పై కెగబడిన సూర్పణఖ కన్న, విశ్వామిత్రుని పై కెగబడిన మేనక కన్న, ప్రవరుని పై కెగబడిన వరూధుని కన్న ప్రజలు, పడుచోళ్ళు తెగిడిసిన తెగువతో ప్రవర్తిస్తున్నారు.

శ్లో ॥ తం కామ సూత్రా । నాగరిక జన సమ
వాయచ్ఛ । ప్రతి పద్యేత ః

(వాత్స్యాయన కామ సూత్రాలు పేజీ 51)

అర్థం ॥ తం - కామ - సూత్ర - అనగా రేతస్సు నటన నడుపు నట్టి రతిక్రీడను నడుపునట్టి, అలసట జెందినట్టి.

అనాగరిక - అనగా సభ్యత లేని నగర ప్రజలు, శ్రమ జీవులు.

జన - అనగా భూస్పృశులు, భూమిని దున్ని పండించు వారు, వ్యవసాయపనిముట్లు రూపొందించువారు.

సమ - అనగా పశు సమాన బానిసలు, విద్యావిహీనులు.

అచ్ఛ - అనగా నిర్మలమైన , పవిత్రమైనట్టి, దేశమంతటను ప్రజలందరిలోను, వ్యాపించుచున్న అధిక సంతాన సృష్టికార్యాన్ని వాయప్రతి

పద్యేత - అనగా రాజశాసనం వ్యాపించుచున్నది అనగా పరిశీలించుచున్నది.

తా॥ అంటే ఈ అధిక సంతానాన్ని కనే పుణ్య కార్యక్రమం ప్రచారం చేస్తున్న నాట్యాన్ని రైతులు, కూలీలు, బానిసలు ఎలా ఆచరణలో పెడుతున్నారో 'రేతస్సు' రతి క్రీడనెలా జరుపుచున్నారో రాజశాసనం శ్రద్ధగా పరిశీలిస్తున్నది.

''లోక యాత్రా'' (వా.కా.సూ. పేజీ - 52)

లోక - అనగా గ్రామ గ్రామాల జన సమూహము

యాత్రా - అనగా అధిక సంతానం కోసం పాటు పడే పుణ్య కార్యక్రమంలో అలసిన పుణ్య కార్య కర్తలకు, దేశభక్తులకు 'మధువు' 'మధ్యం' మాంసాదులను, నోటికంపు బోవుటకు తాంబూల విడియాలు, లవగం బెరడులు, శరీరం కంపు తొలగించుటకు, పూలు, సెంట్లు, సుగంధ ద్రవ్యాలు ఏర్పాటు జేస్తుందీ రాజశాసనం. ఈ పూర్తి తంతునే యాత్ర . అంతేగాదు—

చదువరుల కోసం సంపన్నుల కోసం, ఉన్నత వర్గాలకోసం, మునులకోసం, సన్యాసుల కోసం, బ్రహ్మచారుల కోసం అధిక సంతాన పుణ్య కార్యోన్ముఖుల కోసం, పెద్ద పెద్దల కోసం గర్భాలు చేయించుకొనువారి కోసం, చేసేవారి కోసం గుడిశల కన్నా మిన్నగా గుడులు కట్టించిరి. రాజ శాసనం వీటికి గర్భాలయాలు, గర్భగూడులు అని నామకరణం చేసింది. అంతేగాదు -

ధర్మ కార్యమైన యీ సంతానకార్యంలో పాల్గొనే సుఖభోగుల కోసం పందిరి మంచాలు, పట్టెమంచాలు, పరుపులు, దిండ్లు, పంఖాలు, పట్టుదుప్పట్లు అమర్చారు. మరియు అల్పాహార పానీయాలు, పండ్లు, ఫలాలు, వీర్య స్తంబన గులికలు, ఊర పిచ్చుకల లేహ్యాలు సమకూరుస్తున్నారు. అంతేగాదు -

గర్భగూడుల్లో కాలుబెట్టి సిగ్గుపడే, బిడియపడే స్త్రీలకు, అమాయక కుర్రాళ్ళకు పడుచులకు, కామ క్రియలను, రతిక్రియలు, వ్యసనాలు కలిగించే మాటలు, చేష్టలు నేర్పే **'గుడిచేటి '** పడుచులను, **మన్మథులు** అనగా మగకొజ్జాలను నియమించింది సైనికసభ. (నాట్య సిద్ధాంత గ్రంధమనదగినట్టి వాత్స్యాయన కామ సూత్రాలు పేజీ 92-100లో శ్లోకాలున్నవి. వాటి వివరణే ఆంధ్ర వాచస్పత్యం ఇలా చెప్పింది.) అంతేగాదు -

ఇలా రతి క్రీడా భంగిమల, చిల్లగొండి చిలిపి చేష్టలు, కృష్ణుడు సత్యభామ, శివుడు, పార్వతి, విశ్వామిత్ర మేనకా ఇత్యాది దేవుళ్ళ దేవతల పేర్లతో కామకలాపాలు, శృంగారాలు నటించునట్టి **'విటచేటి '**, **'గుడిచేటి '** నాయికలను నిర్ణయించారు ఆర్య కవి కళాకారులు. వారికే **అష్టనాయికలనే** పేరు కూడా నిర్ణయించారు. వారే ఈక్రింది తెల్పినవారు.

**విరహోత్కంఠిత** - అనగా తనను కామించిన విటుడు వేళకు రాకపోతే ఏర్పడే లక్షణాలను పాడుతూ నటించునది.

'జావళి' అనే పాట -

ఉదా॥ నడిరేయి గడిచేనే - చెలియ

రాడాయెనే స్వామి - నా స్వామీ

ఎదురూతెన్నులు - చూచి చూచీ - చెలియా

వానికై వేచి వేచి - నడిరేయి

గగనాల నెల రేడు - దిగజారి పోయే

సిగలోని విరులన్ని - వడివాడి పోయె ॥ నడి ॥

**అభిసారిక** - అనగా విటుడి కోసం రహస్య స్థలానికి వెళ్ళే ప్రయత్నంలో ఏర్పడు లక్షణాలు నటించుతూ పాడునది

ఉదా ॥ కాపురమ్మా క్రొత్త - గడుసుది మా అత్త

బావ మాచెడ్డోడు - బైట గొళ్ళెం బెట్టి

పారివచ్చినాను - తలుపుగొడతాడే మొ

**విప్రలబ్ధ** - అనగా రమ్మన్న రహస్య స్థలానికి తానొచ్చినపుడు 'రంకుమగడు' ఆచోటులో కనబడనప్పుడు ఏర్పడే లక్షణాలను నటించుచూ పాడునది. (క్షేత్రయ్య పేజీ - 199)

మోసమాయెనే - నాబుద్ధికి మోసమాయెనె

మోసమాయె ఏమిసేతు - మ్రొక్కి వేడిన రాడె చెలీ

కనలమాయెన య్యోచెలి - మోసమాయనె

ముందుకునే నెవరి పొందెడ బాసితినో

అందుకునే నిల్లాగైతినో ఓ చెలియ - మోసమాయనె.

**ఖండిత** - అనగా పాత ఉంపుడు గత్తెను తను విడిచి, సరికొత్త దానితో తిరిగి, మళ్ళీ తన దగ్గర కొచ్చాడని తెలిసి నప్పుడేర్పడేలక్షణాలను నటించునది. (క్షేత్రయ్య పదం పేజీ-5)

ఇంక నిన్ను బోనిత్తునా - యిభరాజవరదా

శకరాణిచేతనీ - సుద్దులెల్ల విన్నట్లాయె - ఇంతెనిను

నవ్వులాటనుకున్నవేమో - నాపద్దు చూడు మీ సారీ

జవ్వనమెల నీ పాలు జేసి - చాలనమ్మి యున్నందుక

ఎవ్వతి నో కూడి వచ్చి - ఇప్పుడు లేదని బొంకేవా ॥ ఇంక ॥

**స్వాధీనభర్తృక** - అనగా ఇంకొక దానింటికెళ్ళి, దాన్ని మరిగి నట్టి తిరుగుబోతు కొన్నాళ్ళకు మళ్ళీ వచ్చి తనకే లోబడినప్పుడేర్పడే లక్షణాలు నటించి పాడునది-

(క్షేత్రయ్య పదం పేజీ - 135)

చెలమేల చేసేవురా - చక్కని సామి
చెలమేల చేసేవురా - చెక్కెర మోవి
ఆననిచ్చి జల జాక్ష - నన్నాదుకోరా ॥ చల ॥

**ప్రోషిత** - అనగా తన్ను ఉప్పు, పప్పు కావలసిన వన్నీ ఇచ్చి పోషించే వాడు, ((కన్నెత్యా చేరిగిన వాడు) రాగానే మనసార రమించి క్రీడించు లక్షణములు నటించి పాడునది - (క్షేత్రయ్య పదం పేజీ - 15)

రారా అయ్యలూ రారా
రారా నా వలపు వారక
మించెరా నా సామి - రారా
ఎంత సేపని తాళు దానరా - ఓరి
ఇంక నా వశము గాదు నీ యానరా
చెంత జేరికెమ్మో వానరా ! నన్ను
చింతలు బెట్టేది మానరా - నాసామి - రారా

వీరు గాక 'వాసకసజ్జిక' 'కలహాంతరిత' ఇద్దరున్నారనీ , వీరే ఎనమండుగురు నాయకురాం(డని (నాట్య వేదంలో జ.మా. శర్మ గారు) వ్రాసిరి.

వెనుక పాటున ఉంచుకున్నతను వచ్చి వెనకగా కండ్లు మూసినట్లు, ఆమె కుచములను చేతులతో కప్పుకున్నట్లు నటించాలి. మరియూ అతడు చిలిపి చిల్లగొండిగా చీరెలాగినట్లు, నటించి దీపమార్పినట్లు నటించాలి. వాడువంగి తనకాళ్ళు పట్టినట్లు, అప్పుడామె అతనికి లొంగిపోయి నట్లు నటించాలని నాట్య శాస్త్రంలో పి.యస్. ఆర్ గారు వ్రాసిరి.

కనుక ఆర్యులు తమకు ఊడిగం చేసేందుకు కావలసి, ప్రజాభివృద్ధి కోసం, కవులు, కళాకారులు, గాయకులు, మంత్రవేత్తలు, చిత్ర కారులు మహాపండితులు, ప్రజల చేత అధిక సంతానం కనించే ప్రయత్నంలో శక్తికి మించి కృషి చేశారు. ఇప్పటికి చేస్తున్నారు. అవి ఏమంటే -

1) పాతాళ గంగను ఎలాంటి పలుగు పారా లేకుండా పైకి దెచ్చి దప్పిక తీర్చుకున్న నాటి తెలుగు ప్రజల శ్రమను, విజ్ఞాన శాస్త్రాన్నీ వివరించే కళా రూపమే **'జలక్రీడ'**. అయితే దానిని కొలనుల్లో స్నానం చేసే ఆడ పిల్లల కోకలెత్తుకు పోయి కొలను గట్టుపై పొన్నచెట్టెక్కి, ఆ నగ్న ఆడపిల్లల చూస్తున్నాడట 'కృష్ణుడు' అనే దేవుడు. ''పొన్నచెట్టు పైన పోకిరి కృష్ణా! చీరెలివ్వరా చిలిపికృష్ణా'' అని పాడుతూ ఆడటమనే కల్పిత కట్టు కథ రూపొందించారు ఆర్య కవి 'కళాకార్లు'.

2) రావీ, జువ్వీ కర్రల రాపాడించి చేతులు బొబ్బలెక్కి చితికి నీరు, రక్తాలు కారినా లెక్క చేయక నిప్పు సృష్టించుకుని, మండే కట్టెల చేత బట్టి నెగళ్ళు ముట్టించి చలినుండీ కృరమృగాల నుండి కాపాడుకున్న ఆట పాటయే **'దీపావళి', 'సంక్రాంతి' 'తాండవ'** నటనలు. దానిని **'దక్షయజ్ఞం'** పేరుతో, కల్పిత కట్టుకథలల్లి ఆడమని శాసించారార్య పండితులు.

3) 'మశ్చ కూర్మ వరాహశ్చ ' నేడు డాక్టర్లు గర్భస్థ మానవపిండాలను పరీక్షించి ఇలా అమరుకుంటున్నవి జీవుల తొలినాటి ఆకారాలని నిర్ణయిస్తున్న ఈ యంత్రయుగంలో కూడా ఈ జీవశాస్త్రాన్ని 'దేవుని' 'దశ' పది అవతారాలుగా కల్పిత కథలు ఆడుతున్నారు. (ఇప్పటి కీ ఆట ఆడుతున్నారు మతాంగనల వారసులైనట్టి దేవదాసీలు)

వీరికి తోడు శిల్పులు, చిత్రకారులు, చేతులు ముడుచుకు కూర్చున్నారా ? లేదు లేదు. తమవంతు పాత్రగా రంగురంగుల రంగరించారు, కుంచెలు కులికించారు. ఉలుల ముల్కులు సవరించారు. గర్భగుడుల్లో గోడలపైనా గుడుల లోపలివైపున నగ్న, అర్ధ నగ్న సుందరుల ఆకారాలు, అవయవ నిర్మాణ అందాలు, వంపు సొంపులు, ఏరంగు ఎక్కడ నప్పుతుందో అక్కడ ఆయా రంగులద్దు తున్నారు చిత్రకారులు.

శిల్పాల రధాలపై, గుడిగోపురాలపై, రచ్చబండలపై సుందర మతాంగనల నగ్నచిత్రాలు ఒకరినొకరు పట్టుకున్నట్లు, ఒకరిపై నొకరు పడుకుని, నిల్చుని, మొగ్గవాలి, మోకాళ్ళూ చేతులు, నేల కానించి, మగ చేటీలపైనెక్కి పశులవలె రతిక్రీడ నటిస్తున్నట్లు చెక్కుచున్నారు. ఈ విధమైన చెక్కుళ్ళు మంగళగిరి, పొన్నూరు వగైరా ప్రదేశాల్లో చూడవచ్చు. (ఈ బొమ్మలను వాత్స్యాయన కామసూత్రాలు పేజీ లు 120-124 పుటలలో వున్నవి.)

నాడు భగవదాలయాలన్నీ రతిక్రీడా సంగమాలు, వసతి గృహాలేనని, గర్భగుడులన్నీ బూతుపనుల నిత్యసోపానాలేనని, శోభనపుగదులేనని తన 'దేవాలయాలమీద బూతు బొమ్మలెందుకు ?' అనే పుస్తకంలో తాపీ ధర్మారావు (తాత) వివరించారు.

గర్భగుడుల్లో గర్భాలు చేయించుకోపోయిన, పురుషులు చేయుటకు ప్రయత్నించక పోయినా దేశద్రోహం ప్రజాద్రోహంగా భావించారని తన గ్రంథం 4 వ పేజీలో తాత వ్రాశారు. కళారంగమే కాకుండా పిండి వంటలు, వస్త్ర భూషణాలు, వగైరాలు కూడా రతిక్రీడా కార్యక్రమాన్ని బలపరచేవిగా వున్నాయంటారు తాత.

బెల్లం,పంచదార కడ్డీలు పొడవుగా ఎందుకుండలి ? గారెకు మధ్యలో కన్నమెందుకు? అరిశ బూరె పొంగే రీతిలో పాక మెందుకుండాలంటారు తాత.

తాళిబొట్టుకు రాగి ఆకు ఆకారమే ఎందుకుండాలి ? దాని మధ్యచిన్న బుడి పెందుకు? అతివలు నిద్రలేవగానే దాన్ని కళ్ళకద్దుకునే ఉద్ధేశమేమిటంటారు తాత.

గుడిచేటి బిడ్డలను, విట చేటి బిడ్డలను కులం గోత్రం వీలుగాని, తండ్రెవరో చెప్పలేని లేకివాళ్ళ సంతానాన్ని, ఇలాంటి పన్నెండు రకాల సంకర సంతానాన్ని చట్ట బద్ధం చేశారు. పెండ్లికాని కుర్రల, దిక్కుమాలిన బిడ్డలను కూడా భార్యాభర్తల సంతానంతో సమానమని శాసించారార్య ప్రభువులు. (ముక్కామల నాగభూషణం గారు - శతావతారాలు పేజీ 43 లో వ్రాశారు.)

శ్రమ ప్రాతిపదికపై నిర్మించుకుంటు, అభివృద్ధి మార్గంలో, ప్రగతి పధంలో ప్రజల నడిపిస్తున్నట్టి జాతి కళలైన బవని, యక్షగానాలను వాటి వాద్యాల, శృతి నాదాల చూడరాని వారుగ, చెప్పరాని వారుగా నిషేధించారు. ఆ నిషేధాజ్ఞలు ఖచ్చితంగా అమలు పరచకపోతే మీకు బ్రతుకులు లేవు, ఆధిక్యతలు లేవనట్లు శాసించారార్య పురోహితులు. సామ, దాన, భేద, దండోపాయాలతో తెలుగు ప్రజల సాహిత్య సంస్కృతి చరిత్రలు, సర్వమానవ లక్షణాలతో పాటు లాగి వేశారు. నిరంకుశ రాజ్యంగా మార్చి వేశారు (రూబెన్ పేజీ 107 లో ఉన్నది.)

## 29. కళకు అంపశయ్య - గణికకు పూలశయ్య

రంగురంగుల తెర తీశారు రంగస్థలం మీద 'నగ్న' 'అర్ధనగ్న' మతాంగనల చూచిన ప్రేక్షకులు బిత్తర పోతున్నారు. ఏమిటిదని ఆశ్చర్య చకితులవుతున్నారు కులస్త్రీలు.

సిగ్గుకా! సింగారానికా చీరెలు ? అందుకే అన్నారు ''సిగ్గు దీస్తే రాజకూడని'' ఈసడించు కుంటున్నారు వృద్ధ మాతలు. శీలవంతుల శిరస్సులొంగి పోయాయి. మానవతులకు మాటలే లేవు.

పోకిరీ కుర్రల పోకిళ్ళు , ఈలలు, ఆకతాయి పడుచోళ్ళ అల్లర్ల మధ్యన, పిల్లన గ్రోవులు, శంఖులు, కొమ్ము బూరలు, మధుర నాదాలు మ్రోగాయి. మతాంగనలు తమ మృదు మధుర కంఠాలు శృతులతో మేళవించారు.

శ్లో ॥ ఆంగికం భువనం యశ్యవాచికం సర్వ వాఙ్మయం
ఆహార్యం చంద్ర తారాదితం వందే సాత్వికం శివం ॥

అనగా

''ఎవనికి భువనం ఆంగికాభినయమో, ఎవనికి వాగ్ రూపకమైనది వాచికాభినయమో, ఎవనికి చంద్రతారకలు ఆహార్యాభినయమో అట్టి సత్య ప్రధానుడగు శివునకు నమస్కరిస్తున్నాము'' (అభినయ దర్పణం) అన్నారు ఆ మాతాంగనలు.

''ఆపండాపండి ! మీ ఉద్దేశములు, ఆట పాట కళారూపం ఉద్దేశములు అవికావావండి. మీ ఉద్దేశములు జాతిని తప్పుదారి పట్టించేవిగా వున్నవా వండి'' అన్నారు మన తెలుగు కళానుభవ కాలజ్ఞానులు.

**ఆంగికం** - అనగా పృధివ్యాధి పంచభూత ప్రకృతి సర్వ జీవరాసుల యొక్క , సమాజము యొక్క, అందు ముఖ్యంగా నరుల యొక్క, ఆహార ఆత్మ రక్షణాది ప్రాధమికావసరాలు, బ్రతుకు దెరువు మార్గాన్వేషణలు, కోర్కెలు దీర్చునట్టి పరిశ్రమలు, అభివృద్ధి మార్గాలు, ఆడి పాడే వాటి నుండి, ఆడి పాడవలసిన వాటిని, చూస్తున్న వింటున్న, వాటి నుండి చూడవలసిన, వినవలసిన వాటిని, చేసే పరిశ్రమ నుండి, చేయవలసిన పని పాటలను, సులువు మార్గాన్వేషణలను, విజ్ఞాన శక్తి సామర్ధ్యాలను ప్రదర్శించుట, అంగాంగముల ఆడుతు, పాడుటే ఆంగికా భినయమని మనజాతి యక్షగాన నిర్వచనం''. (ఆం.వా.స్పత్యం)

హనుమాన్ బస్కీలను పోలిన నాట్యభంగిమలు













(నాట్య శాస్త్రము పేజి : 87-108)

**వాచికం** - అనగా ప్రకృతి జీవరాసుల నిత్యా వసరము లందు, ఆపదలందూ ఆహార ఆత్మరక్షణాది ప్రాథమిక అవసరములందు వీటన్నింటి సంకేతాలు, సౌజ్ఞలు చేయుధ్వనులు, కూయు కూతలు, సందర్భసిద్ధి కనుగుణంగా సాధన చేస్తూ ధ్వనుల, శబ్దాల, నాదాల నుంచి అక్షరాలు. అక్షరాల నుండి పేరులు, వాక్యాలు, వాక్య సంకలనముతో వ్యాకరణ శిక్షితమైన భాషను సృష్టించి ప్రకటిస్తున్న వాగాంగాల కృషియే వాచికాభినయం అని యక్షగాన వాస్తవ నిర్వచనం.

**ఆహార్య** - అనగా పశుపక్షి మృగ జీవరాసుల వంటిపైని పుచ్చులు, పొడలు, చారలు, ఈకలు ధరించి, మెరిసే చర్మాల, గోళ్ళు, కోరలు ధరించి, రంగురంగు ఈకలు, కొమ్మలు ధరించి, ఆయా పశుపక్షి మృగ జంతువుల రీతి, పోలికలు, చేష్టలు, అరుపులు, కేకలు వేయుటు రాతి గొడ్డలి, వుండేలు బద్దా, బరిశె, ఈటె, విల్లంబు కాలానుగుణంగా వాడుకుంటున్న పనిముట్లు చేతబట్టి , ఆడి పాడినదే ఆహార్యాభినయం అని తెలుగు యక్షగాన నిర్వచనం.

శ్లో ॥ ''చంద్రతారాధితం వందే సాత్వికం శివం'' ॥

**చంద్రతారాదితం** - అనగా మనుగడకు వెలుగు చూపునట్టి, ఉన్నతమైనట్టి, కఠినమైనట్టి, ప్రధానమైనట్టి కోర్కెల, వాంఛల, వందలాది అవసరముల తీర్చునట్టి.

**సాత్వికం** - అనగా తనయొక్క, సమాజ గణ జీవుల యొక్క సుఖదుఃఖాలను, నవభావాలలాను, కోర్కెలను పరిష్కరించునట్టి.

**శివం** - అనగా ఇచ్ఛాశక్తి,కోర్కెలు, పరిశ్రమ శక్తి, పనులు, శక్తివంతమైన విజ్ఞాన శక్తి, ఈ త్రిశక్తుల కధినాయకుడా! త్రిశక్తుల ఏకీకృత నాయకుడా ! శివం వందనం , అభివందనం. (అని ఆంధ్ర వాచస్పత్యంలో ఈ శ్లోకానికి అర్థము ఉన్నది).

(అందుకే ఆ తెలుగు కళా అనుభవకాలజ్ఞానులు) ''ఓ ఇంద్రా ! ఓ సూర్యా ! ఓ ఆర్య పండితులారా ! శ్రమ ప్రాతిపదికలపై నిర్మించుకున్న కళల వాస్తవ నడకలను కళా ప్రయోజనాలను, సర్వం సహా వుండకూడని విధంగా మార్గాలను సృష్టిస్తున్న యీ నాట్యం వద్దు.

''ఎన్నటికీ మేమీ అశ్లీల నాట్యాన్ని అంగీకరించము. అధిక సంతానోత్పత్తికి, జనాభా పెరుగుదలకు మరో ప్రత్యామ్నాయ మార్గాన్ని వెతుకుదామని'' బవని, పంబల, ఝుంకుల, యక్షులాది తెలుగు కళాకార్లు, విరూపాక్షాది పెద్దలైన తెలుగు కళా అనుభవకాలజ్ఞానులు వ్యతిరేకించారు.

అదివిన్న ''అసుర, దానవ, ద్రావిడ, యక్ష, రాక్షసాది పెద్దలారా! కళాకారులారా! ఈ నాట్యోద్దేశం కేవలం ''గర్భాదానసంకల్పం'' మాత్రమే!అడుగులు మీ నుండి నేర్చినవే. ఆటకత్తెలు కూడా మీ తెలుగు ఆడపడుచులే" అన్నది సైనికసభ.

''దేశరక్షణా, ప్రజాక్షేమం దృష్ట్యా ఈనాడు అధిక సంతానం కలగటం కోసం ప్రజలనుత్సాహపరిచే, ప్రోత్సహించే రీతిలో ఈ నాట్యం ప్రభువుల ఇష్టానికి, అవసరాలకు అనుగుణంగా రూపొందించబడింది. ప్రభువుల ఆజ్ఞ పాటించుట సైనిక సభ భాధ్యతంది'' సైనిక సభ.

''ఓ మతాంగన లారా ! ఆర్య ప్రభువుల మాట పాటించుటే మీ యొక్క మా యొక్క విధి కనుక మీ కార్యక్రమాన్ని ప్రారంభించండి'' అన్నది సైనికసభ . ఇంద్ర, సూర్య, వరుణ మేళతాళాల మధ్య, సైనికాధిపతుల పర్యవేక్షణలో సాగింది. ఆటపాట అభినయాల నాట్యం.

''చిన్న బిడ్డలేని స్త్రీ చక్కదనమేరా - అమ్మలారా
సంతులేకున్న సత్‌గతుల్లేవంద్రూ - అక్కలారా
కొడుకులు గన్నమ్మ కడుపేమి కడుపూ - అమ్మలారా
కులముద్ధరించని కొడుకేమి కొడుకు - అక్కలారా
సంపదలనడగరే - తకిట తకధిమి ధిమిత ధిమిధిమి
సంపదలనడగరే - సంతు నడిగొదరమ్మ - అమ్మలారా
సంతానమే పేద ప్రజకు సంపద - అక్కలారా
బిడ్డలా గన్నమ్మ - బిచ్చమెత్తినమ్మ
చెడిపోదోలమ్మ - చెడిపోదోలక్క
బిడ్డల గనకున్న - గొడ్రాలంటారే ॥ అమ్మలారా ॥

కుర్రవాళ్ళ గురించి జానపదాలు -

రంభలా గున్నాను - కుర్రవాడా
రంగూపింగూ చూడు - అందగాడా
మల్లెపందిరి క్రింది - ధిమిత ధిమిధిమి
మల్లెపందిరి క్రింద - మంచమేసుంచాను ॥ అందగాడ ॥
రమ్మంటే రావేర - రవ్వచేసే వేర ॥ కుర్రవాడ ॥

మరో పదం -

చూపుడు కళ్ళూ - వాపుడు మొఖాలు
ఎద్దులందమే - పనిలో మందమే
మడిమలు తొక్కే - మోజే కానీ
మడిదొక్కే మగ సిరి లేదక్కా

మరోపదం - కన్నుగీటితే కౌగిలించెదా - సై
వెన్నిరిస్తే వళ్ళో వాలెదా - రా
ఈ లావు దొబ్బుడు గాళ్ళకూ - సై
కోకంత ఎత్తాలంటనే - రా
రంగు పింగు చూడనురా
రంకాడ జంకు తావేమిరా - కుఱ్ఱాడ
సందెకాడ గోడ దూకి - భళి భళి
సందు వాకిట వచ్చి పోరా - మొనగాడ

మరో జానపదం - ''గున్న మామిడి మానుచాటున
తక్కధిమిధిమి ధిమిత ధిమ్‌ధిమ్
కన్నుగొట్టీ - కాముడొచ్చెను
కొసరికొసరీ - కోరినాడె
కోక ఊడగ - గుంజినాడే''

ఇదంతా కనివిన్నటువంటి తెలుగు కళాపండితులు ఆర్యులతో

''సైనికాధి పతులారా ! నాట్యకత్తెలారా ! మీరు తెలుగు తల్లి బిడ్డలేననీ, యక్షగానం విన్న విజ్ఞులింట పుట్టామనీ మరచి నారమ్మా ? కడుపు కక్కుర్తికోసం కేవలం అలంకరణల ఆనందం కోసం ఇంతగా బరితెగించుట భావ్యమా అమ్మలారా ?''

''ఓ ఇంద్రాది సైనిక నేతలారా ! తెలుగు జాతి ప్రజలు, దీనులై , దరిద్రులై మీకు బానిసలైనంత మాత్రాన ఇంతగా తెలుగుజాతి శాశ్విత పతనానికి పూనుకోవటం భావ్యం కాదు .''

శ్లో ॥ స్నేహమిచ్ఛా మహీనాట్యం ॥ (నాట్యవేదం పేజీ - 18)

నేస్థ - అనగా - స్నేహ, వాత్సల్యములను

ఇచ్ఛ- అనగా - వాంఛలా, కోరికలను

ఆ - అనగా చంపునట్టిదీ, లేకుండా చేయునట్టిది.

మహీ- అనగా సర్పం సహో

ఈ - అనగా కపటములతో కూడినట్టి

నాట్యం - అనగా ఈ నాట్యం (అని ఆంధ్ర వాచస్పత్యములో అర్థమున్నది)

తా॥ ''ఓ సైనికాధి పతులారా ! మానవులలో స్నేహ, వాత్సల్య అభిమానాలను చంపునట్టిది నాట్యం. కుటిల కుతంత్రములతో కూడినట్టిదే ప్రజలకు కూడూ, గూడు, నీడా దొరుకు మార్గాలను చూపలేనట్టిదీ నాట్య నటన.''

శ్లో ॥ ''అలంహో మన్యునాదైత్య **విషేధంత్యాజితాన్ - అనర్థూ**'' ॥

అలంహో - అనగా అనర్థ దాయకమైనట్టిదీ, నిషిద్ధ చర్యలతో నిండినట్టిది (నాట్యం.)

మద్యునా - అనగా క్రోధ, ఈర్ష్యా ద్వేష పూరితమైనట్టిది (నాట్యం.)

దైత్య - అనగా దైత్య, దానవ, యక్ష , రాక్షస , విరూపాక్షాది తెలుగు పెద్దలకు, సభ్యతాప్రజలందరకు, కళాకారులకు, నీచనడవడి నేర్పుటే గాక

''ఓ ఇంద్రా ! నీచాతి నీచమైనట్టి పనులందు, చర్యలందు వర్తించునట్టి రసస్థాయి భావములందును ప్రవర్తించునట్టి తిరుగుబోతులను, వ్యభిచారులను గావిస్తున్నది నాట్యం.''

ఓ ఇంద్రా ! తదత + ఆ - అనగా తెలుగు దేశ ప్రజలలో ఆబాల వృద్ధులందును చంద్ర తారకలున్నంత వరకూ కయ్యములు, కార్పణ్యములు, ఈర్ష్యా ద్వేషములను మనందరి మధ్య ఆరిపోనివ్వనిదీ నాట్యం-కనుక మనకొద్దీ నాట్యం - అనగా అది విని

ఓ యక్ష విరూపాక్షాది పెద్దలారా !

శ్లో ॥ ''కర్మభావాన్వయాపేక్షా - నాట్య వేదోమయాకృతా''॥

కర్మ- భావా - న్వయాపేక్షా } అనగా మీ మా వంశ ప్రజల అభివృద్ధి చేయుటకై సంతాన సృష్టి మార్గముల వివరించుటే ఈ నాట్య ముఖ్య ఉద్దేశ్యము.

నాట్యవేద - ఇది మాత్రమే ఈ నాట్య ఉద్దేశ్యము.

ఓమయ - అనగా భగవత్ వగైరా మర్మాంగములన్నింటి చాటు మాటులు దాపరికాలూ తోసివేసి మీ స్త్రీ పురుషులు.

ఆకృతం - అనగా జనాభివృద్ధికై సామాన్య ప్రజల సంఖ్యాబలాన్ని పెంపొందించుటకై రతిక్రీడా విధానాలను రచించుటే యీ నాట్య ఉద్దేశ్యము (అని ఆ॥ వా॥ స్పత్యంలో అర్థముంది.)

''ఓ తెలుగు స్త్రీ పురుషులారా యీ నాట్య కత్తెలు తాము తమ ప్రజల, వంశముల సంఖ్యాబలం కోసం, సంయోగ ఉధృత తాండవ క్రీడాంశములతో నిండిన, ధాత్వర్థక్రియల అభిరుచులను, ఆనందములను ఆడుట, పాడుట తమ యొక్క ధర్మంగా భావిస్తున్నారు'' (నాట్య వేదం పేజీ 24లో జమ్మలమడక మాధవరామ శర్మ వ్రాసిరి)

''ఓ తెలుగు ప్రజలారా ! మీ మేలుకోరి మీ వంతాంగనలు క్రీడాంశములను నటించుటకు సిగ్గూ, లజ్జా, భయభక్తులు, సామాజిక మానవతా లక్షణాలను, కట్టు బాట్లను, సర్వమానవ మర్యాదలను ధైర్యంగా ఎదిరించి సాటి స్త్రీలకు గర్భధారణ కవసరమైన 'ఇంద్రియ' అవసరం కొరకు యువకులకు ఉత్సాహం, ఉబలాటం కలిగిస్తున్నారు''.

''బలమైనట్టి వీర్యాన్ని కూర్చుయవకుల , పురుష శ్రేష్ఠుల , వీరులకు పుష్టినిచ్చు ఆహారములు, పండ్లు, పాలు, వెన్న, రొట్టె మొదలైన భోజన పానీయాలు సమకూర్చాలని'' సైనికసభ పెద్దలు ఇట్లెన్నో సలహాలిస్తున్నారు. (నాట్యవేదం పేజీ - 16) అనగా అదివిని

''ఓ ఇంద్రా ! ఓ సూర్యా ! అధిక సంతానావసరం మీకళ్ళు మూసింది. మీ మనో నేత్రాన్ని కప్పివేసింది. ఈ నాట్యం కలిగించే కష్టాలను, నష్టాలను, మామాటల్లో నిజాన్ని గుర్తించే మీ యోచనాలోచన శక్తిని అరికట్టింది అధిక సంతానవసరం.''

శ్లో॥ ''దత్తవంతం ప్రహృష్టాసె మృత్యుతే భ్యోది వేకన ః
ఏవం ప్రయోగే దైత్య దానవ నాశనం'' (పేజీ 17 -18)

దత్తవంతం - అనగా ఇష్టం లేనిదీ, ఈ దేశ దైత్య, దానవ, యక్ష , రాక్షసాది పెద్దలకు, ప్రజలకు, తెలుగు కళాకారులకు మనోవ్యధ కలిగించునది (నాట్యం)

ప్రహృష్టాస్తే - అనగా మిక్కిలి జగుప్సు, అసహ్యం పుట్టించునది (నాట్యం)

మృత్యుతేభ్యో- అనగా కాకి మరణ ప్రదమైనది, కౄరమైనది, భయంకరమైనది, ఆకస్మిక మరణ ప్రధమైన బోధనలు చేయునట్టిది (నాట్యం.)

దివాకన :- అనగా మనోవికారములతో హృదయములను కఠినమైనట్టి పరిణామములనొందించు (నీ నాట్యం.)

ఏవంప్రయోగే - అనగా ఈ అసహ్యకరమైన పెద్ద ప్రయోగం ప్రారంభించారు.

ప్రారబ్దే - **అనగా మీప్రయోగం మా ప్రారబ్ధమనుకుంటున్నాము.**

దైత్యదానవ నాశనే - అనగా దైత్య , దానవ మానవాళికి, ప్రజలకు చేటు తెచ్చునది (నాట్యమని రుజువగు చున్నది.)

అని విరూపాక్షాది దైత్య , దానవ, రాక్షస త్రిలింగ దేశ ప్రముఖులు ఉద్రేకముతో ''నీతి మంతులైన ప్రజలారా ! మనమిట్టి జుగుప్సాకరమైన నాట్యాన్ని సహించకూడదు, చూడకూడదు, దారుణమైనట్టి అశ్లీల సాహిత్యాన్ని,బూతుల గానాన్ని వినకూడదు. లెండులెండని'' విజృంభించి నాట్యకత్తెల చేష్టలను, నటనలను, శృతులను, చర్మవాద్యాలను పాటకులనోళ్ళను మూయించిరి. (నాట్యవేదం పేజీ 12.)

అంతట ఇంద్రుడు లేచి రౌద్రాకారుడై పట్టరాని కోపాన రత్నాలు పొదిగిన ధ్వజమును బట్టి నాట్య విఘ్నకారులందరిని ''ఝర్జరీకృతం''గావించెను. అనగా శిధిలము చేయపూనెను. చావు తప్పించుకొనగా అనేకులు కీకారణ్యాలకు పారిపో సాగిరి.

''ఓ ప్రజలారా ! ఘన నాట్యమును వ్యతిరేకించే వారందరికీ ఇదే గతి పట్టును జాగ్రత్త'' అని ఇంద్రుడు హెచ్చరించెను.

''ఓ నాట్య కత్తెలారా ! నేటి నుండి మీ నాట్యామండపాలందు, మీ నటనలను, గానాలను, సైనికాధిపతుల, ప్రముఖుల పర్యవేక్షణలో యమదండధరులు, త్రిశుల పాణుల, రక్షణతో జరుపు '' మనెను. (నాట్య శాస్త్రం పేజీ - 13)

ఈ విధంగా ' ఏనాడైనా నిరంకుశ పాలక వర్గాలు తామాక్రమించిన దేశీయుల సాహిత్యం, సంస్కృతులు, నడవడి, ధైర్యసాహస కట్టుబాట్లను సమూలంగా వాటి రూపనామ క్రియలు లేకుండా నాశనం చేస్తే తప్ప, తమ తాలూకు నిరంకుశ సంస్కృతిని, బానిస భావాలను, వారిలో పోతపోయుటకు, వాళ్ళ నెత్తిన నయానా భయానా రుద్దుటకు వీలుండదు' అనేది ఈ నాట్యం రుజువు చేస్తున్నది.

(గ్రీకు, రోము, ఈజిప్టు వగైరా ఇలాగే పూర్వ నాగరిక దేశాల్లో ఆవరించి విజయుల య్యారార్యులు.)

అనుభవ కాలజ్ఞానాన్ని, విజ్ఞానుల... ఒణగద్రొక్కి, ఆధ్యాత్మికకాలజ్ఞానాన్ని, అవిజ్ఞానులను ఆకాశానికెత్తారు. పురహిత వర్గీయులు, అంతస్సారమును అపహాస్యం జేసి దైవచింతన సర్వరోగ నివారిణి అన్నారు.

జాతి ఐక్యతకు, కుల ఎక్కువ తక్కువలు, ఉచ్చనీచాలనే చిచ్చుముట్టించారు. విచక్షణాజ్ఞానాన్ని, ఆత్మబలాన్ని అరికట్టే మతం మత్తు మందు గుప్పించారు. కళల పేరుతో ఈ చర్యలు సహించలేక ఝుర్జరీ హింసలు భరించలేక, ఆర్య పాలనే గిట్టనట్టి గరుడ, గంధర్వ, కిన్నెర, యక్ష, రాక్షసాది సభ్యతా ప్రజలందరు పర్వత ప్రాంతాలకు పారిపోయిరి. (నాట్య వేదం పేజీ - 10.)

## ౩౦. కాళిదాసులు - కామకతలు

ఈనాట్యాన్ని బలపరచినట్టి కావ్యాలు, పురాణాలు పెద్దపెద్ద కవులు, ఋషుల పేర్లతో ఆర్యపండితులె కల్పించారు అవే 'పంచకావ్యాలు'. వాటి పేర్లు కుమారసంభవం, కళాపూర్ణోదయం, మేఘసందేశం, మొ॥వి.

క్రీ॥ పూ॥ 500-600 ఏండ్లనాడు భరతముని ఉన్నాడా ? కాళిదాసు ఉన్నాడా ?! వీళ్ళేవరూ లేరని, ఈ కవుల పేర్లతొ ఆర్యపండితులే వ్రాసుంటారని భావిస్తున్నాను. అసలు భరతుడనగా రాగయుక్తంగా స్వరస్థానాల కూర్చువాడు అని అర్థం ఉన్నది. ఇక కాళిదాసనగా-

కాళి - అనగా హంసుడు రాజు, సార్వభౌముడు,

దాసుడు - అనగా వెలకుకొన్న జ్ఞాని. (ఆం॥వా॥ స్పత్యంలో)

కనుక కాళిదాసనగా ఆర్య సార్వభౌముడు మూల్యమిచ్చి కొన్నజ్ఞాని అని అర్థం.

ఇక పంచకావ్యములనగా-

పంచకం - అనగా ! ఇంద్రియమని, ఇంద్రియ విషయములని

కావ్యమ్ - అనగా ! కవికల్పించినది (ఆం.వా.స్పత్యం)

అనగా శృంగార, ప్రేమ, కామ, రతిక్రీడల పేరుతో వ్రాసిన ఈ వ్యభిచార ప్రోత్సాహక బూతుల పంచాంగాలను వాణి ప్రసన్నుడైన,సరస్వతీ ప్రేరితుడైన కాళిదాసు వ్రాయలేదు. ఆర్య సార్వభౌముడు మూల్యమిచ్చి కొన్న జ్ఞాని వ్రాసాడు. వాత్స్యాయన కామసూత్రాలనే నాట్య సిద్ధాంత నడవడుల బలపరుస్తూ సరస్వతీపుత్రుడనే కాళిదాసుని పేరుతో ఆర్య పండితులు కల్పించిన కాకమ్మ కతలలో ఒకటి కుమారసంభవం.

**కుమారసంభవం :**

ఇక కుమారసంభవం తెలిసిన చదవలేం. కైలాస వన భూముల్లో ఏనుగుల సమూహం రమించుకునే రతక్రీడ చూచి పార్వతి శివునితో ''హే నాధా ! ఆడా మగా యేనుగుల వలే మీరూ నేనూ రతిక్రీడ జరుపుకుందా'' మని పార్వతి భూమిపై చేతులానించి ఎదైన ఏనుగువలే వెన్నువిరువగా వెంటనే శివుడు మగ ఏనుగువలె రతిక్రీడ నటించాడట (పేజీ 33)

'శరణం' సరస్సులో సప్త ఋషుల భార్యలు దిశ మొలలతో స్నానాలు చేస్తుండగా 'అగ్ని' అనే కుర్రకుంక వారిని చూచి మోహించి వారి దరి దాపునకు వచ్చి దిశ మొలల అందగత్తెల చూచి భరించలేక వారి దగ్గరకు వెళ్ళాడట.

పాపం మునుల భార్యల్లో అరుంధతి దూరంగా వెళ్లిందట. మిగతా అమ్మాయిలకు మగ కుర్రవాడుగా కనుపించలేదట. మిగిలిన వారంతా అట్టానే వాడి దగ్గర కెళ్లి మోహాన్ని భరించలేని వాడు కౌగిలించుకున్నంతనే కన్నెలారుగురికీ కడుపులయ్యాయట. (పేజీ - 33)

రతీదేవి ఆ తరువాత నిప్పుల్లో దూకటం, పార్వతిగ పుట్టటం శివుడు తపస్సులో ఉండటం, పార్వతి తపః శివుని సేవికగా చేసే చేష్టలు కామ శృంగార కరముల పేర్లతో అందులో వున్నవి మీరే చదువుకోవాలి గాని శివపార్వతుల పేర్లతో నేను వ్రాయలేను.

వెంటనే క్రూర రాక్షసుణ్ణి దృంచమని దేవతలు ఇంద్రుణ్ణి వేడటం, ఇంద్రుడు ''శివపార్వతులకు ఇప్పుడు పుట్టిన బిడ్డ మాత్రమే రాక్షసుణ్ణి చంపగలడ'' నటం, ''దేవతలంతా శివునికి కామోద్రేకం కలిగించటం మన్మద కామ బాణాల వలన కలిగిన తాపానికి కామవ్యసనాలకు తట్టుకోలేక

మోవి యదరన్ మేనుపులకించెన్ ఆత్మలో సొలసెన్
రాగము, మోహము బొలసెన్

గండోల్లా సహా (ప్రభతపేజీ 62.)

వెంటనే శివపార్వతుల **భగ్ వంతాలు** విజృంభించటం, వెంటనే కుమారుడే పుట్టడం వాడికి అప్పుడే వీరత్వాలు, జవసత్వాలు, విద్యావిజ్ఞానాలు సర్వం అమరటం, రాక్షసుణ్ణి చంపటం.

బానిసలను, పేదసాదల బెదరగొట్టేవి, భయపెట్టేవి, అన్నీ వర్ణించి ''ఖబడ్దార్' ! బానిసలారా! బీదదరిద్ర అలగా జనుల్లారా! ప్రభల శాసనాలను కాదని ధిక్కరించే వారందరికీ ఇదే గతి పట్టు''నని హెచ్చరికతో కధముగిసింది.

కుమారుల గనుటకవసరమైన భంగిమలనే ముద్రబడినవి కనుక యీకావ్యాన్ని 'కుమారసంభవము' అనే పేరుతో పిల్చామన్నారు. (పేజీ - 3). అయితే ఇందులో మీరు గ్రహింపవలసినవి రెండు విషయాలున్నవి. ఒకటి భగవంతాలు విజృంభించటం, రెండు అందుకు మన్మధుడు బాణాలేయడం. వీటర్థాలు తెలుసుకొండి.

భగ్ - అనగా స్త్రీ యొక్క బిడ్డలు గనే అంగము

వత్ - అనగా స్త్రీ యొక్క బిడ్డలు గనే అంగములో వుంచబడిన పురుష అంగము

శివుడు - అనగ పురుషుడు (ఆం॥ వా)

మన - అనగా ఆత్మ - ఆత్మకుబహిరంగ రూపం వీర్యం

మీద - అనగా శ్రోణితవు - స్త్రీ నుండి సంతానానికుపకరించు ద్రవం.

పై అర్థాలననుసరించి చూస్తే 'శ్రోణితములను ఉద్రేకపరిచే వాక్యసుమ బాణములు కురిపించి విరహ తాపాలు కలిగించి రతి క్రీడకు వెంటనే తలపడేట్టు చేసే ఆడ అంగనలను 'విటచేటి' 'గుడిచేటి' లని అన్నట్లే, రతిక్రీడకు వెంటనే తలపడేట్టు చేసే మగవారిని సామాన్య ప్రజలు కొజ్జాలని, 'ఆడంగి రేకులోళ్ళు'' అని అంటుంటారు. ఇట్టి మగ వారినే నాటి పండితులు 'మన్మధుడు' అని అన్నారు. కనుక ఈ మన్మధుడనే కొజ్జా వాని మాటలనే బాణములతో, శివ పార్వతి భగవంతాలు ఏకమయ్యాయని వివరించే పచ్చిబూతు కావ్యమే ''కుమారసంభవం''.

## కళా పూర్ణోదయం

నలకూబరడు, కలభాషిణి, రంభ ఇందులో ప్రధాన భూమికలు. నలకూబరుడు, రంభల కామకలాపాలే, శృంగార చేష్టలే ఇందులోని అంశాలు.

''చెలువను కౌగిలించుకుని దట్టపు పూపొదరింట లోనికిన్జని జల్మినొంద ముఖాబ్జము పై చేయి నట పారద్రొబ్బే''

పై సాహిత్య అంతరార్థ మేమంటే 'నలకూబరుడు రంభ నెత్తుకొని కాసిన కందిచేలోనో, కంకులిడిన జొన్న చేలోనో దించి మొగం ముద్దెట్టుకోబోతే చేయడ్డు బెట్టిందట రంభ' అప్పుడా నలకూబరుడు పారద్రొచ్చాడట.

''పార(ద్రో)బ్బుడు మరీ ! పాపం పరపురుషుని మొగమెరుగని 'ముగ్ధబాల' గదా ! రంభ'.

'అప్పుడా నలకూబరుడు నొక్కించుక నాటునట్లు పళ్ళునొక్కెన్ అప్పుడా రంభ కంఠం నుండి ''మధురాంచిత శబ్దము నుద్భవించె'.

మధురాంచిత శబ్దమనటం మరీ విడ్డూరం. ఎందుకంటే పూజ్యులు, పుణ్యులు, యజ్ఞయాగాలు చేసినట్టి వారు, యతులు, ఏకపత్నీ వ్రతులు, యుద్ధ వీరులు, బుద్ధ జీవులు, అన్న దమ్ములు, అయ్యా కొడుకులు ఇట్లా ఎవరుబడితె వారు ఎక్కిదిగే వాహనం (సిటీబస్) లాంటిది కదా రంభ ? రాత్రింబవళ్ళు నిద్ర చాలక సొక్కి సోలినట్టి ఆమె కంఠం నుండి మధురమైన శబ్దం ఎలా వస్తుందండీ ! రాదు కదా రాదు. నీరసించిన మూలుగుడో, వేడి చేసినట్టి బొంగురు శబ్దమో వచ్చెనంటె బాగుండేది, వాస్తవం కూడాను. అది అలా వుంచండి.

అప్పుడా నలకూబరుడు 'కళలకంటి కరచె' - ఇది మరీ పచ్చిబూతు. నలకూబరుడు ఆమెను బట్టి, పెదవులో, చెక్కిళ్ళో కొరికాడట. (ఆమెకున్నవి కళలు ఏమిటి ? ప్రేత కళలంటె సమంజసం) అప్పుడా రంభ ''మది చివుక్కుమనగా నలకూబర విడువిడురా అలసితి'' అన్నదట. పోనీలేండి ! ఇది ఒక్కటైనా నిజం చెప్పారు.

పై విషయాన్ని బట్టి పరికిస్తే తొలి సెక్సు పుస్తకాలే పంచకావ్యాలేమో అనిపిస్తుంది.

## మేఘ సందేశం -

ధనికుడైన కుబేరుడు వాడి(వాట్టి?) ప్రక్క 'యక్షుడు' అనే కుబేరుని పనిమనిషి (ఇంట్లో బానిస.) అతని అందగత్తెయైన భార్య ఇందు ప్రధాన భూమికలు.

ధనికుడైన కుబేరుడు యక్షునిపైన ప్రేమానురాగాల, దయ తలచి తనకొలువులో ఉద్యోగ మివ్వలేదు . ఇది కుబేరుని కథనుబట్టి తెలుస్తుంది.

రాజాస్థానాల్లో సైనిక మనస్తత్వం కలిగినట్టి నిగామానులు, కొజ్జాలు, తప్పని సరిగా వుంటారు. అట్లానే కుబేరునాస్థానంలో ఇంద్రుడు, మన్మదుడు వున్నారు. వీరిద్దరి సలహాపై కుబేరుడొక రోజున యక్షుని పిలిచి, నీవు అందగత్తెయైన నీ భార్య కారణంగా కొలువునకు ఆలస్యంగా వచ్చుచున్నావు కనుక, నీవు ఒక సంవత్సరం నీ భార్య నిక్కడనే వుంచి నీవు ఒంటరిగా చిత్రకూటాద్రి పైనే ఉండాలని శాసించెను. అతని కున్న ఐశ్వర్యాన్ని, యోగ్యతలను తొలగించేశారీ దుష్టత్రయం.

చిత్ర కూటాద్రిపైన ఎనిమిది మాసాలు గడిపిన పిమ్మట వర్షాకాలం వచ్చింది. పర్వతం పైన మేఘాలు తారాడు చున్నవి. అది చూచిన యక్షుడు

ఓ మేఘుడా ! నా ఇల్లు, నా సతి కుబేరునింటి ప్రక్కనే

శ్లో ॥ కామార్తాహి ప్రకృతి కృపణాశ్చేతనాచేత నేషు ॥ (పేజీ 10)

మేఘుడా ! కామార్తులకు చేతనాచేతన జ్ఞానం ఉండదు. చేతనుడవైన నీచేత నాకామార్తిని నాభార్య కంపుతున్నాను. నామారుగా తెల్పుము.

శ్లో ॥ సంతప్తానాంత్వం మసేశరణం తత్పయోద ః ప్రియాం ॥ ( పేజి14.)

మేఘుడా ! సంతప్తులకు రక్షకుండవు. మేము విరహ సంతప్తులం-మా సంతాపమును తీర్చుము.

శ్లో ॥ స్త్రీణాం ద్విగుణ ఆహారోబుద్ధిశ్చాలి చతుర్గుణ ॥ - (పేజీ 20)

ఇక్కడ స్త్రీల సమూహము వున్మత్తులై, గుణహీనులై విషయ వాంచతో రతిక్రీడాభిలాషులై దూరము నుండియే 'రా' అని ఏక వచన ప్రయోగమున నీఛ పనుల కాహ్వా నింతురు.

శ్లో ॥ నజాతు కామ ః కామానాముపభోగేన కామ్యతి ॥ (పేజీ 19)

మేఘుడా ! ఇక్కడ గర్భము ధరించు ముహూర్త కాలజ్ఞానం ఎక్కువ. వస్త్ర భూషణాది అలంకరణయు ఎక్కువే ఇది దేశాచారము.

శ్లో ॥ తస్మిన్ కాలే నయన సలిలమ్ యోషితామ్ ఖండితానాం ॥

ఈ ఖండిత నాయకను గురించి నాట్య వేదంలోను వాత్స్యాయన కామ సూత్రాల్లోను ఉన్నది. వాటినే వీరు కాపీ సంగ్రహించారు.

కామినీ నాం - (పేజీ - 154)

ఎనమండుగురు అభిసారికా నాయికల గురించి వాత్స్యాయన కామ సూత్రాలో ఉన్నది. నాట్య వేదంలో కూడా ఉన్నది.

అభిసారయతీ కాంతల నాభవేత్ - (నాట్యవేదం - 112)

ఈ పంచకావ్యాలు గానిమరొకటి మరొకటి గాని అధిక సంతానాన్ని ప్రజల చేత కనించేందుకై కల్పించిన వాత్స్యాయన కామ సూత్రమనే సంతాన నాట్య సిద్ధాంత గ్రంధాన్నుండి కాపీ చేసిన (సంగ్రహించిన) భావాలు , భంగిమలే కాని పంచ కావ్యములంటే వేరే వీ లేవు.

ఆర్య పండితులు నాట్య సిద్ధాంతాలే కాదు కల్పించింది, వాటికి సంహితలు కూడా కల్పించారు.

శ్లో ॥ ''రజస్వలా పుష్కర తీర్థం - చండాలీతు స్వయంకాశి
చర్మకార ప్రయాగ ః స్వా - ద్రజిక మధురా మతం '' అయోధ్య పుంశ్చపీపోక్తాం - ఇది రుద్రయామల తంత్రంలో వున్నదని స్వామి దయానంద సరస్వతి సత్యార్థ ప్రకాశం పేజీ 317 లో వ్రాసిరి.

తా ॥ రజస్వలతో కలిసిన పుష్కర స్నాన ఫలమని, మాలస్త్రీతో కలిసిన కాశీ యాత్ర ఫలమని, చంఢాల స్త్రీతో కలసిన ప్రయాగ యాత్ర ఫలమని, చాకలి స్త్రీ తో కలిసిన మధురా దర్శన ఫలమని, వ్యభిచారిణి తో కలిసిన అయోధ్య ను దర్శించినట్లని (ఆం॥ వా) ఉన్నది.

శ్లో ॥ ''తత్రా సమాగతయో లింగజ్యోతనార్థం''

వాత్స్యాయన కామసూత్రాలు పేజి 18 లో వ్రాసిన రీతిగా నగ్న అర్ధనగ్న సుందరుల పాలిండ్లను, సొగసులను, కాలి మోవులను కంబుకంతాలను, పిక్కలు పిర్రలను, అంగాంగ వర్ణనలన్న, మొ॥ గు కామశృంగార వర్ణనలే, రాస్తారు ఆర్యపండితులు, అలారాయనిచో పట్టుశాలువాలు , పొట్టకు, బట్టకు లేని స్థితి వస్తుంది.

**ఇక-రుద్రయామల తంత్ర.సంహితం-** అనగా

రుద్రయా - భయమును తీర్చునది.

అమల - అనగా ఏమాలిన్యమూ అంటని పవిత్ర కార్యమైనది

తంత్రంసం - అనగా వంశాలు నిల్పునది, వృద్ధి పొందించుటకు మిక్కిలి ఉపయుక్తమైనది.

హితం - అనగా సమర్ధవంతమైనది.

(వేదభాష అంతరించి పోతున్న రోజుల్లో అందున్నట్టి మంత్రాలను భారత జాతీయ భాషైనట్టి సంస్కృతంలో వ్రాశారు. నాగరిక జాతులను కలిసే వరకు ఆర్యులకు లేఖనము తెలియదు (జగత్కథ పేజీ 144).

(నాడు అనగా క్రీ. పూ. 500 యేండ్ల నాడు వేద మంత్రాలను, సంహితలని, శతపద తాండ్య గోవధ బ్రాహ్మణాలని విభజించి, భారతీయ భాషల్లో వ్రాశారని భారతీయ పండితులభిప్రాయమని ఉప్పల లక్ష్మణరావు 'సందేశం' పత్రిక పేజీ 1 లో వ్రాశారు.)

కనుక ఇది ఆర్యపండితుల నాట్య సిద్ధాంతాల, సంహితలు అంతర్లీనమైయున్న 'పంచకావ్యాల అంతస్వరూపం. ఇవి ఏ కాలంలో వ్రాయబడ్డవో తెలియడం కష్టమని భావిస్తున్నాను.

## 31. కల్పిత రాతలు - ఘనమగుపేర్లు

వేదోపనిషత్తుల, మనుధర్మ శాస్త్రాల, పంచకావ్యాల పేర్లతో తెలుగు ప్రజలకోసం కల్పించిన విషాద కట్టుకథలెన్నో -

శ్లో ॥ రజకశ్చర్మ కారశ్చ నటోబురడ ఏవచ
కైవరత మేధ భిల్లాశ్చ పప్తైతే త్యాజాః స్మృతా ॥ అని
(మితాక్షరీ ప్రాయశ్చిత్త కాండ ॥ ఈ శ్లోకాన్ని
విజ్ఞానేశ్వర యతి రచించారట. )

రజిక - అనగా మనదేశంలో చాకలి-

చర్మకార - అనగా చర్మాల వలుచునట్టి, మాంసాహారులైనట్టి మాలా, మాదిగ, మంగలి, బోయ, మేదర, జాలరి, చెంచుల ఐదు తెగలు చేతి వృత్తి దారులను -

కైవర్తులు - అనగా మూడు కాలములను, ఆరు ఋతువులందూ వ్యవసాయ విధాన రీతులను, భూసాగు లక్షణాలను, పంటల అదును పదునులను ఇట్లా యెన్నో బ్రతుకు దెరువు మార్గాలను కవితల్లో పొందుపరచి వివరించు వారని - (వీరే యక్షగాన గాయకులు, పదపదార్థ విజ్ఞాన ప్రభోధకులు, యక్షులని ఆంధ్ర.వా.స్పత్యంలో అర్థమున్నది.)

నట - ఓ- అనగా ఆట, పాట, లిపి, చదువులు, వ్రాయుట సంభోదనా గుణములు కల్గిన వారని -

స్మృతి - అనగా సొంత ఆలోచనలు, అభిప్రాయాలు, ఆచరణలో రుజువులున్న ధర్మశాస్త్రములు ఔన్నత్యములున్న ఆత్మశక్తి వంతులైనట్టి వారు -

ఆ-ఆమ్- ఏ- అనగా రోషావేశాలు, స్వయం అంగీకారముల, ఇష్టాయిష్టాలు, విజ్ఞాన వికాస తేజస్సులున్న- (వీరందరిని చెప్పరాని వారుగ, చూడరానివారుగ, తాకరాని వారుగ, నిషేదించారు ఆర్య ప్రభువులు, వారి పురహిత వర్గాలు)

కిల-తు- అనగా స్వజాతి ప్రజలతో నిత్య సంబంధాలు, ఐకమత్యాలు, నిద్రసుఖాలు శుభాశుభాలు-(నిషేదించారు.)

తా ॥ అంటే, చాకళ్లు, మంగళ్ళు, మాల,మాదిగ, జాలరి, చెంచు తెగలన్నింటిని అంటరానివారుగా నిషేదించారు. యక్షగాన గాయకులను, మంచి చెడులు చెప్పగల వారిని నీతి ధర్మ శాస్త్రాలు, సొంత ఆలోచనలు, జాతి సత్ సంబంధాలు, నృతులు, నాదాలు, స్థాయిలు, జాతిగానాలు ఇవన్నీహేయమైనవని, నీచాతి నీచమైనవిగా భావించి విడిచి పెట్టాలని శాసించారు ఆర్యపండితులు.

శ్లో ॥ చండాలా ద్వివిధా అంతరా బాహ్యాశ్చ

అంతరాసి ద్వివిదా ః తత్ర ప్రదమే అద్వా ః

(హేమాద్రి ప్రాయశ్చిత్తఖాండ - శ్లోకం - 52)

చండాల - అనగా నిషేదింపబడిన ఏడు తెగలను వారి వంశాలను–

ద్వివిధా - అనగా వారిని పిలుచుటగాని, తాకుటగానిఒరే, ఒసే అనాలంతే నని–

అంతార - అనగా సంఘం నుండి విడగొట్టబడిన వారుగాను –

బాహ్యాశ్చ - అనగా బహిరంగముగా సంఘము నుండి వెలి వేయబడినట్లు స్పష్ట పరచినవారినిగా -

అంతరా - సి- అనగా వూరికి దూరంగా, బహిర్భా ప్రదేశాల్లోకి నెట్టివేసి ప్రత్యేక గూడేల్లో వుంచాలి–(ఆనాటివే నేటి మాదిగ్గూడెం, మాలగూడాలు, చాకలిగూడాలనినే భావిస్తున్నాను.)

ద్వివిధా - అనగా రెక్కలను, శరీర శ్రమను, శరీరాలనే అమ్ముకొను కూలీలు, పాలేళ్లు, జీతగాంద్రుగా -

తత్ర - అనగా ఊరికి దూరంగా - చాలా దూరంగా–

ప్రధమే - అనగా ముఖ్యంగా గూడేల్లో, గుడిశల్లో, శరీర శ్రమను, శరీరాలను అమ్ముకొనుట ముఖ్య బ్రతుకు దెరువుగా ఊరికి దూరంగా బ్రతకాలని శాసించారార్య ప్రభువులు–

అద్వాహ - అనగా ప్రజాక్షేమం కొరకు (ఈ శాసనాలు చేశామన్నారు - పండితులు, సైనికసభ)

శ్లో॥ ఏతేవి ప్రర్యర్జ్యా ః ప్రయత్నతహ ॥ (తైత్తైరీయ ః)

ఏ - తె - అనగా నిషేదించబడినట్టి వీళ్ళందరినీ

విప్ర :- అనగా పురహిత బ్రాహ్మణ వర్గీయులందరూ -

ఐ.వర్జా :- అనగా తమక్షేమం కోసం ॥శివం॥ తమ కోరికలు, తమ పరిశ్రమలు, తమ విజ్ఞాన శ్రేయస్సు, ఆధిక్యతల కోసం యీ నిషిద్ధుల వాద్యాల, కళల, నాదాల, వాద్యాల, మూడు స్థాయిలను నాదాలు, తోసిపుచ్చుటకు - (విప్రులు, పురహిత బ్రాహ్మణ వర్గీయులు)

ప్రయత్నత : అనగా గట్టిగా ప్రయత్నించవలెన (ఆం. వా ॥)

నిషేధించినట్టి ఏడు తెగల వారిని సంఘం నుండి విడగొట్టి, ఊరికి దూరంగా ప్రభూవులు నిర్మించినట్టి గుడిశల్లో, గూడేల్లో, శ్రమ శక్తి నమ్ముకొని కూలీలుగ, పాలేళ్ళుగ, జీతగాళ్ళుగ బ్రతుకునట్లు ఆర్యులు శాసనాలు, చట్టాలు చేశారు. జాతి కళాకారుల గతి ఏ విధంగా వుందంటే -

పంబలోళ్ళని, బైనీడోళ్ళని, పిచ్చి గుంటళ్ళని, ఝుంకులోళ్ళని, ఒగ్గులని , వికృత పేర్లతో పిలువబడుతు, ఎరుక గద్దె సోది చెప్పే వారుగా జేగంట లయగా కొడుతు, వీరణం కొడుతు, దేవర పెట్టెతో వీధుల్లో ఇళ్ళ వెంట భిక్షకులుగా యానాది భాగవతులుగా బ్రతుకుసాగారు.

దేవ చెంచు, కృష్ణ చెంచు, యానాది చెంచు, ఎరుక చెంచు, కోయచెంచు అని పిలువబడుతు నాడు మందులు అమ్ముకున సాగారు.

ఢక్కల , డమ్మర, మాష్టీనులుగ, బుడుబుడుకలపేర్లతో 'భూస్వాశుల' చూర్లు బట్టుకు వేళ్ళాడు తున్నారు. ఇక పాపం రైతులేంచేస్తారు ? పోళ్ళు గొట్టి బీళ్ళు దున్ని సాగు చేసిన పంటభూములన్ని భూపతులు, వారి తాబేదార్లు వారి ఏజెంట్లు కాజేశారు. రైతులకే తిండి లేదు 'దిశమొల్లోడా కళ్ళు కట్టోడికి కప్పమనట్లు' బ్రతుకు తున్నారు యక్షగాన గాయకులు. పద పదార్థ విజ్ఞాన ప్రభోదకులు అనుభవ కాలజ్ఞానులూ యిలా చావలేక ఇళ్ళ వెంట భిక్షకులుగా బ్రతుకు సాగారు.

తమ శ్రేయస్సు సుఖాల కొరకు ముఖ్యంగా తమ అధిక్యతలు నిల్పుకొనుట కొరకు నిషిద్ధులను, వారి కళలను త్రోసిపుచ్చుటకు, ముట్టకుండుటకూ పురహిత ఆర్య వర్గాలన్నీ గట్టిపట్టుదలతో ప్రయత్నించి సాధించారు. అది నేటికీ భారతదేశంలో ఈనాటికీ ఈ నిజం కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నవి.

తమ వేదమంత్రాలు లేకపోతే శుభముహూర్తాల్లేవా ?

తమ వేద మంత్రాలు లేకపోతే పెళ్ళిళ్ళు అసలు జరగవా ?

తమ వేదమంత్రాలు లేకపోతే మనం కట్టిన గుడిలోకైనా

మనం తెచ్చిన బొమ్మైనా ఆ గుళ్ళోకి పోతుందా!?

ఒకవేళ మనం గుళ్ళో పెట్టినా అది దేవుడౌతుందా !

బ్రాహ్మలు సెటగోపురంతోనో, చెప్పుతోనో

మాడున కొట్టందే మోక్ష మొస్తుందా !?

దీని భావమేమి తిరుమలేశా ?!

గ్రీకు, ఈజిప్టు, ఈజియను వగైరా పూర్వ నాగరిక దేశాల్లోవలెనే, మనదేశంలోను మనదీ అని చెప్పుకొనుటకు వీలులేకుండా మన మానవతాలక్షణాలు, సభ్యతలు వెతికి వెతికి స్వరూపాలతోసహా నాశనం చేశారార్య ప్రభువులు వారి సైనిక సభ.

నిరంకుశంగా రాజ్యమేలే ప్రభువుల యొక్క సంపూర్ణ నిరంకుశాధికారం సాగటానికి అవసరమైనట్టి మనస్తత్వాన్ని కల్పించి ఆ యొక్క మనస్తత్వాన్ని సామాన్య ప్రజల్లో వ్యాపింపజేయటానికి అగ్రవర్ణాలకు చెందిన మేధావులైన బ్రాహ్మణులను ఎంచుమందురు. ఎందుకనగా వారి అగ్రస్థానం అవిచ్ఛిన్నంగా నిరాటంకంగా సాగిపోతుందని సందేశం వారపత్రిక పేజీ 5, 6 లో శ్రీయుత వుప్పల లక్ష్మణరావుగారు వ్రాసిరి.

ప్రసిద్ధ చరిత్ర కానీయండీ, జరిగిన వాస్తవ చరిత్ర కానీయండి సఫలీకృతమైనట్టి, అమోఘమైనట్టి సత్ఫలితాలిచ్చి నట్టి చరిత్ర కానీయండి, అది ఎంతగొప్పదైనా, ప్రత్యక్షంగా జరిగినట్టి చరిత్రలను కళారూపాల్లో, ఇతివృత్తాలు, విషయాలుగ, కథలుగ ఎన్నడు, ఏ పరిస్థితుల్లోను ఆడకూడదు, పాడకూడదు ఇది ఆర్య నిభంధన. ఎందుకనగా గడచిన కాలంలోని మంచి చెడులను అనుభవించినట్టి జనాలకు **రాగద్వేషాలు** కలుగును. మరియు శ్రేణికి, తమజాతి మొత్తానికి చెందిన సాంప్రదాయ కర్తవ్య నిర్వహణ, ప్రయోజనము, యధార్ధ సత్యస్వభావములు కలుగును. (నాట్యవేదం పేజీ - 19) తాత్పర్యం పొందలేరు.

ప్రజల్లో కలిగే యీ **రాగ ద్వేషాలు, తధితన్య** లంటే ఏమిటో వివరిస్తాను.

రాగాల్ - అనగా బాధలు, క్లేశాలు, శోకాలు వగైరా అవస్థలు

ద్వేషాల్- అనగా ప్రజల కొచ్చిన బాధలు, శోకాలు ఏ కారణంచేత కలిగినవో ఆ కారణములపైనా, వాటిని కలిగించిన వారిపైనా విరోధ భావములు, క్రౌర్యములు పెచ్చు తిరుగుబాట్లకు పూనుకొనుట.

కనుక శ్రమ జీవుల కీతి బాధలు కలిగించే ప్రజలకు ప్రభుల శత్రు వర్గాలపై పగ దీర్చుకొను చర్య లెదురౌటా, అట్టి రాగ ద్వేషా లెదురైనట్టి బానిస ప్రజలు, శ్రమ జీవులు, **'తాధాత్మ్యం'** పొందలేరు (నాట్య శాస్త్రం - పేజీ -21. పి.యస్.ఆర్)

తా - ధా- త్మ్యం అనగా

తా - అనగా కరుణ, దయ, దాక్షిణ్యం

ధ- అనగా ధర్మభిక్షం, అనగా చాకిరి చేయించుకున్నవారు బానిసకు దయదలచి వేసే పిడికెడు భిక్షం, భత్యం.

ఆత్మ - అనగా నిత్య బ్రతుకు దెరువులకై తిండీ, బట్ట, కొంప, రోగాలొస్తే మందుల కోసం నిత్యం చేసే పనులందు, పరిశ్రమలందు మసిలే బానిసలు ప్రాణం.

యమ్ - అనగా 'కూలీ', దినభత్యం, నూకలు ఇచ్చినవి తీసికోక ఏమేమో గుణుస్తుంటారు, రుసరుసలాడుతుంటారు, చచ్చినటుల పడివుండరు.

- అంటే రాత్రనకా పగలనకా నిద్రాహారాలు మానుకొనైనా ఆర్య చక్రవర్తులకు, వారి కళాకారులకు, పురహిత బ్రాహ్మణపండితులకు, ఆరుగాలం ఆరుగాలం అరవచాకిరి చేసి నందుకు అయ్యగారిచ్చే ధర్మ భిక్షం కు దోసిలొగ్గి చచ్చిన కుక్కలవలే బానిసలుగ పడి ఉండరు. అని ఆంధ్ర వాచాస్పత్యంలో **రాగ ద్వేషాలకు, తాధాత్మ్యానికీ** అర్థాలున్నవి.

అందుకే వారు సృష్టించిన అల్లాటప్పా పాటలు, రతిక్రీడా నాట్యాలు, జనాలు పుట్టి పెరిగే యీ నాట్యాలు రాణించి ప్రజల్లో నిలవాలంటే నిరంకుశ పెత్తనం అవసరం. అంతేగాదు ముందుగా తెలుగు జాతి గ్రామ్యధర్మాలను, నిషేధించాలి. అందుకే సంభోధనా గుణములు, వాక్పఠిమలు ఉన్నట్టి అనుభవ కాలజ్ఞానులు ఆచరణ బుజువు లున్న ధర్మ శాస్త్రాలు, సంస్కృతి చరిత్రలు చదవరాదని, వినరాదని శాసించారు. వాటి నామ రూపాల్లేకుండా చేశారు. గ్రామ్య ధర్మాలనే సమూలంగా పెరికి వేశారార్య పండితులు.

ఈ గ్రామ్య ధర్మం ఆర్యులు వచ్చే నాటికి తెలుగు జాతిలో సంపూర్ణంగా ఉందని నే భావిస్తున్నాను.

అట్టి సామూహిక నడవడి కల్గిన గ్రామ్యవ్యవస్థ వ్యక్తి పెత్తనాన్ని అంగీకరించదు. ధనస్వామ్య విధానాలను పాలించ నీయదు. కనుక ప్రభువులూ, సైనిక సభా, బానిసలైన తెలుగు ప్రజలపైన రాజ నియంత్రణ అనే నిరంకుశ సైనిక చట్టాలూ, శాసనాలూ చేశారు. (నాట్య వేదం - పేజీ - 5)

జాతి రోషావేషాలనుం, పౌరుష వంతులనుం, ధైర్యసాహసులనుం, సామ, దాన, భేద, దండోపాయములతో అణచి వేశారు. జాతి ఐకమత్యాలూ, సహజీవ సంబంధాలూ, నిద్రాసుఖాలూ, శుభాశుభాలూ నిషేధించారు. ఇక తెలుగు జాతి కున్నది కేవలం బానిసత్వం మాత్రమే.

శ్లో ॥ ఏ-తే-షాం దర్శనం స్పర్శమ్ సంభాషణమ్

మతః పరః హేమాద్రి ప్రాయశ్చిత్త కాండ ॥ శ్లో 141

సామూహిక నడవడులూ, భూసాగు విధానాలూ, వృత్తి విభజనలూ ఇతి వృత్తాలుగా, కధలుగా, జనపదాలు గా పాడుతూ ఆడే హావ భావ రసములు నటించునట్టి జాతి కళాకారులనూ, యక్షగాన గాయకులనూ నిషేధించారు.

''సొంత సంస్కృతిని సృష్టించుకున్న భారతీయులు తాము సృష్టించుకున్న వాటిల్లో అధికాంశాలను ఇరుగు పొరుగు దూర దేశాలకూ అందజేయుట ద్వారా ప్రాచీన సంస్కృతికి విశేషంగా తోడుపడిరి''. (పా. ప్ర. చరిత్ర పేజీ 93)

ఇట్టి పవిత్ర తెలుగు జాతిని, సంస్కృతిని, సాహిత్యాన్ని నిషేధించారు ఆర్య సైనిక సభ, పురహిత బ్రాహ్మణులు.

## 32. దేవ దేవీలు - దేవ దాసీలు

దేవ స్థానాలలో, పెండ్లి పేరంటాలలో ఎనమండుగురు గుడిచేటి నాయికలు కామశృంగార జావళీలు, కీర్తనలు, పాటలు పాడుతు నిన్నమొన్నటి వరకు భోగం, మేళాలను కళావంతుల పేరుతో ఆటకత్తెలను నిషేధించే వరకూ రాజమండ్రి, పెద్దాపురం వగైరా పశ్చిమ గోదావరి జిల్లాలలో ఆట పాటలు చూచాను.

( గీతగోవిందం పేజీ - 26 ప్రదమ సర్గ)

అనేకమైన ఆడోళ్ళ కౌగిళ్ళూ - జిక్కు కొనగ జాలు
శృంగార చేష్టల - శక్తి వంతుడవంట.

స్త్రీల పాటలు పేరుతో వున్నవి.

''సరసజాక్షి నీ అధరము నొక్కిన
సారసాక్షి ఎవరోయి సామి
చెక్కిళ్ళకు నెలవంక లున్నవే
చెలియ కొరికి నాదోయీ''

మేలుకొలుపు పాటలతో ఉన్నవి -

''కాపురమా అత్త - గడుసుదీమా యత్త
నీ పుణ్యముంటుంది - నీవు పో గోపాల
చాలు ఆలూ రీతి - పాలుమా లేవర
వేళకాదిది లేచి - పో పోర నా సామి''

జావళీ పేరుతో వున్నవి -

''రేపు వత్తువు గానీ, తూరుపు తెల్లవారే
పోరా యీ వేళకు - గోపాలా
నాపతి జూచినా - రాపిడి చేయును
కాపురమ్మా ఇంక - కడగండ్ల పాలవును

మధురానగరిలో - చల్లలమ్మ బోదు
దారివిడుము కృష్ణా - కృష్ణా
కొసరి కొసరి నాతో - సరసములాడకు
రాజమార్గమిదే - కృష్ణా కృష్ణా ॥ మధు ॥

''చెరగు మాసె నేమిజేతురా
దరిజేరనైన వీలు గాదురా'' ॥ చెర ॥

ఈ భోగం మేళాన్ని ఈ శృంగార నాట్యాన్ని సంతానం కోసమే సంతానార్థులే తమ గృహాల్లో శుభకార్యాలందు ఏర్పాటు చేసేవారనీ 1500 ఏండ్ల నాటి వాడైన శ్రీ పానుగంటి చెన్నుశౌరి రచించిన 'సౌరభచరిత్ర' లో ఉన్నది.

ఈ సాంప్రదాయ నమ్మకంతోనే నూతన దంపతులకు త్వరలో సంతానం కలగాలనే కోరికతో ఈ నాట్యం యొక్క జన్మ వృత్తాంతం తెలియక పోయినా, ఈ భోగాలాటను ఆడించుట తెలుగు దేశంలో ఆచారంగా నిన్న మొన్నటి వరకున్నది.

గర్భాలు చేయించుకోవటం, చేయటం వగైరా బానిసావసర కార్యక్రమాన్ని ముగించారు. ఎక్కడితొక్కడిగా పిల్లల్నిపెంచుతున్నారు ప్రజలు. వెంటనే గర్భాలు చేయుటకై చేయించుకొనుటకై యేర్పాటు చేసిన **గర్భగుడులు, భగవదాలయాల** పేర్లు మార్చి వాటిని **పవిత్ర దేవాలయాలు** అని శాసించారు నాటి ఆర్యులు.

బిడ్డలగనే కార్యక్రమంలో వీర్యాన్ని పూర్తిగా ధారబోసి 'నపుంసకులైన' పురుష పుంగవులను, స్త్రీత్వాన్ని ఓపికను దారబోసిన మగువలను, స్వాములుగ, స్వామినులుగ, మార్చి దేవుళ్ళని ఆరాధిస్తు, విభజనలు జేస్తు, భక్తితో దేవుళ్ళను కీర్తిస్తు దేవాలయల్లోనే బ్రతకమన్నారు .

నాట్య విఘ్నకారుల పతనం చేసి, గర్భదాన కార్యక్రమంలో మత్తు పానీయాలు, తేనెలు, సుగంధ ద్రవ్యాలు, ఒనర్చినట్టి సైనికాధిపతులను ముఖ్యంగా 'ఇంద్రుణ్ణి' 'సూర్యుణ్ణి' 'వరుణ' లాది సైనిక సభానాయకులను దేవుళ్ళుగా ఊరేగించి దేవాలయాల్లో ప్రతిష్ఠించారు. పురహిత బ్రాహ్మణ వర్గీయులను దేవాలయాల్లో పూజారులుగా నియమించారు.

మతాంగనల పేర్లు మార్చి 'దేవదాసీలు' అని నిర్ణయించి దేవుళ్ళ ఉత్సవాల్లో, గ్రామ పెద్దల పెండ్లిళ్ళకు, శుభకార్యాలకు ఆడుతు, పాడితే నూతన దంపతులకు మగ సంతానం కలుగుతుందని, కనుక యీ నాట్యం తప్పనిసరిగా ఆడించాలని శాసించారు.

దేవుళ్ళందరకూ ఇంద్ర, సూర్య, వరుణులాది నూతన దేవుళ్ళ పేర్లతో మంత్రాలు కల్పించి జపిస్తున్నారు పురహిత బ్రాహ్మణులు. ఈ మంత్రాలలో దాసదాసీ శ్రమ జీవులకు, బానిస ప్రజలకు, పైకి తెలిసేట్టు ఒక అర్థం. పండితులకు, రాజకుటుంబీకులకు తెలిసేట్టుగా మరో అర్థాలు వేరు వేరుగా ఉండేట్టు కల్పించారు. ('రూడర్ఫ వరణ వాల్యుం' గొట్టింగ్స్ 195 లో వ్రాసిరి.) అంతే కాదు 'విపుల దేవాలయాలు, విగ్రహారాధనలు,

స్త్రీదేవతా పూజలు, ఆర్యుల ప్రాచీన వేద సహితలందు, ముఖ్యంగా ఋగ్వేద మందు లేవు. (జగత్కథ పేజీ 129 లో వ్రాసిరి.)

దేవదాసీలు, భోగమాటకత్తెలు, గణికెలు, ఈ నాట్యం ద్వారా కలవారి నాకర్షించి అక్రమ సంబంధాల ద్వారా సంపాదించిన ధనంతో ఈ కళామతల్లులు మెట్టన బావులు త్రవ్వించారు. పల్లాన చెర్వులు వేయించారు. ఎన్నో పుణ్యకార్యాలు జరిపించినట్లు చరిత్రలో వుంది.

ది. 9.7.1481 ఏండ్ల నాడు తిరుమల దేవస్థానంలో దానమిచ్చినట్లున్న శాసనంలోని 'జక్కులకన్నాయి' ఈ స్వామినుల, సాదుల, భోగమాటకత్తె కళావంతుల 'బిడ్డ'.

గుత్తితాలూకాలోని జక్కుల చెరువు, పెనుగొండలోని - జక్కుల చెరువు, పత్తికొండలోని - జక్కుల సానికుంట, హిందుపురంలో - జక్కుసముద్రము, బళ్ళారి జిల్లాలోని - జక్కుపూడీ, ఈ కళావంతులైన జక్కుల వంశస్తుల, భోగమాట కత్తెలు చేసిన పుణ్యకార్యాలేవారు త్రవ్వించిన చెర్వులు, వారి ఈనామ ఊళ్ళు. కామేశ్వరి నారాధిస్తు - కామ వంశస్తుల, కామ శృంగార కరణములను, అభినయిస్తూ, జీవిస్తున్నట్టి వారే - కళావంతులని, మద్రాస్ శృంగార గ్రంధమాల పేజీ - 97.102 లో వున్నది.

'కామవల్లి' 'మహాలక్ష్మి' కైటభారి వలపు పాటలు పాడుచూవచ్చే స్త్రీ జక్కుల పురంధ్రి అని క్రీడాభిరామం పేజీ - 25 లో వున్నది. యీమె కళావంతుల భోగమాటకత్తెలైన జక్కుల వారసురాలు.

'తంజావూరు','ఆంధ్రనాయకరాజులు', 'విజయరాఘవ'నాయకులు', 'వెన్నెలకంటి సూరన్న', విష్ణుపురాణం, తిరువమల చిత్రకూటమహాత్మ్యంలో శాహాజీ వినోదచిత్ర ప్రభంధములో 1600-1700 ఏండ్లనాటి పెక్కు గ్రంధాల్లో ఈ కామేశ్వరి ప్రశంసకలదు.

వాత్స్యాయన కామ సూత్రాలనబడే నాట్య సిద్ధాంత గ్రంధాల్లో, నాట్య శాస్త్రాల్లో, చరిత్ర గ్రంధాల్లో వర్ణించిన నాట్య మయూరీలంతా స్త్రీలు ,జక్కిణిస్త్రీ, జక్కుల పురంధ్రి, భోగమాట కళాకారిణులంతా స్త్రీలు, వారి వారసురాండ్రు. ఆది మతాంగన స్త్రీలు, ఈ నాడు భరతనాట్యమని, కూచిపూడి నాట్యమని, జానపదనాట్యమని ఆడేవారు. పురుషులు కూడా స్త్రీలుగా రూపు రేఖలు దిద్దుకోవటం, చీరె జాకెట్టు, నిక్కిన పాలిండ్లు, బారెడుజడ, వాటెడుపూలు, ముక్కుకు ముంగెర, చెవులకు జూకాలు, దండ కడియాలు, నాజూకు నటనలు, ఎన్నెన్నో స్త్రీలకన్నా మిన్నగా నటిస్తున్నారు.

దేవదాసీలుగ, కళావంతులుగ, భోగమాటకత్తెలు జక్కుల వారుగ పేరెన్నికగన్న నాట్యకత్తెలు, వాత్స్యాయన కామ సూత్రాల్లోని 'మతాంగనలు'. అంతేగాని యక్షగాన గాయకుల వారసులు మాత్రం కాదు కాదు.

యక్షగాన గాయకులీనాడు మనం నమ్మలేని నీచస్థితిలో వ్రాయబడి వున్నారు. యక్షగాన సర్వలక్షణాలను సమూలంగా తుడిచివేస్తేతప్ప ఆర్యులకి అధిక సంతానావసర బూతు నాట్యాన్ని తెలుగు ప్రజలలో ప్రవేశ పెట్టుటకు సాధ్యం కాలేదు. ఆర్యుల దుర్మార్గాన్ని గ్రహించిన యక్షగాన విజ్ఞానులు, గాయకులు, యువతీ యువకులు, దట్టమైన నట్టడవులకు పారిపోయి తలదాచుకున్నారనే యీ నిర్వచనాన్ని నాట్య వేదం మొదటి ప్రకరణ బలపరిచింది.

పారిపోయి ప్రాణాలను, యక్షగానాన్ని రక్షించు కొనుచున్న వారిని నిషాదులని, పంచములని గ్రామాల్లోనికి రానివ్వద్దని శాసించారు. ఆర్య పాలకులను చరిత్రల్లో, శాస్త్రాల్లో కెక్కించారు. కాలం గడిచిన కొలది తెలుగు జాతికి యక్షగాన చైతన్యపు గుర్తులు లేకుండా చేసారు. వారాడిందే ఆట పాడిందే పాట.

శ్లో ॥ అద ః కిమేతైర్యాపరే అన్యేమహా
ధనుర్ధ రా ః చక్రవర్తి న ః కేచిత్
(మైత్రో పనిషత్తు ప్ర॥ ఖం॥ - 4)

తా॥ మేమే శాశ్వితం అనుకున్న ఆర్య సార్వభౌమాధికారం అంతరించసాగింది. కారణ మేమంటే పొట్టకోసమే పురోహిత మంత్రాలు వల్లిస్తున్నారు. వారి తెలిసీ తెలియని వేదవిజ్ఞానం కూడా పాలకులకు లేకుండా చేసినందు వలన, వారు అవసరం కన్నా అధికంగా ధనం దాచటం ప్రారంభించారు. దుర్వ్యసనాలు ప్రవేశించాయి. దుష్ట గుణాలు మూర్తీభవించాయి.

అంతేగాక, 'అతిసర్వత్ర వర్జయేత్' అన్న సూక్తివలె మితిమీరిన వాని కామవాంఛా పూరితమైన నాట్యం వల్ల వారి మేధా శక్తి నశింపసాగింది. 'వాత్స్యాయన కామ సూత్రాలలో 63, 64 లో వివరించినట్లు 'కామం ప్రజల ద్రోహి', కామానికి దాసులై సంచరించువారు అన్ని విధాలా నాశనమై పోవడమే కాకుండ తమచుట్టు వున్న వారిని కూడా నాశనం చేసినట్లు' ఆర్య బ్రాహ్మణులే నాశనం కాసాగిరి.

''బ్రహ్మజ్ఞాన్యంతు బ్రాహ్మణో ః '' అనే వాస్తవాన్ని మరచి పురోహిత బ్రాహ్మణ నామధేయులు 'బ్రహ్మవాక్యం జనార్ధనా' అని 'బ్రహ్మణోమమ దేవతః' అనేవి మాసి, 'బ్రహ్మద్రోహివిష్యతిః' అని మోసకారులుగ, చపల, కపట, కుచ్ఛితులైనారు పురహిత బ్రాహ్మణ వర్గీయులు.

''మద్యం, మాంసంచ, ముద్రా, మైధునమేవచ ః''

పాలక వర్గాల్లో, పురహిత బ్రాహ్మణుల్లో, ఇట్టి మానవతా విజ్ఞాన వ్యతిరేక లక్షణాలేర్పడిననాడు ఆర్య సార్వభౌమాధికారం అంతరించే దశ ఆరంభమైనది.

''నూరుగొడ్లను తిన్నరాబందు ఒక్క గాలి వానకు కూలిపోయింది'' - అన్నట్లు

''ఇతర జాతుల్ని పీడిస్తూ పాలించే జాతి యేదీ స్వతంత్రంగా ఉండజాలదు'' అని కారల్ మార్క్స్ చెప్పినట్లు జరిగింది.

## ౩౩. బానిసల తెగింపు - ఆర్య పెత్తనం ముగింపు

క్రీ॥ పూ॥ 321 లో మౌర్య చంద్రగుప్తుడు వింధ్య పర్వతప్రాంత కీకారణ్యాలలోని ఆదివాసుల సహాయ సహకారాలతో ఉత్తర భారతాన్ని జయించి మౌర్య సాంమ్రాజ్యాన్ని స్థాపించెను. (జగత్కథ పేజీ 240 హెచ్. జి. వెల్సు)

దీనిని బట్టి చూస్తే ఈ మౌర్యుడెవరు ? చంద్రగుప్తుడెవరు? వీరితో చేతులు కలిపి జీత భత్యాలు లేకుండా ఆర్య పెత్తనాన్ని అంతం చేయ తలపడిన ఆదివాసులెవ్వరు? అనే ప్రశ్నలు, మనకేర్పడతాయి.

ధృతరాష్ట్రుని కుమారుడు నందుడు, నందునకు మతాంగనల వారసులైన దేవదాసికే పుట్టిన వాడు మౌర్యుడు, మౌర్యునకు దేవదాసియైన మురకు పుట్టిన వాడు చంద్రగుప్తుడు అని ఉన్నది. (పూర్వగాధాలహరి పేజీ 148)

అయితే మరీ ఆటవికులెవ్వరు ? వీరికి చంద్రగుప్తునకున్న లావాదేవీలు, చుట్టరికాలేమిటి ? ఏ అంటు, సంటు లేకుండా పోరాటంలో పాలు పంచుకొని ప్రాణాలకు తెగించి నిల్చారా ? లేదు లేదు.

'విధ్యాధరోప్సరోయక్షో రక్షోగంధర్వ కిన్నర ః
పిశాచోగుహ్యాకసిద్ధో భూతోమీదేవయోనియ ః'
(ఆరవ శతాబ్ది అమర సింహుని నిఘంటువులో ఉన్నది జ॥ కథ)

రాక్షసులు - అనగా మహాకాయులు, బల సంపన్నులు, దండధరులు, ధైర్య సాహస త్యాగశీలురు,(తెలుగువారు)

కిన్నరులు - అనగా కిన్నెర అనే తంతి వాద్యంపై అనుభవ కాలజ్ఞానం చెప్పువారు.

కిం పురుష్ - అనగా వేగుల వారు గూఢచారులు

గంధర్వులు - అనగా అక్షర మాలికలతో ప్రజల సాధక భాదకాలను నడవడులను బాధ్యతలను గేయ రూపాల్లో వినుపించువారు.

విధ్యాధరులు - అనగా చదువుట వ్రాయుట వీటినే నేర్పుట తెలిసిన విజ్ఞానులు.

యక్షులు - అనగా యక్షగాన ఐదు జాతుల రగడ అక్షర మాలికల్లో లయ, తాళ, గతుల్లో, వీరకథలు, గాథలు, వీర రస ప్రధానంగా ప్రజలకు యుద్ధ అవసరాలను స్వాతంత్ర పోరులో నిల్వ వలసిన, గెల్వవలసిన రీతులను తంబుర, డక్కలపై ఆడుతు, పాడుతు అభినయించినట్టి యక్షవారసులు. (నేటి బుర్రకథ గానంయిదే)

వీరంతా తెలుగు వారేనని వేరే చెప్పనవసరం లేదు. నాడీ కళాకారులు, విజ్ఞానులు, వీరులు కీకారణ్యాల్లోకి ఎందుకెళ్లారు ? అక్కడే ఎందుకుంటున్నారు ?

'కొందరు ఆర్య పాలనకు తలవంచలేక, మరికొందరు వారికి ఆర్య బానిసత్వం చేయలేక వింధ్య గిరి వంటి పర్వత కీకారణ్యాలకు పారిపోయిరి. వీరే నేడు మాల, మాదిగ, ఢక్కల, ధమ్మర మాష్టీసు బవని ఇత్యాది పేర్లతోను హరిజనులని అస్పృశ్యులని పిలువబడుతున్నారని' ॥జగత్కధ పేజీ 225లో ఉన్నది.

మరికొందరు ఆర్య బూతు కవిత్వాల గేయాల కామశృంగార రతిక్రీడా నటనల ముద్రల భంగిమల ఈసడించి"ఓ ఇంద్రా, సూర్య, వరుణ, ఆర్య సైన్యాధి నేతలారా !

ఏవం ప్రయోగే ప్రారబ్దే దైత్యదానవనాశనే (నాట్యవేదం పేజి 18)

తా ॥ తెలుగు జాతి మానమర్యాదల మంటగలిపేట్టున్న దీ నాట్యమన్నిఎట్టు పరిస్థితిలోను ఈ నాట్యాన్ని సాగ నివ్వమని ఆపుచేసిరి. అంతట సర్వ సైన్యాధిపతి ఇంద్రుడు ఈ నాట్య సృష్టి కి రాత్రింబవళ్లు శ్రమించిన ఇంద్రుడు-

రక్షో భూతశ్చ సర్వేషాం భవిష్యత్యేవర్ఝర్ఝర ః (నాట్య వేదం)

తా ॥ రోషావేశాన ఇంద్రుడు తన వజ్రాయుధం బట్టి నాట్య విఘ్నకారులైన యక్ష, రాక్షస, విధ్యాధరాదులను వధించ తలపడగా, నిరాయుధులైన తెలుగు వీర విజ్ఞానులు ఉదయలింగం (వింధ్యగిరి) హస్తాలింగం (పడమటి కనుమలు కాటుక లింగం (నల్లమల) సింహాద్రి,

గరుడాద్రి, కనకాద్రి వగైరా పర్వత ప్రాంతకీకారణ్యాలకు పారిపోయిరి, కాబట్టి వీరే చంద్రగుప్తునికి అండచేరిన వారు. (నాట్యవేదంలో ఉన్నది)

మౌర్య చంద్రగుప్తుడు తెలుగు బానిసల బిడ్డని గ్రహించారు ఆటవికులు. లేక లేక ఇన్నాళ్లకు మరిన్నేళ్లకు మనలో మగ బిడ్డ పుట్టాడన్నీ,నిరంకుశ ఆర్య పెత్తనానికి వ్యతిరేకంగా కత్తి దూసి రొమ్ముविరిచి నిల్చాడని ఆబాలవృద్ధులు అడివంతా అరిచింది. బుర్రకథా గానం గర్జించింది.

లెండి రా లేలెండిరా - సై
రండిరా పదండిరా - సై
రక్తం మండే యువకుడా - సై
శక్తులు నిండిన వీరుడా - సై

తతక్కధోమ్ -

పదుగురితో చావ్ పెండ్లేరా -
నేడు చస్తేరేప్ రెండొరా -
భళానంటిభాయ్ తమ్ముడ
పదరా విజయమ్ మనదేరా

చిరకాల వాంఛ, ఆశయం, దీక్ష నెరవేరే తరుణ మొచ్చిందని భావించారు. ఎవరు ఏపనికి యుద్ధవిజయానికి తగుదురో వారు వారు ఆ పనులు పంచుకున్నారు. మనం చస్తే మన బిడ్డలైన ఆర్య బానిస విముక్తులవుతారని చావుకు తెగించి యుద్ధరంగాన నిల్చారు. ఆర్యుల నోడించారు. చంద్రగుప్తుని సింహాసన మెక్కించారు . కాని ఆచంద్రగుప్తుడు . . . . . .

తెలుగు గ్రామ్యధర్మాన్ని పునరుద్ధరించాడా !? దున్ని పంచే భూస్పృశులనే రైతులకు పంట భూములను దాఖల్ పరిచాడా ? శ్రమ జీవులకు పని, తిండి, వసతి గ్యారంటీ ఇచ్చాడా? వ్యక్తి పెత్తనాన్ని ధనస్వామ్యాన్ని ఎక్కువ తక్కువలు ఉచ్ఛ నీచాలెంచే, కుల ధర్మచట్టాల రద్దు చేశాడా ? మౌర్య చంద్రగుప్తుడు? లేదు లేదు !'ఎక్కడేశావు గొంగడి అంటె అక్కడే ఉంది కంబడి' 'యధా రాజా తధా ప్రజా' అన్నట్లయింది.

విజయానికి ముందే చంద్రగుప్తుని పంచన జేరి అచ్చిక బుచ్చిక కబుర్లతో నందులపై కక్ష ప్రదర్శించి మౌర్య సాంమ్రాజ్యానికి మంత్రి అయ్యాడు చాణుక్యుడు .

చంద్రగుప్తుడార్య దుర్మార్గ చట్టాలను శాసనాలను ఎందుకురద్దు చేయకుండా ఉన్నాడు. అయితే ఆర్యుల పెత్తనపు రాజ్యాధికారం ముగిసింది బానిసల తెగింపుగెలిచింది.

# 34. చాణుక్య శాస్త్రం - జాతి విభజనాస్త్రం

ఎవరీ చాణుక్యుడు ? ఇతని కాలమేమంటే, ఇతడొక బ్రాహ్మణుడు. కుతంత్రుడు (॥పూ. గా॥ హరి 41) ఒక బ్రాహ్మణుడు టే తెలుగు దేశంలో ఈనాడు ఎన్ని తెగల బ్రాహ్మణులున్నారు ? అనే ఆలోచన వచ్చి నేను చరిత శాస్త్రాల ప్రజల్లో పరికించాను. మన తెలుగు దేశంలో ఆర్యులు వచ్చేనాటికి బ్రాహ్మణులు లేరు. ఆర్యులు బ్రాహ్మణులా ? కాదు. తెలుగు ప్రజల్లో పల్లెల్లో పురహితులు, పూజారులు ఎవరు ? ఆర్యులకు అనాది నుండి దైవారాధనలు స్త్రీ దేవతా మూర్తుల్లేరని ఋగ్ వేదంలో ఉన్నదట. తెలుగు దేశ పూజారులు, పురహితులు, సంఘపెద్దలు బ్రాహ్మణులు కాదు.

విశ్వ బ్రాహ్మలెవరు ? వీరు భూ సాగు ప్రారంభంలో ఎనిమిది వృత్తులేర్పడిన్నాడు ఒక్క తల్లి బిడ్డలైన వారితొ, కొయ్యపనితొ, గొర్రులు, నాగళ్ల్లు, ఇనుంపనితొ, కొడవళ్ళు గొడ్డళ్లు, నాగలి కర్రులు, గుంటక, పాపటం, అలుగులు, రూపొందిస్తూ వచ్చిన కమ్మరి, కంసాలి విశ్వ కర్మలు అంటూన్నాము . మరి చాణుక్యుడనే ఒక బ్రాహ్మణుడెవరు ?!

భారతదేశంపైన ఆర్యులు దురాక్రమణ యుద్ధం సాగిస్తున్న తొలిరోజుల్లో ఆర్య దౌర్జన్యాలను నిరంకుశ హింసలను సహించలేక ఉత్తర భారతపు గంగా యమున ప్రాంతాలనుండి **'ఆంధ్రులు'**(ఒక తెగ వారు) వింధ్యకు దక్షిణంగా తెలుగు ప్రజలైన నాగా, యక్ష, విద్యాధరాది తెలుగు ప్రజలతో కలసి బ్రతుకు చుండగ, అట్టి ఆంధ్ర బ్రాహ్మణ పడుచుకు, నాగా తండ్రికి బృహత్కధ రచించిన గుణాద్యుడు పుట్టెనని ఏటుకూరి బలరాం మూర్తి గారు 'ఆంధ్రదర్శిని' గ్రంధములో వ్రాసిరి-

చంద్రగుప్తుని మంత్రియైన చాణుక్యుడనే బ్రాహ్మణుడు ఈ గుణాద్యుని వారసుడొ, లేక తెలుగు దేశంలో వసిష్ఠ గోత్రీకులైన ఆంధ్ర బ్రాహ్మణ, లేక అసలు తొలి ఆంధ్రా బ్రాహ్మణుడోనని భావిస్తున్నాను.-

ఎవరైనా ఈ ఆంధ్రులు ఎక్కడనుండో ఎత్తి వచ్చిన కారణంగ, తెలుగు ప్రజల బ్రతుకుపనుల్లో కోతలు మోతలు నాటు వగైరాలేవి చేతగావు. అసలు శారీరక శ్రమలు చేతకావు, చేయలేరు. భూసాగు వృత్తులసలు తెలియవు. మంచి చదువరులు భాషా జ్ఞానులు, మాటకారులు, వాక్చాతుర్యం కలవారు. శుద్ధ అబద్ధమైనా రుచిగ వినసొంపుగ నమ్మకంగా చెప్పుటలో వారికి వారే సాటి.

ఆర్యులు తెలుగు జాతిని విద్యాహీనులనుగ బానిసలనుగ చేసి, తెలుగు సంస్కృతిని కళలను సాహిత్యాన్ని నామరూపాలు లేకుండా చేసిన ఆర్యశాసనాలను చట్టాలను, వృత్తి తెగల్లో కుల హెచ్చు తగ్గులు ఉచ్ఛనీచాలు కల్పించిన ఆర్యచట్టాల చెక్కు చెదరనీయక, ఇంకా కట్టు దిట్టంగ తన బ్రాహ్మణ ఆధిక్యతల ఆర్థిక విధానాల, అంటే ముందుగా పండిన కూరగాయల దగ్గర నుండి,కాళ్లు గడిగి నెత్తిన జల్లుకునే ఆచారం వరకు 'బ్రాహ్మణ మమదేవతనే ' శ్లోకాలు కల్పించి సొంతంగా ఈ చాణుక్యుడే కుటిల అర్థశాస్త్రాన్ని కౌటిల్యుని పేరుతో కల్పించాడని నే భావిస్తున్నాను.

'ఈ చంద్రగుప్తుని మంత్రియైన చాణుక్యుడు, కుటిల అర్థశాస్త్రం వ్రాసిన కౌటిల్యుడు ఒక్కడే అన్నాడు ప్రాచీన ప్రపంచ చరిత్ర పేజీ 12 లో వాల్టర్ రూబెన్॥

నాటి కుటిల చాణుక్య శపదాలను, శాసనాలను ఏ ప్రభువులు మార్చలేదు. తెలుగు దేశంలో ఈ క్షణం వరకు అవే రాజశాసనాలు. నేటికి తెలుగు ప్రజలు కోలుకోలేని దీర్ఘరోగాలే చాణుక్య శాసనాల అంటే అతిశయోక్తి కానేరదు.

చాణుక్యమంత్రి తెలుగు దేశానికి, ప్రజలకు సంస్కృతికి ఏం చేశాడంటే ? చంద్రగుప్తుడు మాల, మాదిగల బిడ్డ మా రక్త సంబంధమని నమ్మిన తెలుగు బానిస ప్రజల, తెలుగు కవి కళాకారుల, యుద్ధ వీరుల బుర్రకథకులను 'ఇంటోడు బెట్టాడు కంట్లో పుల్ల' అన్న సామెతగా ఎప్పటికి బైట పడలేనంత లోతు ఊబిలో త్రొక్కి వేశారు. చంద్రగుప్తుడు ఆంధ్ర బ్రాహ్మణుడైన చాణుక్యుడు. ఇంతకన్న ఇంకేం చేయాలి ?

బానిస మతాంగన వారసురాలు దేవదాసి మురి. ఈమె బిడ్డే చంద్రగుప్తుడు. మాల, మాదిగ, ధమ్మర, ఢక్కల, మాష్టీను, భవని, పంబల, ఝుంకుల, ఒగ్గుల వగైరా బానిసల గుంపులో, గూడేల్లో పెరగలేదు ఈచంద్రగుప్తుడు అని భావిస్తున్నాను. ధన, ధాన్య, భోగ భాగ్యవంతులు, నిరంకుశాధికారుల ఇంటిబిడ్డగా పెరిగాడు చంద్రగుప్తుడు.

చంద్రగుప్తునిలొ మాల, మాదిగ, పంబల, బవని వగైరా బానిసల వంశస్తుడననే సంఘచైతన్యం, జాతిఅభిమానం, గెలిపించినట్టి బానిసలపై సానుభూతి, కరుణ, ప్రేమ కలుగక ముందే, యుద్ధ ఆరాటం, ఆవేదన తీరక ముందె, కుతంత్రుడు కుటిలుడైన చాణుక్య మంత్రి,చెవిలో జోరీగవలే జేరి, చంద్రగుప్తునిలొ పుట్టుకతో వచ్చినట్టి భోగభాగ్య హుందాతనాల, అధికార అహంకార లక్షణాలు, నిరంకుశ నడవడులను పొగుడుట అవే

రాజ లక్షణాలుగ శ్లాఘించుట చేత, ధైర్య సాహస వీరుడైనట్టి, విజ్ఞాని, విద్యావంతుడు కానట్టి చంద్రగుప్తుడు, చాణుక్య మంత్రి చేతిలో కీలు బొమ్మగా మారి పోవటం జరిగిందని భావిస్తున్నాను.

తన తన ఆంధ్రబ్రాహ్మణ వర్గ సుఖసంతోషాల కోసం, ఆధిక్యతల కోసం గొంతెత్తి అరవలేదు-కాని కలం పోటు పొడిచాడు చాణుక్య మంత్రి. ఎలాగంటే -

శ్లో ॥ ఏతే విప్రైః ర్వర్జ్యాః ప్రయత్నతహః

తా ॥ ఓ విప్రవర్గమ! ఈనిషిద్ధ వర్గాలు, వారి కళ వాద్యాల తాకరానివిగ, వినరానివిగ, చూడరానివిగ ప్రయత్నతః గట్టి ప్రయత్నంగ త్రోసి పుచ్చాలి.

శ్లో ॥ చాతర్వర్ణ్యంమయా సృష్టం గణకర్మ విభాగశః

తా ॥ విప్రులు సృష్టికర్త ముఖం నుండి, రాజులు బాహువుల నుండి, వైశ్యులు పైనుండి, శూద్రులు అరికాళ్లలో నుండి జన్మించారు. దీన, దరిద్ర, పాపులు అనగా భూమిని పాయలు పాయలుగా దున్ని పంటపొలాలుగా మార్చు వారితో సహా పాదాల నుండి పుట్టారు.

శ్లో ॥ దారిద్రదోషేణ కరోతి పాపం పాపాదవంతీ పునర్దరిద్రో

తా ॥ దరిద్రులైపుట్టి పాపాలు చేస్తున్నారు-ఈ కారణముల చేత తిరిగి తిరిగి దరిద్రులుగానే పుట్టుచున్నారు.

అవి ఋగ్ వేదం పేరుతో ఇట్టి కుటిల శ్లోకాలు కల్పించి నాటికి నేటికి ఎన్నటికి బైట పడలేనంత లోతు బురద ఊబిలో తొక్కి పట్టి ఉంచారని భావిస్తున్నాను. క్రీ॥ పూ॥ 800-1000 ఏండ్ల మధ్యన ఆర్యులు భారతదేశానికొచ్చారు. అప్పటికి వారికి దైవారాధనలు, దేవతాపూజలు లేవని మొదట ఋగ్ వేదంలో లేవని పెద్దలంటున్నారు. భారతదేశమొచ్చే నాటికి ఆర్యుల్లో వర్గ సూచనలున్నవి గాని వర్ణ - కుల వ్యవస్థ లేదు. వారంతా ఆల కాపరులుగ వచ్చారనేది చారిత్రక నిర్వచనం. ఆర్యులు క్రీ॥ పూ॥ 500 ఏండ్ల నాడు వారు మాట్లాడే వేద భాష అంతరించిపోతున్నదని, భారతజాతీయ భాషయైనట్టి సంస్కృత భాషలో తాండ్య, గోవధ, బ్రాహ్మణాల పేర్లతో వ్రాశారు. వేదాల్లోలేని కులహెచ్చు తగ్గులు ఉచ్చనీచాలు వీటిల్లో ఉండవని నమ్మి, వీటిని, ఇంకా 'బ్రాహ్మణామమదేవతా' అని ముందు వండిన కూరలు, జున్నుపాలు, నెయ్యి, రైతు పండించే ధాన్యాల్లో పదవ పాలు ప్రభువులక్కు గోవుల్లో ఏడాదికొక గోవు, పాడిగేదే ఇచ్చే శాసనాలు, మరియు చలి చీమల గుంపు నుండి త్రాచులను,

(నాల్గింటిని) కాపాడే దండధరులను నిర్ణయించాడు చాణుక్య మంత్రి. ఇవన్ని గౌతమ ధర్మ సూత్రాల పేరుతో తెలుగించబడిన చట్టాలు, శాసనాలుగా కౌటిల్య అర్థశాస్త్రంలోనివే అనుకుంటున్నాను. (ఆంధ్ర గౌతముడనగా శాస్త్రము రచించన వాడని అర్థముంది.) దీనిని బట్టి ఈ చాణుక్యుడు జాతిని వర్గ విభజన చేశాడని నేను అనుకుంటున్నాను. ఎలాగంటే నిషిద్ధులు తయారు చేసే వస్తువులు, తాళ్ళు, మోకులు, పంచెలు, కుండలు నీళ్ళు జల్లి తడిపి తీసుకోవాలని, లోహ వస్తువులను కాల్చి తీసుకోవాలని, ఈ నీచ నిభంధనలు మనల కలవకుండా చేసె మానసిక వ్యధలన్నింటిని చాణుక్య మంత్రి నిర్ణయించాడను కుంటున్నాను. ఈ కారణముల చేత ప్రజలకు భాధలు, దోపిడీలధికమైనవి. దున్ని పండించే రైతులకు భూమిని దాఖల్ పర్చ లేదు కాబట్టి పని వారికి, శ్రమ జీవులకు పని, తిండి, గ్యారంటి లేదు. వ్యక్తి పెత్తనం పోలేదు. ధన స్వామ్యం రద్దు లేదు. తెలుగు జాతి గ్రామ్య ధర్మం పునరుద్ధరించ బడలేదు.

చాణుక్య, చంద్రగుప్తుల కాలంలొ మధుమాంసాలు, మత్తుపానీయాలు, లోభులు, నిర్ధయాపరులు, పాలకులు గావడం చేత ప్రజల ధన, ధాన్యాలను, స్త్రీలను వశపరుచుకోవడం, కనకం, కాంతల కోసం యుద్ధాలు చేయడం ఎక్కువయినాయి. ఇవి చాలవన్నట్లు రామానుజ, హిందు, జైన, వీర శైవ, వైష్ణవ, బుద్ధ మత కీచులాటల్లొ 'సందల్లొ చెలోమియు' అన్నట్లు తెలుగు దేశంతో సహా భారతదేశాన్ని ఇస్లాం మతమాక్రమించింది. నవాబులు సింహాసనాలెక్కారు.

## ౩౫. సమర సందేశం - బుర్రకథా గానం

గద్దెనెక్కారు నవాబులు. గద్దెనెక్కిన నవాబులు చాణుక్య శాసనాలు, చట్టాలు రద్దు చేయలేదు. ఎందుచేతనంటె రాజ సింహాసనం ప్రక్క కుర్చీలోను, మరియు రాజకీయ, సాంఘిక, సామాజిక, ఆర్థిక సలహాదారులంతా చాణుక్య వారసులే కాబట్టి చాణుక్య శాసనాలెందుకు రద్దు చేస్తారు? నవాబులకు గులాములై అల్లా ఉపనిషత్తులు కల్పించసాగారు. నాటి ఆంధ్ర బ్రాహ్మణులు.

॥ అస్మాల్లాం ఇల్లే మిత్రా వరుణా దివ్యా విధతే ॥
॥ ఇల్లల్లే వరుణా రాజా పునర్దమా ॥
ఇల్లాం ఇల్లల్లే ఇలాం వరుణో మిత్రైస్తే
జప్కామః (సత్యార్థ ప్రకాశం ॥ద॥స॥ పేజీ 701)

ఈ పరిస్థితుల్లో కొమరం సింహులు, శివాజీలు కత్తులు దూశారు. ఇస్లాంకు వ్యతిరేకంగా, ఆనాడు వారి కండగా -

॥ భళానంటిభాయ్ తమ్ముడా - సై

భాయ్ భళానోయ్ దాదానా - సై

స్వదేశ రాజుల రాజ్యాధికారం కోసం' అంటూ ఆ యుద్ధవీరుల చెంతనిల్చింది బుర్రకథా గానం. ఇస్లాంలను గెల్చారు దేశీయ రాజులు. సింహాసనాసీనులైనారు. కాని వీరూ చాణుక్య శాసనాలు రద్దు చేయలేదు. దున్ని పండించేవారికి పంట భూములను దఖల్ పర్చ లేదు. శ్రమ జీవుల పని తిండి వసతులకు గ్యారంటీ ఇవ్వ లేదు . తెలుగు గ్రామ్యధర్మం పునరుద్ధరించబడలేదు..

చాణుక్య శాసనాలు, దేశీయ రాజులు కూడా రద్దు చేయలేని కారణాన వర్గ దోపిడి పెరిగి అధికార కొట్లాటలు, వర్ణ కీచులాటలు పోకపోగా, మత కుమ్ములాట లెక్కువైనవి. ఈ కారణాల వలన అతి త్వరలో తెల్లదొరల కంపెనీ పాలనకు బానిసైనదీ తెలుగు జాతి.

వెంటనే స్వరాజ్యసమరంలో బుర్ర కథాగానం బ్రిటీషు పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా జాతీయ నాయకులకు అండగా నిలిచింది. 1942 పూర్వం నుండే కాకుమాను సుబ్బారావు, చింతల సూర్య నారాయణ దళం, దివిసీమ సిర్విశెట్టి సుబ్బారావు, కోసూరి పున్నయ్య దళం, తిరువూరు సుంకర సత్యన్నారాయణదళం, గుంటూరు దూదేకుల షేక్ నాజర్ నైన నాదళం, గాంధీ, కాంగ్రెస్ హరిజనోద్ధరణ, చాపకూటి సిద్ధాంతాన్ని

'' మాలా మాదిగ చాకలి మంగలి సర్వజనుల నెల్ల

ఏక పంక్తిలో విందు భోజనాలేర్పరచినాడా

ఎక్కువ తక్కువ వర్ణభేదముల వ్యతిరేకించాడా

వర్ణధర్మమను ఉక్కు చట్రము వ్రయ్యలు చేశాడా

అని పల్లెల, పట్నాల ఆబాల వృద్ధుల్లో దేశభక్తిని, బానిస విముక్తి పోరాటావసరాన్ని ప్రచారం చేసినది బుర్రకథ. కాని ఈబుర్రకథ సాహిత్య రీతులు, కాంగ్రెస్ చరిత్ర పుటల్లో లేవు. కారణం ఒక్కటె . మౌర్యుల నాటి నుండి నేటి వరకు ఆంధ్ర ఆర్యపండిత వారసులలో ఒక తెగ, తెలుగు కళా సాహిత్యాలను జాతి చరిత్ర పుటల్లో లేకుండా ఈర్ష్యా ద్వేషాలతో త్రొక్కి పెట్టింది. పూర్వం ఆర్యుల చేత యక్షగానం ఏలా నిషేదించ బడిందో, అలాగే

చలనచిత్రం : పుట్టిల్లు



లక్ష్మీనరసయ్య, శ్రీనాజర్, రామకోటి



కీ॥శే॥ శ్రీ నాజర్

ప్రచారదళంగా పనిచేస్తున్న నాజరు కుమారుని బృంధం



చిన్న యస్.కె. బాబుజి, సాంబశివరావు



యస్.కె.బాబూజి (కీ॥శే॥ నాజర్ గారి కుమారులు)

నేడు కూడ రేడియో, టి.వి లలో పచ్చి బూతు సాహిత్యం, సినిమా, నటనలు , పాటలు ప్రోత్సహిస్తున్నారే గాని 'సీతారామరాజు', (అగ్గిరాముడు) 'జానకి వనవాసం', (భలేబావ) నిలువు దోపిడిలాంటివనే చెప్పిన సినిమా బుర్రకథలైనా పొరపాటున కూడా వినిపించుట, కనిపించుట లేదంటే కారణం, వర్గద్వేషాలు. నాటి స్వరాజ్య సమరంలో బుర్ర కథా గానం గాంధీజీని, ప్రకాశం, కొండా వెంకటప్పయ్యల నాయకత్వాన ప్రచారం చేస్తూ కాంగ్రెస్ కు అండగా నిల్చింది. దానికి ముఖ్యమైన రుజువు నాడు వ్రాయబడిన ''తక్కెళ్ళ జగ్గడు'' బుర్రకథే-

''కుంపినోడొచ్చాడు - తంధానా
కట్టెనే ఖైదు కొట్లు - తంధానా''
''కట్టెల మొర్రెదనె - తంధానా
కత్తిలాగేశనే - తంధానా ''
''తాడి చెట్లూ వాడివంట - భళి భళి
వాడితాతలు నాటె నంట - భళి భళి
'' పన్నెండు దేశాలు పండినా - సైసై
పట్టెడన్నం కరువాయనా - సైసై ''
''ఉప్పు పప్పుల పన్నేసనా - సైసై
ఉల్లి పాయకు పన్ను వేసనా - సైసై''
''కొల్లాయి గట్టితేనేమీ - భళి భళి
కోమిటైపుట్టితేనేమీ - మాగాంధి''

జాతి నాయకులను, పోరాట వీరులను, తెల్లధనిక ప్రభుత్వం లాఠీల మోదింది . జైళ్ళు కుక్కింది. బుర్రకథ దళాలుకూడా నిర్బంధాలకు గురికాబడి నాయి. బుర్రకథ నాజర్ కూడా 1944 నుండి 46లో పలుమార్లు జైళ్ళకు పోలీస్ క్యాంపులకు పంపబడినాడు. తెలుగుజాతి ఈ నిర్బంధ విధానాలకు, వురికంబాలకు భయపడక గాంధీ వెంట నిల్చారు. వేలాది ప్రజలు వీధులలోకొచ్చారు, పోరాట వీరులకు జైజై అన్నారు స్వరాజ్యాన్ని సాధించారు.

'స్వరాజ్యం' వచ్చింది కాని ఏం లాభం 'ఇంటి పేరు కస్తూరి వారు - ఇంట్లో గబ్బిలాలకంపు' పోలేదు. ఈ కారణంగా మళ్ళీ దేశం నలుమూలలా భూమికోసం, భుక్తి

కోసం నిరంకుశ దోపిడి విముక్తి కొసం, పోరాడే పార్టీల వెంట నిల్చింది నేడీ 'బుర్ర కథాగానం'.

''దోపిడి, పీడనను రద్దు చేయబడిన చోట మాత్రమే నిజమైన స్వాతంత్ర్యముంటుంది అన్నాడు. జె.వి. స్టాలిన్. అలాంటి పోరాట వీరులతోనే బుర్రకథ కష్టాలనుభవిస్తున్నది.

వాయిద్యాలు యక్షగానం నాటివీ. ఆట, పాట, వేషాలు యక్షగానానివి. భాషా, హావ, భావ, రసములందు యక్షగానం, శృతి, లయ, తాళ, నడకలందు 'యక్షగానం' మూడు స్థాయిల ఆలాపనలందు యక్షగానం, అన్ని యక్షగానమే ఐనప్పుడు యక్షగానమే అనవచ్చు కాని 'బుర్రకథ' గానమని ఎందుకన్నారు ?

జాతి సంపదకూ, సంస్కృతికిమూలం శ్రమ. మానవ జాతి జీవితాని కంతటికీ మనుగడుకు మూలం శ్రమ. శిశు, పశు, మృగనరుని మనిషినిగా తీర్చిదిద్దినదీ శ్రమే ! తొలినాటి భూమిసాగు శ్రమ, ఆశ్రమను వివరించుటకు పుట్టినదే నాటి 'యక్షగానం' శ్రమ జనితమన్న మాట బవని యక్షగాన కథలు. అంతే గాక కలియుగాహార ఆత్మరక్షణ కూడు, కూరలు, సృష్టి విధానాలను, ఏకపత్ని, ఏకపతి,వావి వరసలు, సత్య, శీల, నీతి నియమ ప్రచార జనితమైనది, 'యక్షగానం'. అందుకే పదపదార్థ విజ్ఞాన బోధయే యక్షగాన, నీతి, రీతి అన్నారు. కాని బుర్ర కథాగాన లక్షణం అది ఐనా సాహిత్య లక్ష్యం అది కాదు.

నాటి భారతదేశ ఆర్య నిరంకుశ బానిస వ్యతిరేకతా పోరాటంలో, మొన్నటి రాజ్యాధికారంకై బానిసల బాధల పీడనలు, వివరించి బానిస ప్రభువు రాజ్యాధికార అవసరాల నాడి, పాడింది, గుర్తింపు చేసింది చంద్రగుప్తుని కండగా నిల్చింది 'బుర్రకథా గానం'.

నిన్నటి బ్రిటీషువారికి వ్యతిరేకంగా స్వతంత్ర పోరాట వీరుల కదన రంగాన అండగా నిల్చింది 'బుర్రకథగానం'.

నేడీ దోపిడి రాజ్యాంగ వ్యవస్థకు, పేద ప్రజల పీడించు ధనస్వామ్యానికి, వ్యక్తి పెత్తనానికి వ్యతిరేకముగా పోరాడు వీరులకండగా నిల్చిందీ 'బుర్రకథగానం'.

కనుక దీనిని బుర్రకథగానం అనుటకు దాని సాహిత్య లక్ష్యము కారణం, దాని వీరత్వపు గత చరిత్రే ఋజువు. అందుకేనేటి ధనిక పాలక వర్గం ఈకళను వాడుకుంటున్నది గాని, ఆదరించుట లేదనేది వాస్తవం.

'భోగ భాగ్య అవ లక్షణాలనుండి అధికార మనస్తత్వం నుండి నాది, నేను, అనే అహంకార మమకారాల నుండి బైట పడుటకు సమిష్టితత్వం అలవాటగుటకు మనిషి నిత్యం కృషి చేయాలన్నాడు' కారల్‌మార్క్స్ ॥ –

99 రూపాయిలు వెనకేస్తే నూరో రూపాయి కోసం ఏ గడ్డయినా గరుస్తుంది మానవ మనస్తత్వం' అన్నారు కారల్‌మార్క్స్.

విజ్ఞానం ఎంతో పెరిగిందనుకుంటున్న ఈనాడు మన పాలక వర్గాల స్థితి కడుపుచించుకుంటే కాళ్ళ పైనే పడేట్టుంది. ధన, ధాన్య, సుఖభోగాల కలవాటు పడిన ప్రాణం అంత తేలికగా వదులుకోలేదనుకుంటున్నాను.

## 36. తెలుగు జాతి బంధువులు - ఆంధ్ర బ్రాహ్మణులు

క్రీ॥ పూ॥ 800-1000 యేండ్ల నాడో భారత దేశమును దురాక్రమణ సాగిస్తున్న ఆర్యుల దౌర్జన్యాల కోర్వలేక, వారి దుర్మార్గ చర్యల సహించలేక, గంగ, యమునల ప్రాంతాల నుండి పారి వచ్చి వింధ్యకు దక్షిణాన నాగులతో కలసి జీవిస్తున్న వారే ఆంధ్రులు.

(॥ ఏటుకూరి బలరామమూర్తి ॥ ఆంధ్రదర్శిని)

ఉత్తర భారతం నుండి పారి వచ్చిన ఆంధ్రుల్లో ఆంధ్ర బ్రాహ్మణః వింధ్యకు దక్షిణాన తెలుగు వారైన నాగ, యక్ష, రాక్షస విద్యాధరాదులతో కలసి జీవించుచున్ననాడు, ఆంధ్ర బ్రాహ్మణ కన్యకూ నాగ కుర్రవానికి పుట్టిన గుణాడ్యుడు ఆంధ్ర బ్రాహ్మణుడు కాదు కాబోడు.తెలుగు వాడు.

వసిష్ఠునకు అరుంధతికి పుట్టినవాడు సుతపుడు. సుతపుని కుమారుడు బలి.ఈ బలి భార్య సుధేష్ణ. ఈమె భర్త అనుమతి తోనే ఆంధ్ర బ్రాహ్మణుడైన ధీర్ఘతముని వలన వంశకరుడు అనే కుమారుని కన్నది. ఇతడు కూడ ఆంధ్ర బ్రాహ్మణుడు కాదు.

వంశకరుని కుమారులలో ఒకడు అంధుడు.ఈ అంధుడు తెల్గు దేశంలో తూర్పు ప్రాంతాన చిన్న ముక్కను పరిపాలించాడట.మొత్తం తెలుగుదేశాన్నే తన పేరుతో పిలువమన్నాడట. (పూర్వ గాథాలహరి పేజీ 41 లో ఉన్నది.)

వసిష్ఠునకూ అరుంధతికీ మనుమడైనట్టి వంశకరుడు ఎట్లా ఆంధ్రా బ్రాహ్మణుడు? వసిష్ఠుడు బ్రహ్మజ్ఞానై బ్రాహ్మడనిపించు కున్నాడన్నారు.

చదువు సంధ్యల్లేనట్టి , అంటరాని, చెప్పరాని, చూడరాని, మాదిగింటి ఆడపడుచు అరుంధతి బ్రాహ్మీ బ్రాహ్మణి కానే కాదు. ఈమెకన్న బిడ్డగాని మనవళ్లు గాని బ్రాహ్మణులనుటకు వీలులేదు . పన్నెండు రకాల సంకర సంతానాన్ని తెలుగు బిడ్డలుగా శాసించిన చట్టం ప్రకారం కూడా గుణాఢ్యుని తో సహా వీరెవ్వరూ ఆంధ్ర బ్రాహ్మణులు కాదు బ్రహ్మజ్ఞానులు కాదు.

ఐనా ఆంధ్రదేశమని పిలువమని శాసించాడనే ఆ తని పేరు అంధుడు గాని ఆంధ్రుడు కాదు. అతని పేరున పిలువమన్నది నిజమేయైన యెడల అంధదేశం, అంధ ప్రజలు, అంధ సంస్కృత అనాలి గాని ఆంధ్ర అనుట కూడదు. ఐనా తెలుగు దేశంలో ఒకమూలన జానెడు ఏలినంత మాత్రాన దేశమంతా తనపేరుతో పిలువ మంటాడా। క్రీ॥ పూ॥600 ల యేడ్లపైనే పాలించారు ఆర్యులు. ఆ తరువాత 200 యేండ్ల పైగా మౌర్య చంద్రగుప్తుని వంశం పాలించినది ఆ తరువాత ఇస్లామ్, ఇంగ్లీషు కొన్ని ప్రాంతాలు కొందరు రాజులు పాలించినట్లు చరిత్రలో ఉన్నవి, కాని వారెవరు తమతమ పేర్లతో తెలుగు దేశాన్ని పిలువ మనలేదు, భారతదేశాన్ని కూడా శాసించ లేదు.

ఆంధ్రభాషా పేర్లు వాక్యాలు తెలుగు భాషలో కలిసున్నా యంటున్నార, విజ్ఞులైన మీరన తగిననమాట కాదది. ఒక్క ఆంధ్ర పదాలేమిటి!సంస్కృతం,అరవం,కన్నడం,హిందీ ఉర్దూ, ఇంగ్లీషు దేశ విదేశ పదాలూ వాక్యాలెన్నింటినో అభివృద్ధి మార్గంలో తన భాష చెడని రీతిలో ఇంపు సొంపుకూర్చుకొను నీతితో తనలో కలుపుకున్నది గనుకనే దేశ భాషలందు తెలుగు లెస్స అనుపించుకున్నది తెలుగు భాషా మాత -

ఆంధ్రులు తెలుగు ప్రజలతో మమేకమైనారంటున్నారు. మరి పాపం ఇస్లామ్, ఆంగ్లో ఇండియన్స్, ఆర్ మరాఠీలు, అరవ, కన్నడ(భోజన, కాఫీ హోటళ్లన్నీ వారివే కదా) వీరెవ్వరు మా పేర్లతో తెలుగు దేశాన్ని పిలవమనటం లేదు కదా ? తమ రెందుకు ఆంధ్రదేశం! ఆంధ్ర ప్రజలు ! ఆంధ్ర సంస్కృతీ! ఆంధ్ర! ఆంధ్ర ! అని కలవరిస్తున్నారు. 'ఇట్లొచ్చి నట్టింట కూర్చొని అంతానాదే' అన్న సామెతగ లేదా ? కనుక త్రిలింగదేశం త్రిలింగ ప్రజలు త్రిలింగ సంస్కృతి అనుటకు మన చుట్టూ ఉన్న పెట్టని కోటగ కనిపిస్తున్న ఉదయలింగం ( వింధ్య) హస్తాలింగం ( పడమటి కనుమలు) కాటుక లింగం ( నల్లమల) ఈ త్రిలింగాలు కారణం అనే సత్యాన్ని చరిత్ర శాస్త్రాల నుండి చెరిపినది ఆంధ్రాభిమానులు గాక మరెవరూ చేయలేదని భావిస్తున్నాను .

త్రిలింగ దేశ ప్రజల సంస్కృతి అనుటకు కారణం, ద్రాక్షార లింగం, శ్రీశైల లింగం, కాళేశ్వర లింగాలు కారణమని చరిత్రలో ఇరికించినది కూడా ఆంధ్రాభిమానులైన చాణుక్య శాసన చట్టాల రక్షకులే అనుకుంటున్నాను.-

భారత దేశమనుటకు కారణం, మేనక కూతురు శకుంతల . శకుంతల కొడుకు భరతుడు ఈ భరతుడేలినందున ఈ దేశం భరతదేశమన్నారని కల్పించినదీ చాణుక్య వారసులని భావిస్తున్నాను.

భారతదేశాన్ని తెలుగు దేశాన్ని గురించిన జన్మవృత్తాంత నిర్వచనం నిజం కాదని పండితులంటున్నారా ? యూనివర్శిటీల ప్రొఫెసర్‌లంటున్నారా ? కనీసం హైకోర్టు న్యాయమూర్తులైనా ఈ నిర్ణయాలు అన్యాయం అంటున్నారా ? లేదు మౌనమే అంగీకార సూచికం. వీరంతా తెలుగు వారు . పైగా ఆంధ్రులు కాదు. కనుక ఆంధ్రులు తెలుగు జాతి బంధువులే కాని తెలుగు వారుకారు.

## 37. బుర్రకథా గానం - సాధన విధానం

నా అనుభవంలో రసములు ఎనిమిది

| | |
|---|---|
| 1. హాస్యం | 5. రౌద్రం |
| 2. శృంగారం | 6. భయానకం |
| 3. వీరత్వం | 7. భీభత్సం |
| 4. కరుణ | 8. దుఃఖం |

శాంతం, ఓర్పు, సహనం వగైరాలు రసాలు కావు బానిస లక్షణాలనుకుంటున్నాను.

వీటిని నాదాక్షర మాలికల్లో ఆలాపించు రగడలు - 8

1. వృషభగతి
2. ద్విరదగతి
3. మధురగతి
4. మంజుగతి
5. మంజుగతిలో సగభాగములు అనినట్టి అర్థ చంద్రికలు నాలుగు.

## స్వరాక్షరాలు

నాదాలు - 7. వాటి సౌజ్ఞ అక్షరాలు ''స, రి, గ, మ, ప, ద, ని''. శ్రుతి - ''మధ్యమ'', ''షడ్జమం''

స్థాయీలు - 3

1. మందరం - స, రి, గ, మ, ప, ద, ని
2. మధ్యమం - స, రి, గ, మ, ప, ద, ని
3. తార - స, రి, గ, మ, ప, ద, ని పైన 'స' కపాలం నుండి పలకాలి.

ఇవి మొత్తం 22 నాదాలు. మూడుస్థాయీల్లో పలకాలి. ఏడు స్వరాక్షరాలనూ 22 నాదాల స్థానాలలో పలికించు వాగాంగములు ఆరు.

1. కుతికా
2. కంఠము
3. దంతాలూ
4. దౌడలూ
5. అనునాశికా
6. కపాళము (అనగా కొండనాలుక పైన మోడు వెంట్రుకల పాదు)

సాధన చేయవలసిన నాదాల నేడింటిని, వీటి ఇరువది రెండు స్థాయీలను 'శృతి' పక్వంగ, స్వరపక్వంగ అనగా చెవికి వినిపించునట్టి శ్రావ్యమైన ఏ నాదానైనా ఆధారం చేసుకొని 'శృతి' పక్వత సాధించ వచ్చు. కానీ స్వరపక్వత గురుముఖంగా విని సాధన చేయుట ఉత్తమం.

మరో ముఖ్య విషయం యక్షగానంలోను, జనపద గేయాల్లోను ఆయా రసభావ సాయలని జోలపాటసాయ, ఏలపాటసాయ, నూర్పిళ్ళపాటసాయ దర్వులు అని కనిపిస్తున్నందున నేనూ 'సంగీత విద్యాదర్పణం' నే అనుకరించాను. కాని అన్ని స్వరాలను 'జంటలు', హెచ్చు స్థాయి స్వరాలతో సహా 'మధ్యమషడ్జమం' లో 'కళ్యాణీ', 'శంకరాభరణం' రాగాల స్వరస్థానాల్లో, ఆరోహణ, అవరోహణ, అకారసాధనా త్రికాలాలు సాధన చేశాను. త్రికాలం సాధన చేయు అకార విధాన సరళి.

స రి గ మ ప ద ని స

రి గ మ ప ద ని స

గ మ ప ద ని స

మ ప ద ని స

ప ద ని స

ద ని స

ని స

స

స ని ద ప మ గ రి స

ని ద ప మ గ రి స

ద ప మ గ రి స

ప మ గ రి స

మ గ రి స

గ రి స

రి స

స - వీటిని కథకు లెక్కువగా త్రికాలములలో సాధన చేయాలి. నాలుగు వేదాలకు ఆటపాట అభినయాలందించినట్టి గానం, లయ, తాళగతుల స్వర, శృతి మరియు స్వరాలాపనలను నందించి నట్టి పదిగుణాలు, అష్ట ఐశ్వర్యాలను ప్రభోదించినట్టి యక్షగాన బిడ్డయే 'బుర్ర కథాగనం':

మధురగతి, ద్విరదగతి, వృషభగతి, మంజుగతి, అర్ధచంద్రికలు మరియూ హారతులు, జక్కులరేకులు, అష్టకములు, ధవళములు, జోలలు, శోభనములు, సుద్దులు, ఏలలు ద్వారా జన జీవన వివరణా గీతములు ఎన్నో ఆడుతు పాడినట్టి యక్షగాన బిడ్డయే 'బుర్రకథా గానం'. '' యక్షగాన స్రవంతి నుండి చీలిన పెద్ద పాయయే బుర్ర కథా గానం'' అన్నారు శ్రీనివాస చక్రవర్తి . (ఆంధ్రదర్శిని 777 పేజీ )

(జన జీవనం, కళాకవితా పరిణామాలు గుర్తించుటకు, మానవ లక్షణాలు చిగురించుటకు వీలుచిక్కింది, చంద్రగుప్త, అశోకుల పాలనే భారతదేశ తెలుగు జాతి ప్రగతికీ దోహద పడినది. ప్రా. ప్ర. చరిత్ర రష్యా ప్రంట్ పేజీ 94 ఎప్. కోరోస్కిన్ వ్రాశారు. ఇది మాటికి నూరు నిజం)

వీధినాటకాల పేరుతో దేశీయ రాజులు బుర్ర కథ మాలికలతోనే ఆట, పాట, గానాలు వ్రాయించారు కాని అవి సామాజిక శ్రమ జనితాలు కావు. ప్రేమ, శృంగార, కామ దేవుళ్ళ ప్రాతి పదికపై నిర్మించ బడినట్టి రతి క్రీడా ప్రధానమ్మైనవి. వీటికి సిద్ధాంత గ్రంథం 'వాత్స్యాయన కామ సూత్రాలు', 'మతాంగనల నాట్య దర్శిని' మొదలైనవి రాద్ధాంతం. ఒకటి మెదడుకు మేత , మరొకటి హృదయాల రాత.

తోలు బొమ్మలాటల జనన వృత్తాంతం ప్రజల నాలుకలందు గాని, చరిత్ర శాస్త్ర గ్రంధాలందుగాని నేను చూడలేదు. ఇవి సామాజిక శ్రమజనితాలు కావు. భక్తీ, ముక్తీ, ప్రాతిపదికపై నిర్మించినట్టి మోక్ష ప్రాప్తి ప్రధాన మైనది. రామాయణం, మహాభారతం వీటికి ప్రధాన ఇతివృత్తాలు అనే స్థూలంగా తెలుస్తున్నది, కనిపిస్తున్నది.

ఏది యేమైనా మౌర్య చంద్రగుప్తుని నుండి మహాత్మాగాంధీ వరకు ప్రజకు, ప్రజాకళా కారులకు స్వతంత్రాలు దక్కనివ్వలేదు. ఈ క్షణం వరకు వాటి ఉనికి కాపాడు కొనుటకు తెలుగు సామాన్య ప్రజలకు దేవులాట తప్పటం లేదు. ముఖ్యంగా బుర్ర కథా గానానికి ఆదరణ లేదనేది నిజం. క్రీ ॥ పూ॥ 800 యేండ్ల నుండి ఆర్య స్వార్థంతో నాడు తెలుగు కథా సంస్కృతులకు అన్యాయం చేశారు. నేడు ఆ ఒరవడినే (వినాశ కుతంత్రాలను) ఆంధ్ర బ్రాహ్మణ వర్గయుల్లో ఒక తెగ బుర్రకథ, బవనీ వగైరా తెలుగు కళా సంస్కృతుల చంపచూస్తుందేమో అనుకుంటున్నాను-ఇందుకు రుజువు చంద్రగుప్తుని చరిత్రే.

బుర్రకథా గానం కూడా యక్షగానంవలె తాత నుండి మనుమనికి, తండ్రి నుండి బిడ్డకు వంశపారంపర్యం గానే వస్తున్నది. బుర్రకథను 'భిక్షకవృత్తి కళగా' వాడుకుంటున్నట్టి చెంచు జంగాలు, మాల, మాదిగ దాసర్లు, దేవ చెంచు, కృష్ణ చెంచు వగైరా స్త్రీల, పురుషుల నాలుకలపైనే ఈ రగడలు, సాయలు, లయ తాళ నడకలు విని, చూచీ నేను నేర్చుకున్నాను. 1943 సంవత్సరం నుండీ కమ్యూనిష్టు పార్టీ ప్రోత్సాహంతో సాధన చేశాను.

ఈ గానానికి సంభందించిన సాయలను వీధి భాగవతుల నుండి, బవని, ఝుముకు, పంబల వగైరా జనపద గాయకులనుండి విని సాధన చేశాను. అభివృద్ధి క్రమంలో ఉత్తర దేశ గాయకులు కరీంఖాన్, బిస్మిల్లా ఖాన్ షహనాయ్ నుండి, ఓంకార్‌నాద్ ఠాగూర్, బాల గంధర్వ గాయకుల నుండి విని సాధన చేసాను. మన జాతి సాయలూ, ఎట్లూ చెడని రీతిలో వాటిని కలిపి గానం చేస్తువచ్చాను.

శబ్ద మాలికలు పలికించే తంబుర ఎడమ భుజాన పెట్టవద్దు. ఎందుకంటే తంబుర కుండ రొమ్ము కానుకుని వుంటుంది కనుక ఆక్రిందనే గుండె ఉంటుంది. దానికి బరువు అనకూడదు. దమ్ముబట్టి పాడాలి గనుక కుడి భుజానే తంబుర ధరించాలి. కధకుని వేషధారణకి కూడా ప్రత్యేకతుంది. లోన లంగోట, పైన షుర్వ, బారు చేతుల బిర్రులాల్చీ, పైన లంగ, తలకు తోకవిడిచిన కోపు, తలపాగ కాషాయం రంగుది, అపైన యర్ర క్రాస్ బెల్టు, నడికట్టు, అందెలకు ఎర్ర చేతి గుడ్డ, తలపాగా పాలరోజా రంగుది ధరించాలి.

వీర, రౌద్ర, దుఃఖ రసభావాలన్నీ ఒక్కడే నటించాలి. గానం చేయాలి, వీరుడు, ఇల్లాలు, పెద్ద, పెడసరి అన్ని పాత్రలు కధకుడే చేయాలి. ఒక చేత అందెలు, మరోచేత తంబురా, కాళ్ళ గజ్జలాడాలి, కళ్ళురమాలి, అంగాంగాల నటించాలి. హస్యం మాత్రం ఎడమ చేతి ప్రక్క వంతసమాధాన మిచ్చేది కుడిచేతి ప్రక్కవంత. చాలా కష్టసాధ్యమైనదీ బుర్రకథాగానం.

''ప్రస్తుతం నాజర్ యుగం నడుస్తున్నదని, కధ చెప్పటంలో సాటిలేనిమేటి అని, ప్రత్యేక దుస్తులు ధరించటం నాజర్ తోనే ప్రారంభమని'' అన్నారు శ్రీనివాస చక్రవర్తి (1954 నాటి 'ఆంధ్రదర్శిని' పేజీ 778 ). ప్రజలు బుర్ర కథా పితామహుడన్నారు. నా శ్రమ కవే చరితార్థాలనుకుంటున్నాను.

## 38. పద్య కవితకు ప్రాణం - బుర్రకథ గానం

తెలగు జాతి వాఙ్మయాన్ని ఆర్యులెంత నాశనం చేశారో చూడండి. ''క్రీస్తు పూర్వం 225 సం॥ నుండి క్రీ॥ శ॥ 78 యేడ్ల నాటి వాడైన శాలివాహన శకం వరకు తెలుగులో ప్రత్యేక వాఙ్మయ మున్నట్టి నిదర్శనాలు లేవు (జగత్కధ పేజీ 245 లో వున్నది).

నన్నయ్య తన గురువు సమానులైన జాతి అనుభవ కళాజ్ఞాని యని నమ్మిన 'నారాయణ భట్టు' సహాయ సహకారాలతో, యక్షగానం, బుర్రకథాగాన మాలికల ఒరవడిలో, మహా భారత కథ వ్రాయ తలపడెనని నా భావన.

నన్నయ్య కాలంలో బహుళ ప్రచారంలో ఉన్నది, పండిత పొగడ్తలు రాజసన్మానాలు పొందుతున్నవి సంస్కృతనుష్టుప్పులు, ధృవాలు, ప్రతిష్టా చందస్సులు మాత్రమే కాని తెలుగు మాలికలు కావు.

నన్నయ్య మాత్రం తాను మహాభారత కథను తెలుగు లోనే రాస్తానన్నాడు. అదీ పండిత సమక్షంలోనే రాస్తానన్నాడు. తెలుగు భాషతో పాటు తెలుగు అక్షర మాలికలను,

ఉద్దరించాలనే తలంపుతో జాతి సాహిత్యానుభవమున్న వాఙ్మయ దురంధరుడును, సహోధ్యాయుడును, తనకిష్టుడు ఐనట్టి నారాయణ భట్టును వెంట బెట్టుకొని, స్నేహితు లిద్దరు గూడేలు వెళ్లి,వాళ్ళందరితో పరిచయం చేసుకుని, వారి వారి భిక్షక, వైద్య , అనుభవ కాలజ్ఞానం తాలూకు సోదీ, వాస్తు రిధిములన్ని లయ తాళ మాలికల్లో విన్నారు, అన్నారు మననం చేసుకున్నారు. స్నేహితులిద్దరు, నేను చేసిందే వారానాడు చేశారు అనుకుంటున్నాను.

ఉదా ॥ నెత్తిన నెమిలీకెలు, చేతిలో జేగంటతో లయ, తాళ, నడకలో కృష్ణచెంచు పాట-

ఏవూరు ఓ భామ - తంధానా
ఎవ్వారిదానావె - తంధానా
రేపల్లె వాడాలో - తంధానా
గోపెమ్మ నీళ్లాడె - తంధానా

నన్నయ్య :''మిమ్మల్ని ఏ కులమంటారు తాతా ? '' అన్నాడు.

తాత : 'మేము కృష్ణ చెంచులం నాయనా'' అని నాతో చెప్పిందే నన్నయ్యకు చెప్పి వుంటారని నే భావిస్తున్నాను. ''ఏన్ని తెగలున్నారు మీ గూడెంలో'' అన్నాడు నన్నయ్య.

తాత : ' 1.'' దేవర పెట్టెతో భిక్షాటన కొచ్చే ''దేవచెంచులు''

2.'' మందులమ్మే కోయ చెంచులు''

3.'' సోది, గద్దె చెప్పే ఎరుక చెంచులు''

4.'' బుడుబుక్కల చెంచులు''

5.'' మేము కృష్ణ చెంచులము. అనే ఐదు తెగలమున్నాము దొర.''

ఈ విధంగా పరిశీలిస్తు, పరిశోధిస్తు మహా భారత యుద్ధ కధను స్నేహితులిద్దరు పద్య రూపంలో వ్రాయటం ప్రారంభించారు. ఈ విషయం ఆదిపర్వం అధ్యాయం పేజీ 25 లో వ్రాశారు. నా అభిప్రాయాన్నీ పూజ్యశ్రీ త్రిపురనేని రామస్వామి గారు సూత పురాణంలో ఈ క్రింది పద్య రూపంలో బలపరిచారు.

**సీస పద్యం -**

మోట మానిసి నోట - మోజు చిందులు ద్రొక్క-
పని పాటలను తాను - పాడనేర్చె
జోల పాటలు నేర్చె - ఏల పదములు నేర్చె
గొబ్బిళ్ళ పాటల్లో - కులుకు నేర్చె

తే వారములు నేర్చె - ద్విపద మంజరులాను
త్రిపద చొక్కపు నీడ- తీరు నేర్చె
రగడలన్నియు నేర్చె - రహినక్కరులు నేర్చి
జంగము కధలమేల్ - చాల నేర్చె.

దుర్మార్గంగా ఆర్య కవిపండితులు నిషేదించిన యక్షగానాది మధుర కవితలన్నింటిని, ప్రజల నాలుకలపై నాట్యమాడే మాలికల నన్నింటిని మనసుతో గ్రహించి, అవే రిధిములను, అక్షర లెక్కలను లయ, తాళ నడుకలను బట్టి బుర్రకధ గానం ఆధారంతోనే నన్నయ్య మహాభారత యుద్ధాన్ని పద్య కావ్యంగా వ్రాశారని నేను రుజువు చేయబోతున్నాను. ఎలాగంటే మహాభారత ఆదిపర్వం పేజి 33 సీసపద్యం ద్వారా వివరిస్తాను.

(సీసమనగా సిరులనొసంగు మాలిక (ఆ॥వె))

సీ : కురువలి చేదూలు - కపిల జటావళి
కరమొప్పు శిఖలుగా - కనకరత్న
మయజాల భూషణా- మల దేహదీప్తుల
తేజంబు గా నతి - దీప్యమాన

మిగతా నాల్గుపాదాలు పై నాల్గు పాదపు అక్షర లెక్కల మాదిరిగానే ఉంటాయి. పై నాలుగు పాదాల అక్షర లెక్కలు పరికిస్తే కృష్ణ చెంచులు పాడేటి 'మధురగతి' మాలికలు ఉన్నవి. ఎలాగో చూడండి :

ఉ ॥ కృష్ణచెంచు మాలిక :

ఏవ్వూరు ఓభామ - తంధాన
ఎవ్వారి దానవె - తంధాన

1. వివరణ : నన్నయ సీసపద్యం। (మ॥ ఆ॥ పేజీ 33)

కపిల జటావళి - తంధాన
కరమొప్పు శిఖలుగ - కన్కరత్న
మయజాల భూషణ - తంధాన
మలదేహదీప్తులూ - తంధాన
తేజంబు గా నతి - దీప్యమాన

2. వివరణ : నన్నయ్య ఆటవెలది

కడకు నేగు దెంచె కన్యలు దనుజాధి ! రాజసుతయు దోడ రాగనొప్పి.

**మధురగతి ॥**.    కడకు నేగుదెంచె - తందాన

కన్యలు దను జాధి - తందాన

రాజసుతయుతోడ - రాగనొప్పి

ఈ విధంగా సీసపద్యంలోని ఎనిమిది పాదాలలో పదిరెండు మధురగతి మాలికలు దాగి వున్నాయి. మిగిలి నాలుగు తందాన ఊతపదాలకు, కథయొక్క అర్థోక్తిలో అక్షరాలు, వాక్యాలు, అతికినదే ''సీసము''.

అలాగే ఆటవెలదిలో నాలుగు పాదాలలోను రెండు మధురగతి మాలికలు ఉంటాయి. ఊతపదాలకు కథ అర్థోక్తి ననుసరించి అక్షరాలు వాక్యాలు కూర్చినదే ఆటవెలది. ఇది మన కవితాపితామహుడు కనుగొన్న సీస పద్యమలోనే దాగొన్న (బుర్రకథ) కృష్ణచెంచు మాలిక. ఇప్పుడు ఆ నన్నయ్య మహాభారతం ఆదిపర్వం పేజి 33లో చంపకమాలలో ఏమాలిక దాగుందో వివరిస్తాను.

(చంపకమాల : అనగా సంపంగి పూదండ అని అర్థం)

నన్నయ చంపకమాల :

చ ॥ ల    పతివిహితాను రాగమున బార్గవు పుత్రి యయాతి చేత వం

చితయయి నాడు దానవికి జేసిన నెయ్యమెరిగి కోపదు ః ధుఖితమై

మిగతా రెండు పాదములు పైరెండు పాదపు అక్షర లెక్కల మాదిరిగానే వుంటాయి. పైరెండు పాదపు అక్షరలెక్కలు పరికిస్తే ఎరుకల చెంచులు (సోది, గద్దె) పాడేటి 'ద్విదగతి' మాలికలు ఉన్నవి ఎలాగో చూడండి.

ఉ॥ ఎరుకల చెంచులు మాలిక

ఇంత గల శరదనే నమ్మో - నేను

ఇల్లిడిసి పోలేదె తల్లో - భళి భళి

వివరణ : నన్నయ ఉత్పలమాల పద్యం

పతివిహితానురాగమున - భళి భళి

బార్గవ పుత్రి యయాతి - భళి భళి

చేతవంచింత యయినాడు - భళి భళి

దానవికి చేసినా నెయ్యం - భళి భళి

మ్మెరిగి కోపానదుఃఖితయై - భళి భళి

ఈవిధంగా ఉత్పలమాల పద్యంలో నాల్గు పాదాలతో పది (బుర్రకథ) అర్ధచంద్రికలు కూర్చినదే చంపకమాల. ఇక 'మత్తకోకిల' అనే పద్య పాదాలలో దాగిన మాలిక వివరిస్తాను. (మత్తకోకిల అనగా చిలుక గోర్వంకల పలుకుల మాల అని అర్థం)

నన్నయ్య మత్తకోకిల పద్యం : (భారతం ఆదిపర్వం 35 పేజి)

మత్తకోకిల : దండి తాహిత వీర సూరిని దానదాన వినోద కో

దండ పార్థ పరాక్రమ ప్రియధా మదిక్పరిత పూరిత

మిగత రెండు పాదాలు పై రెండు పాదాల అక్షర లెక్కలమాదిరిగానే ఉంటాయి. పై రెండు పాదపు అక్షరలెక్కలు సృష్టి కోయచెంచులు పాడే 'వృషభగతి' మాలికలే ఉన్నవి ఎలాగో చూడండి ;

ఉ॥ కోయచెంచు మాలిక

" చెవులో చీముకు - చెవులో పోటుకు "వాయినొప్పకి వాతనొప్పికి" వహ్వారే వహ్వాం

వివరణ : నన్నయ మత్తకోకిల పద్యం

"దండితాహిత వీరసూరుని ధాన దాన వినోదకో" వహ్వారే వహ్వాం

ఈవిధంగా మత్తకోకిల పద్యంలో నాల్గుపాదలతో నాలుగు వృషభగతి మాలికలు ఉన్నవి. ఇక ఉత్పల మాల, శార్దూలం, కందం మొ॥ పద్య పాదాలలోను పై మాలికలే దాగున్నాయి. చూడండి.

శార్దులం - (అనగా బెబ్బులుల మాల) - (ఆది పేజీ 61)

''దాని స్నేరకయందఖున్ - వివశులై తారున్న నస్నీరీతిలో

గానం గాని శరీర ముంగల మహోగ్రగ్రాహమున్ గోత్రభి''

మిగత పాద అక్షరలెక్కలు పై విధంగానే ఉంటవి. పైరెండు పాదాల అక్షర లెక్కలు ఎరుక చెంచు అర్థ చంద్రికలు మాదిరి గానే ఉంటుంది.

దానిన్నేరకయమ్దరున్ - వివశులై

తారున్న నన్నీ రీతిలో - భళి భళి

గానం గాని శరీరము - గలమహో

గ్రగ్రాహమున్ గోత్రా భి - భళి భళి

పదానికి రెండర్థ చంద్రికలు, రెండూత పదాలు, ఐతే మొదటి ఊతపదానికి అర్థోక్తిలో వాక్యం అతికారు. ఇట్లా నాలుగు పాదాల్లో అర్థ చంద్రికలు, ఊత పదాలు అతికినదే శార్దూల పద్యము.

- (నన్నయ భారతం పేజీ - 69)

కందం : మీరెరుగ నట్టిలోకా చారము కలదయ్యా తొల్లి చన్న మహాత్ముల్

ఇట్లా ఇవే అక్షర లెక్కలతో మిగతా రెండు పాదాలు పూర్తి చేశారు.

ఉదా ॥ కృష్ణచెంచు - ఏవూరు ఓ భామ - తంధానా

ఎవ్వారి దానావే - తంధానా

నివరణ నన్నయ్య కందం మీరెరుగానట్టి - తంధానా

లోకాచారము - తంధానా

కలదయ ఆ తొల్లి - తంధానా

చన్నమహాత్ముల్ - తంధానా

నాలుగు చరణాలలో ఎనిమిది మధురగతి మాలికలు కూర్చబడిందే కందపద్యం.

నన్నయ్య తరవోజ - (నన్నయ్య భారతం పేజీ - 158)

తరవోజ : ఏ నేడ నింద్రాదు లేడ - వహ్వా

వారలకు నెప్పుడు మొక్క - వహ్వా

దేను నీ ధనము భూ నాధా - వహ్వా

నీ గుణంబులు హంస చేత - వహ్వా

బొలుపుగా విని మనంబున నిలిపి యున్న - వహ్వా

ప్రద్వి అమూల్య మణిభూష ణమ్ముల్ -

గజాశ్వ బృందం మ్ములున్ - ఓయమ్మ. (ద్విరదగతి ఝంపె - సోది - గద్దె)

సోది చెంచు - 'ఇంత గల శరదనే - నమ్మో - ఓలమ్మ.' మాలికలు ఉన్న

ఇట్లా బుర్ర కథాగానం యొక్క మాలికల్లేని పద్య పాదం లేనే లేదు. మహా భారతంలో బుర్ర కథా మాలికల్లో అక్షరాలు పొట్టి, పొడుగు, వత్తులు సవరించి పేర్లలో, వాక్యాల్లో, సమాసాల్లో పొందు పరచి సీస మాలికలని, చంపక , ఉత్పల మాలలని, శార్దూలం, ఆటవెలది, కందం అని గౌరవ ప్రదమైనట్టి పేర్లు బెట్టారు నన్నయ. 'రగడ'లు అనే ఆర్య పండిత కుశ్చిత కుట్రతో కూడిన పేర్లు కనపడకుండా చేసారు నన్నయ్య. వీటినిలా కూర్చటంలో, నన్నయ్య శారీరక మానసిక శక్తుల ధారబోశాడనుటకు ఆయన అకాల మరణమే రుజువు. కనుక బుర్ర కథ మాలికలే నన్న య్య కాలానికి మిగిలి ఉన్నవి. నన్నయ్య కు ముందు 1600 ఏండ్లల నాటికి యక్ష గానం నిషేధించబడింది. కావున నన్నయ్య కాలానికి బుర్రకథే మిగిలివుంది.

**నన్నయ్య నుండి నాజర్ వరకు -**

''భారత , రామాయణాలు వ్రాయుటకు ప్రజ కల్పించిన కథలు, గాధలు, పాటలె ఆధారం''. (ప్రా.ప.చరిత్ర పేజీ - 83 కోరోస్కీన్.)

నన్నయ్య గారి కవితా నడకల ననుసరించినవే గాక, నేటి తెలుగు సాహిత్యంలోనే తంజావూరు యక్షగానాల పేరుతో వున్న కొన్ని వృషభగతి మాలికల నుదహరిస్తాను. వీరు యక్షగానాలపేరుతో వ్రాసిన కథా వస్తువులు ఆ గానానివి కావు. నాటికున్నవి బుర్ర కథ రగడలు మాత్రమే-వీరు పుట్టేనాటికి యక్షగానం పోయి దాదాపు 1000 యేండ్ల యింది . క్రీ॥ పూ॥ 500 యేండ్ల నాడే యక్షగానం నిషేధించబడినది.

రతీ కళ్యాణం - **వృషభగతి మాలిక పోలిక** 7 + 7 = 14 అక్షరాలు.

లయ - తాళ - నడక - తకిట - తకధిమి - తకిట తకధిమి

గుమ్మెట రిధిం : - ధీం తా ధీం ధీం త్తా ధీం ధీం

| | | |
|---|---|---|
| యేలనే ఈ | - | చెలము బాలరొ |
| సఖియనీకు | - | దక్కితినినే |
| బాణములకు | - | చిక్కితినినే |

తం॥ య ॥ విజయ భాస వృషభగతి - 7 + 7 = 14 అక్షరాలు

| | | | |
|---|---|---|---|
| గుమ్మెట రిధిం : | తకిట తకధిమి | - | తకిట తకధిమి |
| | ఉడుములాను | - | బట్టి తెచ్చియు |
| | కొడవలిని | - | గట్టి గట్టిగ. |

తం॥ య ॥ శశిపురంధరం ''వృషభగతి - 7 + 7 = 14 అక్షరాలు

| | | | |
|---|---|---|---|
| గుమ్మెట రిధిం : | తకిట తకధిమి | - | తకిట తకధిమి |
| | శరణు శ్రీవాసు | - | దేవ నందన |
| | శరణు శరణు | - | నతన నందన |

తం॥ య॥ శ్రీ పతి కళ్యాణంలో వృషభగతి - 7 + 7 = 14 అక్షరాలు

| | | | |
|---|---|---|---|
| గుమ్మెట రిధిం : | తకిట తకధిమి | - | తకిట తకధిమి |
| | ఎందుకీ ప్రతి | - | జ్ఞజేస్తివి |
| | మందుండ | - | వై భూసుర |

చెంచుసుబ్బారావు ॥ య ॥ చెంచు నాటకం గరుడా చలంలో వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు.

| | | | |
|---|---|---|---|
| గుమ్మెట రిధిం : | తకిటతకధిమి | - | తకిట తకధిమి |
| | భామలతోన్ | - | చెలిమి నేరము |
| | పారుటాకుల్ | - | గట్టు వారము |

వేముల పల్లి ॥ య ॥ ఉషా పరిణయం వృషభగతి - 7 + 7 = 14

| | | | |
|---|---|---|---|
| గుమ్మెట రిధిం : | తకిట తకధిమి | - | తకిట తకధిమి |
| | వేణు డడుగో | - | వచ్చెనహహో |
| | దురములోనను | - | ఓడించియు |
| | ధరణి వేముల | - | పల్లి శౌరిని. |

చుక్క పల్లి రామ నాటకం ॥ య ॥ వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

| | | | |
|---|---|---|---|
| గుమ్మెట రిధిం : | తకిట తకధిమి | - | తకిట తకధిమి |
| | ఏమిసేయుదు | - | దేవ రాయ |
| | వీని పాముసు | - | కరువ దాయను |

కొచ్చెర్లకోట చెంచు సుబ్బదాసు ॥ య ॥ సావిత్రీ పరిణయం వృషభగతి 7+7=14 అక్షరాలు.

| | | | |
|---|---|---|---|
| గుమ్మెట రిధిం : | తకిట తకధిమి తకిట తకధిమి | | |
| | వనితరో యిక | - | నేమి సేతునె |
| | వానినేనిక | - | నెటుల జూతునె |

'భక్త ప్రహ్లాద' - య - వృషభగతి - 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకదిమి తకిట తకదిమి

సుదతిరోనే - నేమి సేతునె

సుతుని యడబా - సిపుడునామది

దుఃఖమేవిధి - నేను సైతునె

'రామదాసు చరిత్ర' య ॥ వృషభగతి - 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి తకిట తకధిమి

ముచ్చటయినను - ఆడవేమిటె

ముదముతోనీ - పాదములను

'సారంగధర' ॥ య ॥ వృషభగతి - 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి

ఎంత చక్కని - వాడెకొమ్మరా

ఇంతియున్నడు - వలచుకొమ్మరా.

లేపాక్షి వెంకట్రాయ కృష్ణ నాటకం ॥ య ॥ వృషభగతి - 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి

వెడలె కంసుడు - కడు వడిగను

పుడమిగడగడ - వడకి తడబడ

పూసపాటి 'శశి రేఖా పరిణయం' ।. య ॥ వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి

యువ్వడవురా - ఇటకు వచ్చితి

క్రొవ్వి నీవరు - దెంచి నాదగు

గుర్తెరుంగక - బలి కదవునీ

పాలుట్ల లక్ష్మణ కవి 'కుచేలో పాఖ్యానము' ॥ య ॥ వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి

ఎందులకు ప్రా - ణేశదయ గల

సుందరాశరీ - ఈరవరదా

రుక్మాంగద - య - వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి
వ్రతం లన్నిట - మేటి యయినది
వ్రతం ఏకా - దశి వ్రతమే.

కూచిపూడి వారి - య- పార్థనా గీతంలో వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి
అంబపరాకు - దేవి పరాకు
మమ్మేలు భరత మాత పరాకు

మద్రాస్ - యస్. వి. గోపాల్ అండ్ కో స్త్రీల పాటల్లో వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి
మేలుకొనవే - దీన రక్షక
మేలు కొనవే - సాదు పోషక

సుభద్ర సారె పాటలో వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి
చిత్తరంపు - పావుకోళ్ళు
రతనంపు - కంబళూలు

బంతులాట పాటలో వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి
బంతులాడిరి - బాల కృష్ణులు
పూల బంతులు - చేత బట్టిరి

సువ్వి పాటలో వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకదిమి - తకిట తకధిమి
సువ్వి రామా - చంద్రా సువ్వి
సువ్వి కీర్తి - సాంద్రా సువ్వి

కోలాటం పాటలో వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి
గొల్ల వారి వాడలకు - ఏమి పనులా కొచ్చి నావురా

శ్రావణ శుక్రవారం పాటలో వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి

కళాలాసా - కిరీ టయినా

కలపా వృషా - మూ క్రిందా

ప్రమద గణములు - కొల్వ గాను

ఈ తరం నవ్యాంధ్ర గేయాల్లో యగ్ర వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గురజాడ అప్పారావు -

గుత్తునా ముత్యాల సరములు

కూర్చుకునితే - చైన మాటలు

దేవుల పల్లి కృష్ణ శాస్త్రి గేయాల్లో ఋగ్ర వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి తకిట తకధిమి

సందె కెంపుల లోక మెల్లడ

చిందు లాడగ పొలంగట్టుల

శ్రీరంగం శ్రీనివాసరావ్ గేయాల్లో ఋగ్ర వృషభగతి - 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి తకిట తకధిమి

కూటి కోసము కూలి కోసము

పట్టణములో బతకు దామని

నండూరి సుబ్బారావు ఎంకి పాటల్లో వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి తకిట తకధిమి

కొండ తిరిగి - కోన తిరిగి

చీరె చెరుగున - కూరి తిరిగి

గరిక పూవుల - కంఠ మాల

ఆరుద్ర గారి 'త్వమోహంలో' ఋగ్ర వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి

ఇది నాగలి - ఇది దాగలి

ఇది సమాధి - సయిూతానుకు

సి. నారాయణ రెడ్డి గేయాల్లో బుర్ర వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి
పొట్ట చేతను బట్టుకొ నీ
బొంబాయికి వెళ్ళి పోయెనె
ఎట్లా వున్నాడో కొడుకూ
మేమి తిన్నాడో కొడుకూ
బుర్ర కథల్లో యక్షగాన వృషభగతి

సర్వాయపాపడు బుర్ర కథలో బుర్ర వృషభ గతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి
రాముడొచ్చే డాకలాగే
కొంగలే కోలాట మేసే
నక్కలే నాట్యాలు ద్రొక్కె
ఊరపిచికలు డోలు కొట్టాయ

తంగడు లక్ష్మీ కాంతయ్య 'సముద్రమధనం'లో ॥ య ॥ వృషభగతి

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి
స్వచ్ఛమైయినా శిరసు మీరలు
చక్క బట్టుక తరుమగా మేమ్
మిచ్ఛయింతుమ - తోక బట్టెమా - నారాయణ
ఇది మీసమా -మంజూరు వాసమా

నాజర్ బొబ్బిలి యుద్ధంలో బుర్ర వృషభగతి 7 + 7 = 14 అక్షరాలు

గుమ్మెట రిధిం : తకిట తకధిమి - తకిట తకధిమి
అట్టి మాటకు ధర్మరాయం
డగ్గి పిడుగయి - భగ్గు మనితా
పట్టి మీసము - పట్టి దువ్వాడా.

**మధుర గతి**

బుర్ర కథ గానం - తురగ వల్ల మధుర గతి - 4- 4 అక్షరాలు.

కందుకూరి రుద్రయ్య 'సుగ్రీవ విజయ'లో మధురగతి - 4-4

గుమ్మెట రిధిం తక తకా - తకతకా - తంధాన పదమెత్తి వేసి దురితంగా పాడుకోవచ్చు.

ధీంత - ముక్కులు, చెక్కులు - తందానా

ధీం ధీం త - స్వరములు - శిరములు - తంధానా

ధీం ధీంత - కరములు నరములు - తంధానా తంధాని తంధనా

తం॥ య॥ ప్రహ్లాద చరిత్రలో మధుర గతి - 4 -4 అక్షరాలు.

గుమ్మెట రిధిం : తక తకా - తక తకా

వలపుల - పువ్వుల

వానలు - వార పై - తంధానా తందాని తందనా

త॥ య॥ కాళీయ మర్దనంలో మధుర గతి - 4 - 4 అక్షరాలు.

గుమ్మెట రిధిం : తక తకా - తక తకా

యమున నదీ తీరా

మజ్జేర గా వచ్చె - తంధానా తంధాని తందనా

తం॥ య ॥ 'పంచకన్యా పరిణయం' లో మంజు గతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా - తక తకా

గట్టిగా ననుబట్టి - తంధానా

నట్టేట పడదోసె - తంధానా

తం॥ య॥ 'శశిపురంధర' లో మధుర గతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా - తక తకా

చాటర ఈ మాటా - తంధానా

ఏలర దేవేంద్ర - తంధానా

వీధినాటకాల్లో యక్షగాన మధుర గతి - 4 -4 అక్షరాలు

యాదవ దాసు 'గరుడా చలం' చెంచు నాటకంలో మధుర గతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా తక తకా

ఫాలమందా బ్రహ్మ - తంధానా

యేతీరు వ్రాసెనో - తంధానా

రామానుజపుర 'భక్త ప్రహ్లాదలో' మధుర గతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా తక తకా

తారతమ్యము లేక - తంధాన

తనయుని ఎట్టులా - తంధాన

వేముల పల్లి 'ఉషాపరిణయం' లో మధురగతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా - తక తకా

పట్టు పట్టీ పట్టి - తంధాన

పట్టుడి ఇప్పుడే - తంధాన

పాలుట్ల కవి 'కుచేలో పాఖ్యానం' లో మధుర గతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా తక తకా - తంధానా

నిన్ను సుగుణనిగ - తంధానా

నేరకా పోయితి - తంధానా తంధాన తంధాన

'లేపాక్షి కృష్ణ జల క్రీడ' నాటకంలో మధుర గతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా తక తకా

రావెమె - వయ్యారి - తంధానా

రారావె - రావెమే - తంధానా

పూస పాటి 'శశిరేఖా పరిణయం' లో మధుర గతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా - తక తకా

ఆనంద మయ్యశ్రీ - తంధానా

కాయమిక నీసొమ్ము - తంధానా

యస్. వి. గోపాల్ అండ్ కో 'స్త్రీల పాటలు' లో మధుర గతి

మేలుకొలుపు పాటలో మధురగతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా తక తకా

బంగరూ - చెంబుతో - తంధానా

పన్నీరు - బట్టుకా - తంధానా

పడతి రుక్మిణి వచ్చె - తంధానా

'చిలుక రాయబారం' పాటలో - మధుర గతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా తక తకా

ప్రాణ ప్రదంబయిన - తంధానా

పంచ వన్నెల చిలక - తంధానా

'అంపకాల పాట'లో - మధుర గతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా - తక తకా

శలవిచ్చి - మాయమ్మ - తంధానా

చెలగిమి - అత్తింట - తంధనా

తలుపు దగ్గర పాటల్లో మధుర గతి - - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా - తక తకా

శ్రీకాన్ తా - మణీ - తంధానా

నేనునీ సుఖుడ నే - తంధానా

చలక ముగ్గుల పాటల్లో మధుర గతి

గుమ్మెట రిధిం : తక తకా తక తకా

శ్రీకర మనుచును

శ్రీ కృష్ణ తులసి - తంధానా తంధాన తంధానా

కోలాట పాటలో - మధుర గతి

గుమ్మెట రిధిం : తక తకా - తక తకా

శివ శివ మూర్తివి

గణ నాధా నీవు

శివుని కుమారుడవ్

గణనాధా నివు

గురజాడ అప్పారావు గేయాల్లో మధుర గతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా తక తకా
ఆటల పాటల
పేటిక లారహ
కమ్మని మాటల
కొమ్మల లారా - తంధనా తంధాని తందనా

దేవుల పల్లి కృష్ణ శాస్త్రి గేయాల్లో మధుర గతి

గుమ్మెట రిధిం : తక తకా తక తకా
నవ్వి పోదురు గాక
నాకేటి సిగ్గూ - తంధానా

శ్రీరంగం శ్రీనివాస రావు గేయాల్లో మధుర గతి

గుమ్మెట రిధిం : తక తకా తక తకా
మరో ప్రపంచం
మరో ప్రపంచం - తంధానా తందాన తంధనా

నండూరి సుబ్బారరావు ఎంకి పాటలో - మధుర గతి - 4 -4 అక్షరాలు

గుమ్మెట రిధిం : తక తకా తక తకా
ఆరి పెయ్యే - దివ్వె - తంధానా
వెలుగులో నీ మీద
నిలుపలేనే మనసు - తంధానా

ఆరుద్ర గేయాల్లో త్వమేహం మధుర గతి

గుమ్మెట రిధిం : తక తకా తక తకా
వినండి మీరంత
రనండి - నా పంధ
నాకేవి - జయమని - తంధానా

సి. నా. రె. గేయాల్లో మధుర గతి - 4 -4 అక్షరాలు

తక తకా తక తకా
సూరయ్య వంటికీ
నిప్పంటు కున్నది - తంధానా తంధాని తంధానా

బుర్ర కథలో మధుర గతి - 4 -4 అక్షరాలు

జంగం సుబ్బయ్య కాంభోజ రాజు కథలో మధురగతి

గుమ్మెట రిధిం : తక తకా తక తకా
తాతా పేరు - నల
కూబరాజుగా
తండ్రి పేరు కాం
భోజరాజుగా - తంధానా తంధాని తంధానా.

సుంకర సత్యన్నారాయణ 'స్టాలిన్' బుర్ర కథలో మధురగతి.

గుమ్మెట రిధిం : తక తకా తక తకా
అంతటా హిట్లరూ
అట్టహా సంబుతో
పంతముతో మాస్కో - తంధానాతం దాని తంధానా

నాజర్ బొబ్బిలి యుద్ధం కథలో మధుర గతి.

గుమ్మెట రిధిం : తక తకా తక తకా
జోడు గుమ్మెటలు
తాధిమి యనగను
ఆడుచు పాడగ - తంధానా తంధాని తంధానా.

**అర్థ చంద్రికలు**

జాతి యక్షగానంలో ''అర్థ చంద్రికలు'' అప్పకవీయంలో అర్థ చంద్రిక పోలిక.

''వృక్షగ సహచర బుక్షవ - దృక్షున్
బుక్షపద్భహిత్ప్రపరిషిజన - పక్షున్

ఈ దృతఘున్, పతఘున్ అనేవి పూత పదాలున్న మాట. ఆయా సందర్భాలలో భళి భళి, సై సై, తంధానా, వహ్వా అని వాడు తునట్లే ఇవి యక్షగానంలోను అంతకు ముందున్న దేశి గాన మనబడే బవని కథల్లో వాడినట్లు చరిత్రల్లో వున్నవి. కనుక అప్ప కవి నిర్వచనం అటతాళ మంజు గతి మాలికలో 'అర్థంబు అర్థ చంద్రికలు వీలు' అని అనగా మంజుగతి 24 అక్షరాల్లో సగం అనగా 12 అక్షరాలు అర్థ చంద్రిక 'దృతఘున్, పతఘున్ ఊత పదాలు.

కం ॥ రుద్రయ్య సుగ్రీవ విజయంలో అర్థ చంద్రిక - 12 అక్షరాలు.

కన్నులు నశ్రులు గమ్మగ - వగచున్
ఔరా విధి వశ మనితల యూచున్

తం ॥ యక్షగాన ప్రహ్లాద చరిత్రలో అర్థ చంద్రిక - 12 అ

పాముల వాడా - బాలుని - అప్పుడ్
బాముల బెట్టెను పాముల - చేతన్

తం ॥ యక్ష గానం పూతనా హరణంలో అర్థ చంద్రిక - - 12 అక్షరాలు.

నల్లని - దేవర - నాతిని - సాతిన్
బళ్లా రాయుడు - బసవయ - పుత్రున్

తం॥ యక్ష గానం కాళీయ మర్థనంలో అర్థ చంద్రిక - 12 అక్షరాలు.

జాగురు వేటలు జాలుచు - నప్పుడు
శౌరి గోపికతో జల కేళి - సల్పెన్

తం ॥ యక్ష గానం హేమాబ్జనాయికా స్వయంవరంలో అర్థ చంద్రిక - 12 అక్షరాలు.

మధుర శైలం బు మహిమచె - గొచ్చెన్
కొందరు బృముదా - రకులకు - దెంచెన్

తం ॥ యక్ష గానం అన్నదానమహా నాటకంలో అర్థ చంద్రికలు.

నీరజ ముఖులూ - నెమ్మితొ - గొల్వన్
పారుడు మన్మద - ఆకారు - డొచ్చెన్

వీధి నాటకాల్లో బుర్ర గానం - అర్థ చంద్రికలు - 12 అక్షరాలు.

య ॥ గరుడాచల చెంచు నాటకంలో అర్థ చంద్రికలు - 12 అక్షరాలు.

మృగ వేట కాడను నేను - భళి భళి
ఘనముగ చెప్పెద ఆలించు - భళి భళి

వేములపల్లి ఉషా పరిణయంలో అర్థ చంద్రిక - 12 అక్షరాలు.

కలకంటి నారి తాకలసి - బొగిమ్స్
నీ చెలువమున కేలనే - ఓయమ్మ

తిరునగరు శేషాద్రి 'రామ నాటకం'లో అర్థ చంద్రికలు - 12 అక్షరాలు.

జయ జయ రామయమేలే - సై సై
జయమగు సీతకు మేలే - సై సై

యద్ల రామదాసు చరిత్రలో ॥య ॥ అర్థ చంద్రికలు - 12 అక్షరాలు.

అడుగు దాటి కదల నివ్వను - సై సై
అభయ మివ్వని న్విడను - సై సై

పానుట్ల లక్ష్మణ కవి 'కుచేలోపాఖ్యానం'లో అర్థ చంద్రిక

మన్రామచంద్రునకు మంగళమ్మనరె
మదన జనకునకు మంగళమ్మనరె

వెంకటరాయ లేపాక్షి 'కృష్ణ జల క్రీడల్లో - అర్థ చంద్రికలు

చన్నువిడువరా యోరి చన్ను విడువరా
చిన్న వాడనుచు నమ్మి

యస్. వి. అండ్ కో మద్రాస్ 'స్త్రీల పాటల్లో - అర్థ చంద్రికలు

గంగా గౌరీ సంవాదంలో అర్థ చంద్రికలు
శివ శరణు మాం పాహి - శివునకు - శరణమ్

'మేలు కొలుపు పాటల్లో అర్థ చంద్రికలు - 12 అక్షరాలు.

తెల్ల వారెనురా - తూర్పు - నందున్
నళినమగు శృతి తమములు - విడిచె

'వరయూరు సవతుల పోరు'పాటల్లో ॥ య ॥ అర్థ చంద్రికలు.

ఇందువదనరో వింటిర బుద్ధిన్
చంద్రవదనరో - కంటిల బుద్ధిన్

'సీతా కళ్యాణం'పాటలో అర్థ చంద్రికలు - 12 అక్షరాలు.

శృంగార మైనట్టి సుదతీ - రత్నమ్
చంద్రవంశాముున జన్మించెన్

గురజాడ అప్పారావు గేయాల్లో - అర్ధ చంద్రికలు - 12 అక్షరాలు.

మనిషే చేసిన రాయీ - రప్పకు
మహిమ కలదని సాగి మొక్కుటను

దేవుల పల్లి కృష్ణ శాస్త్రి గేయాల్లో అర్ధ చంద్రికలు

తిమిరల తరణి కుసుమందాల్పన్
కర్కశ శిలయు జీవక ళ్ళేలన్

శ్రీ శ్రీ గారి గేయాల్లో అర్ధ చంద్రికలు - 12 అక్షరాలు.

పాపము పుణ్యము ప్రపంచ మార్గమ్
కష్టము సౌఖ్యము ప్రపంచ మార్గమ్.

'ఆరుద్ర' త్వమేహం లో ॥ య ॥ అర్ధ చంద్రికలు - - 12 అక్షరాలు.

గుండెల దిగులూ కూలెడి వేళన్
చెండుము చెరుపును చేసెడి వాళ్ళన్

సి. నారాయణ రెడ్డి గేయాల్లో అర్ధ చంద్రికలు - 12 అక్షరాలు.

రేపటి ఉదయం నాలోన - భళిభళి
లోపలే గుస గుస లాడెన - భళి భళి

వరహావతారం బుర్ర కథ సి. వి. కృష్ణాడిపో. మద్రాస్ లో అర్ధ చంద్రిక - 12 అక్షరాలు.

శివకే శవులకు బేధము లేదని
పానుపట్న మీమహిని నిల్చె - రామ రామ

జంగం సాంబయ్య కాంబోజరాజు బుర్ర కథలో అర్ధ చంద్రిక - 12 అక్షరాలు.

కరనా టాకయా భూముల యందున్
శ్యాం భళాపూరి పట్నామందున్

పురిటి కంటి వీరయ్య దేవర శ్రీ లక్ష్మమ్మ బుర్ర కథలో అర్ధ చంద్రిక - 12 అక్షరాలు.

ఉత్తారాదీ యా భూ మందున్
అందమైన లింగాలపు అంబున్

సుంకర సత్యన్నారాయణ కష్టజీవి బుర్ర కథలో అర్ధ చంద్రిక - 12 అక్షరాలు.

రామరావణ యుద్ధము - కాదు
సీతమ్మ శరలూ కానే - కావూ

నాజర్ జానకీ వనవాసం సినిమా బుర్ర కథలో అర్థ చంద్రిక - 12 అక్షరాలు.

అన్నయాన ధరింయించిశి - రంబున్

ముని కన్యల జూపించునె . పంబున్

నాజర్ సీతారామరాజు యుద్ధంలో బుర్ర కథలో అర్థ చంద్రిక - 12 అక్షరాలు.

మరోనడకలో

చిన్న నాడె విల్లు బట్టరా - సై

చిన్న పుడి ల్లెక్కు బెట్టరా - సై

మరో నడకలో అర్థ చంద్రిక - తతక్కధోమ్ 12 అ

కాలాహి నాటక కత్తే రా -

శత్రు సేన కది మిత్తే రా -

వంత = భళానంటి భాయ్ తమ్ముడా -

భాయ్ భళానోయ్ దాదానా =

తంజావూరు యక్షగానం విజయ రాఘవ కళ్యాణం ॥ ద్విరదగతి ॥ 10

గుమ్మెట రిధిం — దినదినము సారెరార్నా - యా ప్రభు

ధిం, త, ధిం దిం — మనపాలి శౌరియే కాడొ - భళి భళి

త, ధిం, ధిం

త. విజయ రాఘవ కళ్యాణంలో ద్విరదగతి

మాసినా విడియమూ బెట్టి - భళి భళి

మైల వన్నె చీరే - గట్టి - భళి భళి

వీధి నాటకం యాదవ దాసు గరుడా చలంలో ద్విరదగతి ॥

వేటమార్గమునాకు బోయీా పూల

తోటలో విహరింత మోయి - భళి భళి

వేముల పల్లి ఉషా పరిణయంలో ద్విరదగతి

వెడలె దిగ్విజయంబు సేయా - భళి భళి

వేల్పు లెల్లా వెరగు నొందా భానుడ్

కూచి పూడి భాగవతుల పొగడ్తల హారంలో ద్విరదగతి

త్రిపురాసుర సంహారం - ఈన

ర్తకులు ఆడేను బేరం - భళి భళి
మేమున్నదీ కృష్ణా తీరం - మాదీ
కూచిపూడి అగ్ర హారం - భళి భళి

మద్రాస్ వారి స్త్రీల పాటల్లో ద్విరదగతి

కస్తూరీ రంగ రంగా మాయన్న
కావేటీ రంగ రంగా భళి భళి

ఊర్మిళా దేవి నిద్రలో ద్విరదగతి

శ్రీరామ భూపాలు డొచ్చి - పట్టాభి
షక్తుడై కొలువులో నుండా - భళి భళి

॥ ఆది భట్ల నారాయణ దాసు : హరికథ ॥ మార్కండేయ ॥ లో ద్విరదగతి ॥

చెల్లి పాయె నిరుపమా - నందా భళి భళి
శిష్టమగు నాబాల్యా - మంతా భళి భళి

॥ గురజాడప్పారావు ॥ గేయాల్లో ॥ ద్విరదగతి =ముత్యాల సరాలు॥

తగటుబంగరు చీరె - గట్టీ - ॥
కురుల పూవుల సరులు జుట్టీ - ॥

॥దేవుల పల్లి కృష్ణ శాస్త్రీ ॥ గేయాల్లో ॥ ద్విరదగతి ॥

మలిన భాష మౌక్తికంబూ - భళి భళి
మిలమిలా నాకనుల నిలువా - ॥

॥ శ్రీరంగం శ్రీనివాసరావు ॥ గేయాల్లో ॥ ద్విరదగతి ॥ మహాప్రస్థానం ॥
దారిప్రక్క చెట్టు - గేయాల్లో ॥ ద్విరదగతి ॥ మహా ప్రస్థానం ॥

కూర్చున్నదీముసిలి దొకతీ - ॥

॥ ఆరుద్ర ॥ గేయాల్లో ॥ త్వమేహం॥లో॥ ద్విరదగతి॥

కన్ఫ్యూషను ముట్ట - డించీ - భళి భళి
యంగ్ ఝుయ్‌టీని గుప్పించీ - ॥

సి. నారాయణ రెడ్డి - గేయాలు॥ నిరంతరం॥లో ॥ ద్విరదగతి ॥

ఎన్నిసారులు చెక్కితే ఓ శిల్పం - భళి భళి
ఎన్నిసారులు తీర్చితే ఓ - చిత్రం - ॥

షేక్ నాజర్॥ శ్రీరామరాజు యుద్ధం ॥ బుర్రకథలో ॥ ద్విరదగతి.

సల్లగంజీ తాగు తాడా - భళి భళి
పుల్లనీల్ చలువయం, టాడా - మన్యంలొ

యక్షగానంలోని: మంజుగతి ॥ అట తాళం ॥ మాలిక ॥

తం ॥ యక్షగానం ॥ ప్రహ్లాదచరిత్ర ॥ మంజుగతి ॥

॥గుమ్మెటదర్వు ॥ పాముల వాడా బాలు నప్పుడూ
॥ ధింత్త బాములు చెట్టెను గా - నాయన
ధిం ధింత - ధిం
ధిం ధింత - ధిం॥

తం ॥ యక్షగానం ॥ పూతన హర రేం ॥ లో ॥ మంజుగతి॥

రకపాత్తిళ్లలో బాలుణ్ణి యశోదా
ఎత్తు కొనీ యపుడూ - నాయన.

వీధి భాగవతాల్లో ॥ మంజుగతి ॥ అటతాళమాలిక

శరణు శరణు పరమేశా సామీ
శరణు లోకేశా - నాయన

చెంచు సుబ్బాదాసు ॥ సావిత్రి పరికపాయం॥ లో॥ మంజుగతి ॥

పద్మనాభ వినరా - నాయన

బేతపూడి పరబ్రహ్మకవి ॥ శ్రీయాళ॥లో॥ మంజుగతి ॥

కైలాసా పురినివాసాకాళి
లోలా హరా శంభో - నాయన

ఆది భట్ల నారాయణ దాసు ॥ హరికథలో ॥ మంజుగతి ॥ మార్కండేయ॥

వినుడీ మార్కండేయుని చరితము
వివరించెదమీకూ - నాయన

స్త్రీల పాటలో ॥ మంజుగతి ॥

బంగరు చెంబుతో పన్నీర్ బట్టుక
పడతి రుక్మిణొచ్చెన - నాయన॥

ఊర్మిళాదేవి నిద్రలో ॥ మంజుగతి ॥

అయ్యా మీరెవరయ్యా మీరింత

ఆగడమున కొస్తిరయ్యా - నాయన

మంగళ హారతులలో ॥ మంజుగతి ॥

హారతీవ్వరె మీరంబకు మంగళ

హారతులోలమ్మో - నాయన

॥హంసపాన్పు॥ పాటల్లో॥ సుమిత్ర ॥ మంజుగతి॥

అలసి వచ్చినా కొడుకు సుమిత్ర

హంసపాన్పు బరచే - నాయన

గరజాడ అప్పారావు ॥గేయాల్లో ॥ మంజుగతి ॥ మాత్యాలసరాలు-

మానలకు ఈ పోరాట మిప్పుడూ

దేనిగూర్చి కలిగే - నాయన ॥

దేవులపల్లి కృష్ణ శాస్త్రి గేయాల్లో ॥ మంజుగతి ॥

చిన్న పూవే వాడెనా తనం

కన్నెవలపు విడెనా - నాయన

శ్రీరంగం శ్రీనివాసరావు గేయాలు ॥ మహా ప్రస్థానం॥ లో - మంజుగతి ॥

నిజంగానే నిఖిలలోనేం

నిండు హర్షమొహీ - స్తుందా -

(నాయన)

ఆరుద్రా గారి ॥ త్వమేవాహంలో ॥ మంజుగతి

ఊరు మేధకు నిరు పేదలు - ఈ

రోజునా రారాజులు - నాయన

సి॥ నారాయణ రెడ్డి -॥నిరంతరం॥ లో - మంజుగతి ॥

అమృతము పంచి, పెడుతున్నాను

అందరు రారండోయ్ - నాయన

దేనువుకొండ వెంకయ్య ॥ బుర్రకథలో ॥ మంజుగతి॥

చంద్రవంశపా పనులు పాండు - రా

జేంద్రుని వరసుతులూ - నాయన

తంగెడలక్ష్మీనారాయణ ॥ సముద్రమథనం । బుర్రకథలో॥ మంజుగతి ॥

గిరగిర గిరగిర కవ్వము ద్రిప్పుచు

కేకలు వేయుచునూ - నాయన

కాకుమాను సుబ్బారావు॥ ట్యాన్యా॥బుర్రకథలో మంజుగతి ॥

యేమే అమ్మా ఏమి జరిగెనే

ఇంత కోపమేమో - నాయన

సుంకర సత్యనారాయణ ॥ కష్టజీవి|బుర్రకథలో ॥ మంజుగతి

రామాపురమను ఉత్తరామదిలో

రాజిల్లు నొక పల్లే- నాయన

నాజర్ పల్నాటి యుద్ధం ॥ బుర్రకథలో॥ మంజుగతి ॥

మాలామాదిగ చాకలి మంగలి

సర్వ జనుల కెల్లా - నాయన

ఏక పంక్తిలో విందుభోజనా

లేరుపాటు జేసే - నాయనా

నీళ్లు పల్లమెరుగు - నిజం కాలమరుగు

భూపతన పనిముట్లూ చేయు పనితనాలు, పొలం పనులు, పండే తరుణాలు, భూసారాలు రంగులు, ఎరువులు, తూరగట్ట వగైరా వ్యవసాయ వృత్తులు అష్ట భోగాలు , అవసరాలు, మానవతా లక్షణాలు ॥ రగడలను ఆర్య, ఆంధ్ర పండితులు ముది॥లంజ అన్నరుమాలికలు లయ, తాళగతులలొ ఆహారం ముఖ్యంగ కూడు కూర ప్రాతిపదికపై అన్నరసప్రధానంగ అక్షరాలుకూర్చిసమాసాలుపేర్చి ఆడుతు, పాడుతు, హావభావాల నటిస్తు వచ్చిన యక్షగానం ॥ క్రీ ॥పూ ॥ 700-400 యేండ్ల మధ్యకాలంలోనే ఆర్యులు నిషేధించి తెలుగు వాఙ్మయం నామరూపాలులేకుండా చేశారు ఆర్యులు వారి పురహిత పండితులు.

''యక్షగానం పేరుతో దృశ్యరచనలు నన్నయాదుల కాలంలో ఉన్న నిదర్శనాల్లేవు'' అన్నారు ఏటూకూరి ప్రభాకర శాస్త్రిగారు.॥ దాదాపు ఇదే అభిప్రాయాన్ని చెప్పారు యస్ వి. జోగారావుగారు.

ఐతే ! క్రీ॥పూ॥ 321 లో మౌర్యచంద్రగుప్త, చాణుక్యుల వెంట తెలుగు బానిస వీర విజ్ఞానుల కండగా, మాలికల్లో యక్షుల వారసులు ఆడిపాడినదే బుర్రకథాగానం - చరిత్రలో శాస్త్రాల్లో చంద్రగుప్తుడిని కొర్దిగ తవిడారు, మం త్రి చాణుక్యుణ్ణి ఆకాశానికెత్తారు.

ఆర్యుల ఆనాటి రతిక్రీడా ప్రచార నాట్యాన్ని "ఒహో! అద్భుత ప్రక్రియ!" అన్నారు . ఆబాలవృద్ధులు నేర్చుకోండంటున్నారు.

వీరుల విజ్ఞానుల ధైర్య సాహసాల పొగిడినట్టి, "కాకివలే కలకాలం బతుకుకన్నా హంసవలె అరఘుడియ చాలు'' అనినట్టి బుర్రకథా గానం తెలుగు వాఙ్మయం సోదిలోకి రానంతగా చరిత్ర పుటల్లో చెరిపి కడిగేశారు ఆంధ్రాభిమానులు.

జాతిగానం తెలుగు జాతిలో పుట్టి పెరిగింది. జాతికోసం ఆడింది. తెలుగు వాఙ్మయ అభివృద్ధి క్రమాన్ని రచించి పాడింది యక్షగానం. దాని మాలికలు అక్షర లెక్కలు లయ, తాళగతులు తెలుగు ప్రజల నాలుకల పైనే - ఆడుతున్నవని చూచాము.

'కప్ప తామరపువ్వు నీడనే ఉంటుంది' కానీ ఆపూవ్వులోని ... పుప్పొడి, తేనే సోనలను తుమ్మెద గ్రహించి దానిపై వ్రాలినట్లు' వాలారు. నారాయణ భట్టు, నన్నయ్య భట్టారకులు; పల్లె ప్రజల నాలుకలపై తేనె సోనల కన్న రుచి కరమైన రగడ మాలికలు వినీ అనీ మననం చేసుకొనీ మహా భారత కావ్యాన్ని వినూత్న వరవడిలో వ్రాశారు, తెలుగు కవితా పితా మహుడయ్యాడు నన్నయ్య భట్టారకుడు.

నన్నయ్య అడుగుజాడ శ్రీ గురజాడ, గురుజాడ అడుగుజాడ శ్రీరంగం శ్రీనివాసరావు. ఈ శ్రీశ్రీ నుండి సి.నారాయణ రెడ్డి, నారాయణరెడ్డి నుండి నాజర్ వరకూ నేటి కవుల, రచయితల గేయాలకూ కీర్తనలకు హరికథా, బుర్రకథ గానాలకు మాలికల, లయ తాళగతుల నందించినది బుర్ర కథా గానం.

తెలుగు కవితా పితామహునితో సహా కవులందరు ఈ నిజాన్ని అనగా మా కవితా పుత్రికలకు తల్లి బుర్రకథ గానం అని బైటకు చెప్పుటకూ, బుర్రకథ పునరుద్ధరణకు

పూనుటలేదు. ఈ చర్య 'తల్లిపాలు త్రాగి రొమ్ము గ్రుద్దుట' అనుకుంటున్నాను.

ఒకనాడు నిరంకుశ పెత్తనానికీ, మరొకనాడు ముస్లిం నవాబులకూ, నిన్న మొన్న బ్రిటీషు దోపిడికి వ్యతిరేకంగ పోరాడినది బుర్రకథాగానం.

స్వరాజ్యం వచ్చింది తెలుగు నాయకుల్ని సింహాసనాసీనుల చేయుటకు వారికున్నవీ లేనివీ, గొప్పతనాలు ప్రజల్లో పొగిడి సింహాసనాలెక్కిస్తే, 'వాడెక్కేనంతవరకు వాడుమల్లయ్య మా వాడు మల్లయ్య','వాడదిగి మాబోడి మల్లయ్య' అన్నట్టు. కామ శృంగార రతిక్రీడా ప్రచార నాట్యానికి కోట్లు తగలేస్తున్నారు, కుటుంబనియంత్రణ అవసరంలో బుర్రకథాగానం వైపు ఎంగిలి చెయ్యి కూడా విదిలించుట లేదీ మంత్రులు, సామంత్రులు, ఎం, ఎల్, ఎలు. ప్రణాళిక ప్రచారానికి 'బుర్రకథాగానం', కుటుంబ నియంత్రణా బుర్రకథాగానం,అక్షర జ్యోతి బుర్రకథా గానం, ఆహారం, ఆదరణ, పునరుద్ధరణ దగ్గర తొంట చెయ్యి చూపటం. జాతి కళలు ఎడల, ఏ జాతి ప్రపంచంలో ఇంత దారుణంగాలేదు అనుకుంటున్నాను.

నాడు గరికపాటి రాజారావు కమ్యూనిష్టు పార్టీ ఆధ్వర్యాన ప్రజానాట్యమండలిని స్థాపించి ''కళ కళ కోసం కాదు జాతిని సంస్కృతి నొందించింది కళ'' అన్నాడు.

''తెలుగు కవి కళాకారులారా ! ధనికులకోసం నిరంకుశ అహంకార పూరితుల కోసం కవితల్లవద్దు . గానం చేయవద్దు. పేదలకోసం వినమ్రతకోసం కవిత ల్లండి గానం చేయండి అని ఎమర్సన్ పండితుడున్నాడు'' అనిఅరిచాడు శ్రీ రాజారావు.

సుంకర, కాకుమాను, కోగంటి, మిక్కిలినేని, నాజర్ వగైరా ఎందరో యువకులు తంబురా డక్కీలు భుజాలకు తగిలించారు - కలాలు బట్టి కవితల్లార్లు-

రామాపురమని ఉత్తరాదిలో రాజిలు నొక పల్లె
ఆ పల్లెను గల వన్ని గుడిశలే అడవి కంప దుడులే॥ సుంకర

శ్రీకాకుళం గిరి జన్లురా - సై
దక్షిణా నున్నా శత్రు పై - సై
తుపాకి ధన్ ధన్ పేల్చిరా - సై
శత్రులు ఘాటిలో దొర్లెరా ॥ సై-॥ పాణిగ్రహి॥

కాపురమంతా - కరువులసంతా
జీవితమంతా - చిరుగులబొంత
గాలి కొంపలు - కాళీ కుండలు
చాలీ జాలని- కూలీ గింజలు॥

ఎన్నాళ్లీ కాపురాలు -

పొద్దున్న చద్దికూడు - మద్దాల నీలబువ్వా
కొద్దీగ జీతమాయ - పొద్దాకతోముడాయ
ఇదేం బతుకు రన్నో - ఓరన్నా జీతగాడ ॥

ఓహో రైతన్నా

నీగాటి బసవన్న- నీ తోటికూలన్న
నీకుతోడుంటారు - మాకు తిండంటారు.
డబ్బాస పడకురా - ఓరన్నా
ఇబ్బంది పడతావు - రైతన్నా ॥
ఓహో కూలి తల్లులారా!
నాటి నాటీ నాటి తుమ్మెదా - అబ్బ
నడుం ॥ కొర్రాయేనే-తుమ్మెదా - పెద్ద
ఏసు దంతున్నాడె - తుమ్మెదా ॥
ఓహో పేదలారా - దీనులారా-దరిద్రులారా
ఏ దేశమున నున్న - తంధానా
ఏ కులం వారైన - తంధానా
పేదలంతా ఒకటే - తంధానా
బాధలన్నీ ఒకటే - తంధానా
కులం కూడెట్టదురా - తంధానా
కలిసి పోరాడాలి - తంధానా - ॥ నాజర్

ప్రజల జీవితాలను వారి సాధకబాధకాలను గేయాలుగ, బుర్రకథలుగ, పాడుతు ఆడుతున్న నాట్యమండలిని నిషేధించింది ప్రభుత్వం.

పేదల ప్రజలను, పాలేళ్లను ధనికుల పైకి రెచ్చగొట్టి కలవారిపైకి భూస్వాముల పైకి ఉసికొల్పుతున్నారని జాతికళాకారులను అరెస్టు చేశారు, జైల్లకంపారు. నేను ఏడు దఫాలు జైలుకు పంపబడ్డాను. మంగళగిరి పోలీస్ క్యాంపులో త్రోసి చితక బాదారు. నాలాగా అనేక మంది కవి కళాకారులు. హింసలకు గురి చేయబడినారు.

శ్రీకాకుళంకు చెందిన (జముకుల) పాణిగ్రాహి ॥ (కథకుడు) చినబాబూలను ఏకంగా అజ్ఞాత వాసానికే పంపింది ప్రభుత్వం. ప్రజల వినోదం, విజ్ఞానం కోసమైన సినిమాల్లో అర్ధనగ్న దృశ్యాలు, దిశిమొల నాట్యాలు, పచ్చిబూతులు, వ్యభిచార, ద్వంద్వార్థ గీతాలు, పాటలకు, కామ, శృంగార, వ్యభిచార ప్రచార నాట్యాలకు పూర్తి అనుమతి ఇచ్చింది ప్రభుత్వం.

రూపాయికి అగ్గిపెట్టె, బియ్యం, ఒక్క వంకాయ రూపాయి, పచ్చిమిరపకాయ పావలా, 'కొనబోతే కొరివి అమ్మబోతే అడివి', చాటు మాటున సారాబట్టీలు సందుగొందుల బ్రాందీ విస్కీలు, అన్ని వసతులున్న లాడ్జీలు, పేకాడు క్లబ్బులు, బాడుగోలు వేషాలు, ఈడుగాని వివాహాలు, స్వేచ్ఛా వ్యభిచారాలు, తమ భార్యాబిడ్డల పోషణే, తెలివి తేటలుగా, అమాయకులను మోసగించుటే, తమ విజ్ఞాన వికాసంగ, బానిసత్వమే ( ఉద్యోగం ) పురుష లక్షణంగా సాగుతుంది. నేటి తెలుగు జాతి జీవితం కళాపరిణామం.- అందుకే నేనంటాను ఇది నీతిగల జాతి జీవితంకాదు, సత్యాన్ని చాటే కళాపరిణామం కాదు.

''దివి ఎరుంగనియది భువియెరుంగనియది
రవి ఎరుంగని యది కవి యెరుంగు॥ అనీ,

॥ఎందుకమ్మా ఆకన్నీళ్లు, నిన్నాకటికిన్ గొని పోయి అల్లా కర్నాట కిరాత కీచకుల కమ్మను నమ్మభారతీ '' -అని,

''సత్కావుల్ హాలికులైననేమ్మి గహనాంతర సీమల కందమూల కాద్దాలికులైన నేమి'' అని, పెద్దల పైన చెప్పిన సూక్తులు పాతచింతకాయ పచ్చడి అంటున్నాము. ఇది నేటి మన అవివేకం. అందుకే ఈదేశం ఎలా దోపిడికి తయారయిందంటే-

రాను రాను గ్రామల్లో నవధాన్యాలు లేవు, నాలుక్కారలు లేవు, శ్రమజీవులకు పనుల్లేవు, దొర పొగాకు, ప్రత్తి మొదలగు వ్యాపార పంటలు పుల్లు, తిండిగింజలు నిల్లు. ఈ దరిద్రం తెలిసి కూడా వ్యాపార పంటలనే ప్రోత్సహిస్తుంది. ధనస్వామ్యం, వ్యక్తి పెత్తనం.

ప్రజల యొక్క, వ్యవసాయ అవసరాల యొక్క చర్మ పరిశ్రమ, పెట్టుబడిదార్ల ఆక్రమణలో కేవలం వారి లాభాల కోసం ఉత్పత్తి చేస్తున్నది. ధనస్వామ్యం, వ్యక్తి పెత్తనం.

చలీ, వాన, ఎండా, శీలరక్షణ కోసం ఉత్పత్తి సాగిస్తూ వచ్చిన వస్త్రపరిశ్రమ, కేవలం కొందరి లాభాలకోసం నడిపిస్తున్నది ధనస్వామ్యం, వ్యక్తి పెత్తనం.

ఇళ్ళలో వండుకొనుటకు, తినుటకు, వాడుకొనుటకు ఉత్పత్తిని సాగించినట్టి, వ్యవసాయ పనిముట్ల కోసం పుట్టినట్టి, లోహ పరిశ్రమ, కేవలం కొందరి లాభార్జనకే ఉత్పత్తి సాగిస్తుంది ధనస్వామ్యం, వ్యక్తిపెత్తనం.

మానవ శ్రమజనితమైన కళలు యీ దుర్మార్గ ఉత్పత్తిని గురించి చెప్పకుండా నోరు మూయించేందుకు నిర్భంధాలు, నిరాదరణలు ప్రదర్శించి కళలను గణికనుగా చిత్రించి వాడుకుంటున్నది ధనస్వామ్యం, వక్తి పెత్తనం.

స్వరాజ్యం వచ్చినా ఇంత దారుణ దశకు ఈ సమాజం చేరుతుందని తెలిసే నాడు మహాత్మగాంధి '' భూమిని పంట పోలాలుగా మార్చింది ప్రజలు. ఆ పంట భూములను ప్రజల పరం చేయండి '' అన్నాడు.

ఆ మహాత్ముడే '' బ్యాంకుల్లోని ధనంలో ప్రజల శ్రమ ఖచ్చితంగా ఉన్నది. బ్యాంకులను ప్రజల పరం చేయండి'' అన్నాడు.

''సంపదలు సృష్టించే జాతి వనరులన్నింటిలోనూ (పరిశ్రమలు) ప్రజల యాజమాన్యం కూడా ఉండాల''న్నాడు మరోచోట మహాత్మగాంధి.

అందుకే గాంధీజీ కలలుగన్న ''గ్రామ్యధర్మం'' ఉద్ధరించక పోగా, ధన స్వామ్యం, వ్యక్తిపెత్తనం గాంధీజీని రద్దు చేయడం జరిగింది. అందుకె '' నాది నేను అనే అహంకారం పురెకి బుట్టిన బుద్ధి పుడకలతో పొడిస్తే తప్పు పోదని'' కారల్ మార్క్స్ చెప్పినట్లు, సాయుధ పోరాటం ద్వారానో, అహింస ద్వారానో ప్రతి ఒక్కడి కోసం అందరు, అందరికోసం ప్రతి ఒక్కడు శ్రమించే వ్యవస్థరావాలి, అలా అందరూ సుఖించేదే నిజమైన జాతిజీవితం. ఈ సత్యాన్ని చాటి చెపుతూ ఆడి పాడినదే నిజమైన కళాపరిణామం. అనాడే ప్రపంచాన సార్ధకమౌతుంది మన జాతి జీవితం కళా పరిణామం.

271
4029

210



## రచయిత పరిచయం:

**పేరు : షేక్ నాజర్**

**జననం :** తండ్రి షేక్ . మస్తాన్ సాహెబ్, తల్లి షేక్. బిబాబి దంపతులకు 1920వ సం॥ ఫిబ్రవరి 5వ తేదీన గుంటూరుజిల్లాకు చెందిన పొన్నెకల్లు గ్రామంలో దూదేకుల కులంలో జన్మించారు.

**బుర్రకథ కళాప్రవేశం :** కమ్యునిస్ట్ పార్టి ద్వారా ప్రజానాట్యమండలి సభ్యులుగా చేరి డా॥గరికపాటి రాజారావుగారి సాన్నిత్యంతో బుర్రకథ కళా నైపుణ్యాన్ని పెంపొందించుకున్నారు.

**రచనలు :** బెంగాలు కరువు, రాయలసీమ కరువు, పలనాటి యుద్ధం, బొబ్బిలి యుద్ధం, వీరాభిమన్య, మొ॥గు బుఱ్ఱకథలు. పిట్టలదొర, నాచేతిమాత్ర ఏకపాత్రలు, “ఆసామి' నాటకం.

**బిరుదులు :** బుఱ్ఱకథ పితామహ, బుఱ్ఱకథ సామ్రాట్.

**సన్మానసత్కారాలు :** భీమవరం వాస్తవ్యులు గన్నాబత్తుల నారాయణ మూర్తి, పెదతాత గార్లు పండితుల సమక్షంలో వీరికాలికి బంగారు గండపెండేరం తొడిగి సత్కరించారు. మరియు బొబ్బిలిదొర వారు వీరిచేతికి సువర్ణ ఘంటా కడియాలు తొడిగారు. రాజమండ్రి, కాకినాగ, రామచంద్రపురం మొ॥లగు ప్రాంతాలలోను ఆంధ్రదేశమంతట సువర్ణఘంటా కంకణం, దండకడియం, కల్కితురాయి, మొ॥గు ఆభరణములే గాక, వెండి బహుమతులు అందుకున్నారు. ఇవిగాక వీరికి మామూలు సన్మానాలు వేలసంఖ్యలో జరిగినవి.

**చలనచిత్రములు :** వీరు పుట్టిల్లు, భలెబావ, అగ్గిరాముడు మొ॥ చలన చిత్రాలలో వీరుబుఱ్ఱకథకులుగా ప్రదర్శనలిచ్చినారు. నిలువు దోపిడి, పెత్తందార్లు, సగటుమనిషి చిత్రాలకు గాత్ర, రచన సహకారాన్ని అందించారు.

**ప్రభుత్వసత్కారాలు :** కేంద్రప్రభుత్వం 1986లో “పద్మశ్రీ” అవార్డునిచ్చి సత్కరించింది. ఆంధ్రనాటక అకాడమి వారు విశిష్ట సభ్యత్వంతో సత్కరించింది. మరియు రాష్ట్రముఖ్యమంత్రులందరు జానపద కళాకారునిగా సన్మానించారు. అందులో వీరికి ముఖ్యులుగా టి.అంజయ్య మరియునందమూరి తారకరామారావుగార్లు ఆర్థికంగా, వృద్ధాప్య పెంక్షనిచ్చి ఆదుకున్నారు.

**నిర్యాణం :** వీరు 1997 సం॥ ఫిబ్రవరి 21 తేదిన గుంటూరు జిల్లా స్వగృహం నందు కన్ను మూసినారు.

